





అన్నమయ్య అధ్యాత్మ చింతన

శ్రీరస్తు

శుభమస్తు అవిఘ్నమస్తు





# అన్నమయ్య అధ్యాత్మ చింతన

## ఎన్నుకొన్న
## అధ్యాత్మ కీర్తనలకు
### అవతారిక మరియు భావ వివరణ

రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
**M.Tech.**

# అన్నమయ్య అధ్యాత్మ చింతన

మొదటి ప్రచురణ

**జూన్ 2012**

రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

వెల : **అమూల్యం**

**ప్రతులకు :**

**ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం. 61, సిద్దార్థ నగర్,**

**హైదరాబాద్ - 38. ఫోన్ : 093930 21360**

**డి.టి.పి. ప్రింటింగ్ :**

**కె. వి. ఆర్**

**98495 79345**





## అంకితము

## అహోబల లక్ష్మీ నరసింహునికి



ఆ.వె ।। అన్నమయ్య కిష్టదైవమై అలరారి
ఉర్విగాచుచున్న ఓబులేశు-
కిత్త అంకితమ్ము నిందిరమ్మను గూడి
బ్రోచుగాత జనుల పుడమియందు.

# అన్నమయ్య అధ్యాత్మ చింతన

## ఎన్నుకొన్న అన్నమయ్య కీర్తనలకు

## విషయ సూచిక

అన్నమయ్య అధ్యాత్మ చింతన

# ప్రార్థన

ఉ॥ శ్రీహరి మాయలోదగిలి చిత్త వికారపు సుళ్ళ జిక్కితిన్
దాహము తీరదాయె తలదాల్చకపోతిని దైవ చింతనన్
మోహము పాశమై బిగిచి ముందరి కాళ్ళకు బంధమాయెరా
దేహములో స్థితుండయినదీ హరియేనని నేర్వనైతిరా

శా॥ ఔరా! శ్రీహరి మాయనేర్వనగునే ఆ శూలికైనన్ భళా!
శ్రీరాముండయి గాచు మమ్ము తృటిలో జేబూని కోదండమున్
పోరాడే నరసింగమౌను తునుమున్ భూభారమౌ దైత్యులన్
మారేడై తిరువేంకటాద్రి విభుడై మాదిక్కు మొక్కొనురా

కం॥ ఆత్మనెరుంగను, యిక న -
ధ్యాత్మజ్ఞానంబుయెట్లు అలవడునయ్యా!
ఆత్మారాముని వలె పర -
మాత్మా! నడిపించవయ్యా! ఆంగజగురుడా!

మ.కో॥ నిన్నలేదిది రేపువుండదు, 'నేను' అన్నది నిత్యమా?
అన్ని నాకను లోభమాగదు ఆశ చావదిదేమిరా?
మన్నులో కలిసేది దేహము 'మాయ' అంతుకు చిక్కదే?
వెన్నడౌ తిరువేంకటేశుని వేడరాదటె చిత్తమా!

ఆ.వె॥ హరిని శరణమనక అధ్యాత్మ చింతన
అవని నరులకెపుడు అమరబోదు
హరికృపనెరిగినను అమరును మోక్షంబు
అనెను అన్నమయ్య అది నిజంబు.

తే॥ కొమి కాకున్న మోక్షంపు గడప ద్రొక్క
కాదు సాధ్యంబనిరి పెద్దలదియు నిజమె,
అవిసినవి యాసలణగారె జీవితేచ్ఛ
హరియె దిక్కుమొక్కనినాడు అమరవాది.

కం॥ వదలిన నిశ్వాసంబును
పదిలముగా లోగొనంగబడునో! లేదో!
అది యెవ్వడెఱుగజాలడు
తుది శ్వాసగు నీవు గొనక తోయజనాభా!

చం॥ అవనిని గాచినావు కద! హస్తిని బర్వులు వెట్టుచున్ భళా!
అవనిజ జానకీపతిగనయ్య! సురాంతకుడైతివో ప్రభూ!
అవనికి పీడయౌ! నృపులనంత మొనర్చిన కృష్ణమూర్తి ! ఈ
భువినిటు వేంకటాద్రి దరి మోక్షపు బాటల బెట్టినావురా!

మ॥ వనజాతాక్షుడు పద్మనాభుడితడే పాకారి సంస్తుత్యుడున్
ఘన ఇందీవరశ్యాముడున్ హరియు శ్రీకాంతుండు భూనాథుడున్
ముని వంద్యుండు మురారి శంభునుతుడున్ ముక్తీవధూటీ ప్రియున్
మన శ్రీవేంకటరాయునెంచగలరే మార్తాండ బ్రహ్మాదులున్!!

కం॥ వలపులు, సొలపులు, అలుపులు
వెలవెల పొలయుటలు, కలల బేలలగుటయున్
వలవల విలవిల రగులుట,
కలతల కనుమూయుటెల్ల 'కలియుగ' మాయే!!!

సీ॥ వరదహస్తము జూపి వరుసగా సిరులిచ్చి
కొండలరాయుడై కూడినావు
అభయహస్తముజూపి అణచిభయములన్ని
తిరుమల రాయుడై తేలినావు
వడ్డికాసులు గుంజు వనజనాభుడవీవు
శంఖచక్రంబుల శౌరివీవు
శృంగార రాయుడౌ అంగజగురుడీవు
అలమేలుమంగమ్మ వలపు పంట

ఆ.వె॥ అన్నమయ్య యిచ్చె హరిపాట హరి బాట
అతనిదారి బట్టి హితవుదెలిసి
సులువు బాట బట్టి చెలగి నానుర హరీ!
వెతలు వెఱపు దీరె వేంకటేశ!





# ముందుమాట

తాళ్ళపాక అన్నమాచార్యుల వారిపై యెనలేని భక్తి ప్రపత్తులు కలిగి నేను ఇదివరలో ఆయన కీర్తనలలో కొన్నింటిని ఎన్నుకొని మున్నుడి సహితముగా భావామృతము నందించాను. దినమున కొక్క కీర్తన చొప్పున సాగించిన ఆయజ్ఞంలో 606 కీర్తనల తరువాత నావల్ల కాదేమో అని భావించాను. అప్పుడు తిరుమల తిరుపతి దేవస్థానములవారు అందులో 101 కీర్తనలున్న సంపుటి-5 ముద్రించుటకు 30,000 రూపాయల ఆర్థిక సహాయం అందిస్తాము అనగానే శ్రీ వేంకటేశ్వరుడే నన్ను మెచ్చినట్లు తలచి ఈ జన్మకిది చాలుననుకున్నాను.

దానిపేరు "భావయామివేంకటేశమ్."

కాని నా కృషి ఆపలేదు. దినమున కొక్కటి చొప్పున అన్నమయ్య శృంగార కీర్తనలనెన్నుకొని 'ఏలుకో శృంగారరాయా'! అనే పేరుతో మరియొక 101 కీర్తనలనెన్నుకొని ఉపోద్ఘాతముతో కూడిన తాత్పర్యము నందించాను. ఇది క్లిష్టతరమైన ఉద్యోగమే అయినను, ఆ సప్తగిరీశుని దివ్యానుగ్రహంతో నేనెన్నడూ వినని మాటలకు (నిఘంటవులలో లేని మాటలకు) కూడా అర్థం స్ఫురించేది. ఇది భగవద్సాక్షిగా నేను చెప్పే నిజం. అన్నమయ్య సరసశృంగార కీర్తనల 'పచ్చితనం'లో భక్తిని, ఆత్మ పరమాత్మల సంగమంగా చూడగలిగితే దానిలో బూతు కనబడదు. ఆత్మోద్ధారణ కనబడుతుంది. 101 రోజులపాటు సాగిన ఆ 'కామయాగం'లో నాకు ఒక్కరోజు కూడా స్త్రీ పురుషుల కూటమి కనబడలేదు. ఆత్మ పరమాత్మల కలయికే కనబడింది.

అటుతరువాత అన్నమాచార్యుల వారి ఆధాత్మ కీర్తనలకి అవతారికతో కూడిన భావ వివరణ వ్రాయాలనే సంకల్పం కలిగింది. ఇదిగో మీ చేతిలో వున్న 'అన్నమయ్య అధ్యాత్మచింతన' అవతరించింది. ఇవికూడా

దినమునకొక్కటి చొప్పున 101 కీర్తనలు చేయాలని నా సంకల్పం. మరి ఆ తిరువేంగళప్ప నన్ను ఎట్లా అనుగ్రహిస్తాడో - ఏమో.

అసలు అధ్యాత్మ కీర్తనలంటే ఏమిటో అన్నమయ్య మనుమడు చినతిరుమలయ్య పద్యం వినండి.

కం॥ దేహాత్మేశ వివేకో -
త్సాహంబును లోకవేద ధర్మాధర్మా -
ద్యూహాపోహంబుల గల -
యా హరి సంకీర్తనంబు లధ్యాత్మంబుల్

తా॥ దేహము, ఆత్మ, ఈశ్వరుడు - అను ఈ మూడింటి యొక్క వివేకము నెరుంగుట, లోకములో ఆచరించబడుచున్న ధర్మములు మరియు వేద విహితమైన ధర్మము, అధర్మములు వాటినర్థం చేసికొనుటలో కలిగే ఊహలు మరియు అపోహలు విడమరచే శ్రీహరి సంకీర్తనలే అధ్యాత్మకీర్తనలు.

"మార్జాల"మంటే ఏమిటంటే "బిడాలము" అననట్లు వున్నది కదా! ఇదంతే.... మనకు అర్థమయ్యేట్లు చెప్పుకోవాలంటే కొంత మన స్వంత అభిప్రాయాలు దూరి ఇంకా చిక్కు పడే ప్రమాదం వున్నది. అయినా నా ప్రయత్నం నేను చేస్తాను. తల్లికడుపులోంచి పుట్టి, పెరిగి, జీర్ణించి, నశించుటయే వ్యాపారంగా లోక తంత్రం నడుస్తున్నది. పైన చెప్పిన దశలన్నీ మనకి కలిగాయని మనం అనుకొంటున్నాం కాని అవి కలిగినది మన శరీరానికి మాత్రమే. దాన్నే దేహం అంటున్నాం. ఈ దేహంలో పరమాత్మ యొక్క అంశ ఆత్మవలె ప్రవేశిస్తుంది. అది చైతన్యం. వికారములులేని నిర్మలానందమూర్తి. అద్వైతసిద్ధి పొందగలిగితే ఆ ఆత్మ తానే పరమాత్మ అని గ్రహిస్తుంది. ఈ శరీరం వదలిన తరువాత ఆ స్థితిని చేరుకొంటే అదే మోక్షం అంటే. ఆ స్థితి చేరుకోకపోతే ఏం జరుగుతుంది? మనం ఈ పుట్టుకలో చేసిన మంచీ చెడుల పర్యవసానం (Resultent)





మన కర్మఫలంగా మనకు జమ అవుతాయి. మన గత జన్మలలో అనుభవించగా మిగిలిన పూర్వ కర్మఫలం దీనికి కలిసి ఒక సంప్రాప్త కర్మఫలంగా మన ఆత్మకు తోడవుతుంది. దీన్ని అనుభవించక తప్పదు గాక తప్పదు.

ఈ కర్మఫలం Positive అయితే మంచి జన్మలు, Negative అయితే నీచజన్మలు కలుగుతాయి. అందుకే ఒకే విధంగా పుట్టి ఒకేచోట ఒకే విధంగా పెరిగిన ఇద్దరు సహోదరులలో ఒకడు కోటీశ్వరుడవుతున్నాడు ఇంకొకడు నికృష్టుడవుతున్నాడు. ఇది ఒక చక్రబంధం. దీని నుండి విముక్తి కావాలంటే ఆ పరమాత్మకు మన ఆత్మపై కృపకలగాలి అప్పుడు ఆయన మనకు ఆత్మజ్ఞానం అందిస్తాడు. మన అజ్ఞానం నశించి మన ఆత్మ సాక్షాత్కారమవుతుంది. మనం జీవించియున్నా రాగద్వేషాతీతులమై భవబంధవిముక్తులమై సచ్చిదానందస్థితిలో వుండిపోతాం. దాన్నే జీవన్ముక్తి అంటారు.

దాన్ని పొందాలంటే సులభోపాయం అధ్యాత్మ చింతన, విరక్తి, శ్రీహరిశరణాగతి. ఇది చెప్పినంత తేలిక కాదు. ఎందుకంటే ఆస్థితిని వివరించలేం అనుభవించాలి. ఎవరెస్తు పర్వతం ఎలా ఎక్కాలో చదివి తెలుసుకున్నవానికీ నిజంగా ఎక్కినవానికీ ఎంతో తేడా వున్నట్లే అనుభవించని ఆత్మానందం శుద్ధ నిరుపయోగం. అయితే ఎవరెస్టు ఎక్కాలంటే ఎక్కడో అక్కడ మొదటి అడుగు వేయాలి కదా!

ఈ పుస్తకం మొదటి కీర్తన చదువగానే మనం మన ఆత్మశోధనలో మొదటి అడుగు వేశాం అన్నమాటే. అదే అన్నమయ్యమాట. ఇక అనండి శ్రీవేంకటేశమ్ శరణంప్రపద్యే...

అన్నమయ్య కీర్తనలకే కాదు అనేకమంది దివ్యుల స్తోత్రాల కోసం..

Please Visit my website : www.geetadeeksha.com

## అధ్యాత్మ సంకీర్తనలు

సంపుటి: 1 కీర్తన : శ్రీహరి చేసిన చిహ్నొలివియూ
సంఖ్య : 406 పుట : 272 రాగం: పాడి

### పాడి

1. శ్రీహరిసేసిన చిహ్నొ లివి యూ -
మొహము విడుచుట మోక్ష మది ॥ పల్లవి॥

మలినం బేది మణుగననేది
కలుషపుమలముల కాయ మిది
కలిగిన దేది కడు లేందేది
చలనపుమాయలజన్మ మిది ॥ శ్రీహ ॥

తనిసిన దేది తనియనిదేది
దినదిన మాకలి దీరదిది
కొన యిందేది గుఱి మొదలేది
పనిగొనుకర్మపుబంధ మది ॥ శ్రీహ ॥

నిండినదేది నిండనిదేది
కొండలపొడవులకోరి కది
అండనె శ్రీ వేంకటాధిపు శరణని
వుండుటె యిహపరయోగ మది ॥ శ్రీహ ॥ 406

**అవతారిక:**

అన్నమాచార్యులవారి చక్కటి అధ్యాత్మ కీర్తనతో ఈ సాహితీ యజ్ఞం మొదలుపెడదాం.. అధ్యాత్మకీర్తనల బాహ్యార్థము ఒకటైతే అంతరార్థం వేరొకటిగా వుంటుంది. మనము ఆ గూఢార్థం అరయగలిగితే కీర్తన వైశిష్ట్యం తెలుస్తుంది. సంసారము మోహముచే జనించి మోక్షముతో పరిసమాప్తమవుతుంది. కాని మోహమును విడువకుంటే యేనాటికీ





అంతం కాదు. కాని దీని చిహ్నొలు (గుర్తులు) చేసిన దెవరు? ఇంకెవరు ఆ శ్రీహరియే. ఇది ఇలా వుంటుందని నిర్దేశించినదెవరు? ఆ శ్రీహరియే. మరి ఆ శ్రీవేంకటేశ్వరుని శరణనకుండా ఈ మోహంలోనుంచి బైటపడగలమా? కల్ల....

**భావ వివరణ:**

మానవునికి కలిగిన మోహము శ్రీహరిమాయవలన కలుగుతున్నది. ఆ మాయవలననే మానవుడు జన్మల చక్రబంధంలో చిక్కి కర్మలలో తగలి మోక్షమునరయలేడు. ఇవి శ్రీహరి చేసిన గుర్తులు.

మలినము అంటేయేమిటి? మణుగు (మరుగు విసర్జనము) అంటే యేది? మరి ఈ కాయము (శరీరము) కలుషితమైన మలముతో నిండినదే కదా! అసలు "ఉన్నది" అని అంటున్నది దేనిని? "లేదు" అని దేనిని అంటున్నాము? అనునిత్యం చలనపు మాయల (మార్పుచెందే మాయతో నిండిన) జన్మమే ఇది. అందుకే మనం మాయాబద్ధులం.

మనలో వుండి తనిసినదేది? (తృప్తిపడునది యేది?) తనియనిదేది? (తృప్తి జెందనివాడు ఇంకా ఇంకా కావాలి అనేవాడెవడు?) మనకు రోజురోజుకీ ఆకలి యెందుకు తీరకుండా మళ్ళీ మళ్ళీ పుడుతున్నది? కర్మబంధంలో చిక్కి పనిగొని (కావాలని) కర్మల పరంపర చేస్తూ జీవిస్తున్నాం. ఇక మరి యిందు (ఇందులో) కొనయేది (చివరిది అనేదేది?) గుఱి మొదలేది (సరియైన ఆరంభం యేది?) లేనేలేదు.

మానవునికి కలిగే కోరికలు కొండల పొడవులు (పర్వతాల యెత్తంత అనంతమైనవి). ఇందులో నిండినదేది నిండనిదేది? (తీరినది యేమిటి తీరనిదేమిటి?) ఒక కోరిక తీరితే ఇంకొక కోరిక పుడుతూనే వుంటుంది కదా! మరి తరుణోపాయమేమిటి? శ్రీవేంకటాధిపుని శరణుజొచ్చి ఆయన అండనే (రక్షణలోనే) వుండుటే. అదొక్కటే ఇహపరయోగము (జీవించియున్నప్పుడు భుక్తిని, మరణించాక ముక్తిని ఇచ్చే దివ్యవమైన ఉపాయము.)

సంపుటి : 1 కటకటా యిటుచేసె గర్మబాధ
సంఖ్య : 239 పుట : 160 రాగం: సామంతం

## సామంతం

2. కటకటా యిటుచేసె గర్మబాధ
యెటువంటివారికిని నెడయదీ బాధ ॥ పల్లవి ॥

దినదినము బ్రాణులకు దీపనముచే బాధ
తనుపోషణములు కందర్పబాధ
మనసుశాంతికి సదా మమకారముల బాధ
తనివోనికోర్కులకు దైవగతి బాధ బాధ ॥ కట ॥

వెడయాసచూపులకు వేడుకలచే బాధ
కడువేడ్కలకు వియోగముల బాధ
తొడవైన యెఱుకలకు దురితబుద్ధుల బాధ
జడియు బరచింతలకు సంసారబాధ ॥ కట ॥

అరిది నిశ్చయమతికి ననుమానములబాధ
సరిలేనిజీవులకు జన్మబాధ
తిరువేంకటాచలాధిపునిగని మని కొలుచు -
వెరవుచేతనెకాని వీడదీ బాధ ॥ కట ॥ 239

**అవతారిక :**

"కటకటా" అంటే నేటికాలంలో "అయ్యయ్యో" అనడం. కర్మల వలన కలిగే బాధ (పీడ) యిటు (ఈ విధంగా) చేసింది కదా! అని వాపోతున్నారు అన్నమాచార్యులవారు. బాధపడని ప్రాణిలేదు. అమ్మకడుపులో వుండటం ఒక నరకం. బయటకు వచ్చాక తనకి తను యేమీ చేసికోలేని దైన్యస్థితి. జీవించడంలో రకరకాల బాధలు. మరణబాధ చెప్పవలసిన పనియేలేదు. మరి ఈ బాధ యెలా పోతుందయ్యా? ఏమో దీనిని చదివి తెలుసుకోండి. ఎందుకంటే ఈ బాధ ఎటువంటివారికైనా తప్పదుగాక! తప్పదు.





**భావ వివరణ :**

కటకటా (అయ్యయ్యో!) కర్మబాధ (నేను చేసిన పనులవల్ల కలిగిన బాధ) ఇటుచేసె (ఈ విధముగా చేసినది కదా!) ఈ బాధ (వేదన) ఎటువంటివారికైనా తప్పదు కదా!

దినదినము (ప్రతిదినమూ) ప్రాణులకున్ (జీవులన్నిటికీ) తీపనము (తీపురము... అయివుండవచ్చు.... తీపురము అంటే ప్రమాదము అని అర్థం) చేత బాధ, తను పోషణముల (శరీరాన్ని పోషించుకున్నందువలన) కందర్ప బాధ (కామవాంఛలు కలిగి పీడిస్తాయి). దాని వల్ల మమకారము (నాది నాది అనే భావన) కలిగి అది మనశ్శాంతికి పీడగా పరిణమిస్తుంది. తనివోని (తృప్తిపడని) కోర్కెలు ఈ మమకారంవల్ల కలుగుతాయి. కాని దైవగతి (దేవుని నిర్ణయం) ఎలా వుంటుందో ఎవ్వరికీ తెలీదుకదా! అందుకని ఈ కోర్కెలకు ఆ దైవగతియే పీడ.

వెడయాస చూపులకు (తుచ్ఛమైన కోర్కెలతో చూసేవారికి) వేడుకలు (సంతోషం కోసం వెంపర్లాడి) బాధ కలుగుతుంది. ఆ అంతులేని వేడుకలు ఆగిపోక తప్పదు కదా! ఆ వియోగపు బాధ వేడుకలకూ తప్పదు. అప్పుడు కొంత ఎఱుక (జ్ఞానం) కలుగుతుంది. తొడవైన (మంచిదైన) ఆ జ్ఞానానికి దుర్బుద్ధి పీడగా పరిణమిస్తుంది. దాని వలన సంసార తాపత్రయం కలిగి పరచింతకు (ముక్తిపై కోర్కెకు) పీడ అవుతుంది.

ఇది ఇలా వుంటే... నిశ్చయమతికి (ఎలాగైనా సరే ముక్తి పొందాలి అనుకునే మనస్సుకు, అనుమానం (ముక్తి వస్తుందో రాదో అనే శంక) పీడ అవుతుంది. అందువలన ఏవేవో పుణ్యకార్యాలు చేయాలని ఆరాటపడతారు. దానివల్ల మళ్ళీ ఉత్తమ జన్మలు కలిగి అదీ... ఒక పీడ అవుతుంది. మరి ఇక దారి ఏమిటండీ? శ్రీవేంకటేశ్వరుని దర్శించి, ఆయనే దిక్కని కొలుస్తూ, వెఱపుచేత (భయభక్తులతో) వుంటే కాని వీడదీబాధ (ఈ పీడ వదలదు).

సంపుటి : 1 కీర్తన : అమ్మెడిదొకటి అసిమలోదొకటి

సంఖ్య : 483 పుట : 324 రాగం: లలిత

**లలిత**

3. అమ్మెడి దొకటి అసిమలోదొకటి
బిమ్మిటి నిందేటిపెద్దలమయ్యా ॥ పల్లవి ॥

సంగము మానక శాంతియు గలుగదు
సంగలంపటము సంసారము
యెంగిలిదేహం బింతకు మూలము
బెంగల మిందేటిపెద్దలమయ్యా ॥ అమ్మె ॥

కోరికె లుడుగక కోపం బుడుగదు
కోరకుండ దిక్కువమనసు
క్రూరత్వమునకు కుదువ యీ బ్రదుకు
పేరడి నేమిటిపెద్దలమయ్యా ॥ అమ్మె ॥

ఫలము లందితే బంధము వీడదు
ఫలముతో తగులు ప్రపంచము
యిలలో శ్రీ వేంకటేశుదాసులము
పిలువగ నేమిటిపెద్దలమయ్యా ॥ అమ్మె ॥ 483

**అవతారిక :**

అన్నమాచార్యులవారి కీర్తనలలో పల్లవి కొరకరాని కొయ్యగా వుంటుంది. ఇక అధ్యాత్మ కీర్తనలైతే చెప్పనే అక్కరలేదు. ఈ వివరణ ఆ శ్రీనివాసుని కృపతో నాకు స్ఫురించిన వివరణ. "ఆశ్వాసించి" అనే తత్సమ శబ్దానికి, 'అసమసంచి' అనేది వికృతి రూపం. ఆ మాటకి అర్థం 'ఊరడించి' లేక 'ఓదార్చి'. అమ్మెడిదొకటి, ఊరడించేది ఇంకొకటి ఓ ప్రభూ! 'బిమ్మటినిండె' (వివశత్వము అధికముగానున్న) పెద్దలమయ్యా (పెద్దమనుషులం స్వామీ!) అంటున్నారు. చీకటి వెలుగుల్లాంటివి అజ్ఞానం, జ్ఞానం. అన్ని వికారాలకు మూల కారణం మనస్సు. అది మనని





కోరికలకు అమ్మేస్తుంది. మనలోని అంతరాత్మ బుద్ధిమంతుడు. అది ఊరడించి మంచిగా వుండమంటుంది. మనమేమో వివశులమై మనస్సు చెప్పినట్లు విని చెడిపోతాం. చివరికి శ్రీవేంకటేశ్వరుని దాసులమయ్యాక ఈ రొంపిలోంచి బయటపడతాం అంటున్నారు.

**భావ వివరణ :**

ఓ ప్రభూ! ఈ మానవులకి ఏ ప్రాణికీ లేని మనస్సునెందుకిచ్చావయ్యా! మంచిది చెడ్డది కూడా మా అంతరాత్ముడే. మంచిగా వుండేది బుద్ధి. మనో వికారాలనిచ్చేది మనస్సు. మనస్సు మమ్మల్ని కోర్కెలకి అమ్మేస్తుంటుంది. బుద్ధిమాత్రం అదంతేలే బెంగపెట్టుకోకు నీవు మంచిగా వుండు... అని ఓదారుస్తుంటుంది. మేమేమో "బిమ్మటినిందేటిపెద్దలము" వివశులమైపోయిన పెద్దమనుషులం.

ఇంకొకరితో సంగము (స్నేహము) మానకపోతే మనశ్శాంతి కలుగదు. సంగముతో కలిగే లంపటం వలన సంసారము కలుగుతున్నది. దీనికంతకీ మూలకారణము ఈ ఎంగిలి దేహము. జీవితాంతం ఈ ఎంగిలి వాంఛించేదేహం కోసం బెంగలతో నలిగిపోయే పెద్దలమయ్యా! మమ్మల్ని కరుణించి ఈ చక్రబంధంలోంచి బయటపడవేయవయ్యా! స్వామీ!

కోరికలుడుగక (కోరికలు నశించక) కోపము పోదు. ఈ కోరికకు ఆధారం మనస్సు. అది మనిషి బ్రతుకును క్రూరత్వానికి తాకట్టు పెట్టుతుంది. ఒక్కసారి క్రూరత్వం వచ్చాక మంచేమిటి చెడేమిటి? పేరడినేమిటి (పెద్దరికం యేమిటి?) ఇంకా మేమేమి పెద్దలమయ్యా?

మేము చేసే మంచిగాని చెడుగాని ఫలితములివ్వక మానవు కదా! ఈ ఫలితములవల్ల మిత్రులు శత్రులు కలుగుతారు. దానివల్ల బంధము కలిగి కొందరిని మనవారు అనుకొని కొందరిని విరోధులు అనుకొంటాం. ఈ కర్మఫలములతో ప్రపంచపు 'తగులు' (యావ) కలుగుతుంది. ఎంతటి పెద్దలైనా అల్పులవలె ప్రవర్తిస్తుంటారు. ఇలలో అందుకని, మమ్మల్ని శ్రీవేంకటేశ్వరుని దాసులుగా పిలిస్తే చాలును. మాకు పెద్దరికం వద్దేవద్దు. అది ఏమిటికయ్యా? (ఎందుకయ్యా)?

సంపుటి : 1    కీర్తన : ఎవ్వరు గర్తలుగారు యిందిరానాథుడే గర్త

సంఖ్య : 485    పుట : 325    రాగం : గుండక్రియ

**గుండ క్రియ**

4. ఎవ్వరు గర్తలు గారు యిందిరానాథుఁడే కర్త
నివ్వటి ల్లాతనివారై నేమము దప్పకురో    ॥ పల్లవి ॥

కర్మమే కర్తయైతే కడకు మోక్షము లేదు
అర్మిలి జీవుఁడు గర్తయైతే బుట్టుగే లేదు
మర్మపుమాయ గర్త అయితే మరి విజ్ఞానమే లేదు
నిర్మితము హరి దింతే నిజమిదెఱగరో    ॥ ఎవ్వ ॥

ప్రపంచమే కర్తయైతే పాపపుణ్యములు లేవు
వుపమ మనసు గర్తై ఉంటే నాచారమే లేదు
కపటపు దేహములే కర్తలయితే చావు లేదు
నెపము శ్రీహరి దింతే నేరిచి బ్రదుకరో    ॥ ఎవ్వ ॥

పలుశ్రుతులు గర్తలై పరగితే మేర లేదు
అల బట్టబయలు గర్తైతే నాధారము లేదు
యెలమి నిందరికి గర్త యిదివో శ్రీవేంకటాద్రి -
నిలయపుహరి యింతే నేడే కొలువరో    ॥ఎవ్వ ॥485/1

**అవతారిక :**

ఈ సృష్టిలో ఏమి జరిగినా, ఎప్పుడు జరిగినా, ఎలా జరిగినా, ఎందుకు జరిగినా కర్త ఎవరు? ఎవ్వరూ కాదు ఇందిరానాథుడు (లక్ష్మీపతి) ఒక్కడే కర్త అంటున్నారు అన్నమాచార్యులవారు. నీతినియమాలు తప్పక ఆతనివారై నివ్వటిల్లి (అతిశయించి) వుండండి అని అంటున్నారు. మనం చేసే కర్మకానీ, మనం వుండే ప్రపంచం కానీ, వేదవేదాంగములు కానీ మరేదైనా గానీ కర్తలు కావు అంటున్నారు. శ్రీవేంకటాద్రి నిలయపు హరిని నేడే కొలవండి అని హితవు చెబుతున్నారు.





**భావ వివరణ :**

ఓ జనులారా! సృష్టి స్థితి లయల చేత ఈ యావద్విశ్వాన్నీ నిర్వహించే 'కర్త' వేరెవ్వరూకాదు. ఇందిరా రమణుడైన శ్రీహరియే అన్నిటికీ కర్త. నివ్వటిల్లి (అతిశయించి), అతనివారై, నేమముదప్పకరే (నియమమును అతిక్రమించకుండా వుండండయ్యా!)

ఒకవేళ మన కర్మయే అన్నిటికీ కర్త అనుకొంటే మనం కర్మచేయకుండా వుండలేము కనుక ఇక మోక్షము సిద్ధించుట అనేది జరగదు. జీవునికి ఆపేక్ష ద్వేషమూ వుండవు. అతడు అర్మిలిజీవుడు (ప్రేమస్వరూపుడు). ఒకవేళ జీవుడే కర్త అయితే పుట్టుక అనేది లేదు. మర్మముతో నిండినది మాయ. ఒకవేళ మాయ కర్త అయితే తత్త్వ జ్ఞానమనేదే సాధ్యంకాదు. మరింకేమిటి? కర్మలన్నీ హరిచేత నిర్మింపబడినవి. ఇదే నిజము. దీన్ని తెలుసుకొంటే చాలును.

ఒకవేళ ఈ ప్రపంచమే అన్నిటికీ కర్త అయితే పాపులు పుణ్యులూ వుండరు. అసలు పాపపుణ్యాలే వుండవు. మనస్సు ప్రతిదాన్ని పోల్చుకొని ఆ 'ఉపమ'తో తృప్తి పడుతుంటుంది. ఒకవేళ ఆ మనస్సే కర్త అయితే ఇక ఆచారము (సదాచారము) వుండనే వుండదు. మానవుని దేహము కపటపు (మోసకారి) దేహము. ఎంతకాలం దీన్ని ప్రేమతో పోషించినా చివరికి చావుతో నశిస్తుంది. ఒకవేళ ఇదే కర్త అయితే చావే వుండదు కదా! నెపము (నేరారోపణ) భరించేవాడు శ్రీహరి అంతే. ఇది తెలిసి బ్రతకండయ్యా!

ఒకవేళ వేదము ఉలే కర్తలైతే మేరయేలేదు. అంటే ఒక పద్ధతే వుండదు. బట్టబయలు (మిక్కిలి బహిర్గతమైనదే) కర్త అయితే ఇక ఆధారమనేదే వుండదు. కనుక, ఇదిగో ఈ శ్రీవేంకటేశ్వరుడే అన్నిటికీ కర్త అని నేడే ఆయనను సేవించండి. అంతే ఇంతకు మించి ఏమీ లేదు.

సంపుటి : 1 కీర్తన : వెదమంత్రమికనేల వేరువెల్లంకులునేల

సంఖ్య : 461 పుట : 309 రాగం ముఖారి

## ముఖారి

5. వెదమంత్ర మికనేల వేరువెల్లంకులు నేల
పుడమిధరుడు మాకు భువనౌషధము ॥ పల్లవి ॥

హరి యచ్చుతాయంటే నణగు బాపములు
నరసింహా యనియంటే నాటిన దు:ఖములు మాను
పురుషోత్తమాయంటే బుండ్లు బూచులు మాను
పరమౌషధ మీతడే పాటింప మాకు ॥ వెద ॥

వాసుదేవ యనియంటే వదలు బంధములెల్లా
వాసికి గృష్ణాయంటే వంతల రోగాలు మాను
శ్రీసతీశ యనియంటే చింతలిన్నియును మాను
గాసిదీర నితడేపో ఘనదివ్యౌషధము ॥ వెద ॥

గోవిందా యనియంటే గూడును సంపదలు
యీవల మాధవయంటే నిహము బరము జేరు
దేవ నారాయణయంటే దేహము సుఖియై యుండు
శ్రీవేంకటేశుడే మాకు సిద్ధౌషధము ॥ వెద ॥ 461

**అవతారిక :**

అన్నమాచార్యులవారి అధ్యాత్మకీర్తనలలో పల్లవినర్థం చేసికోవటం ఒకయెత్తు, మిగిలిన కీర్తన అంతా ఒక ఎత్తు. ఉదాహరణకి ఈ కీర్తన పల్లవినే తీసికొందాం. వెదమంత్రము అంటే వేద మంత్రము అని కొందరి అభిప్రాయం. కానీ 'వెద' అంటే తుచ్ఛమైన అనికూడా అర్థం వున్నది. పూర్వీకులు కొన్ని వ్యాధులు మరియు తేలు, పాము కాట్లకు మంత్రములతోనయము చేసేవారు. రకరకాలైన వేరులతోను మూలికలతోను కొన్ని వ్యాధులు నయము చేసేవారు. ఆ మూలికలను వేరువెల్లంకులంటారు. పుడమిధరుడంటే భూదేవిభర్త అయిన విష్ణువు. భువనౌషధమంటే విశ్వవిఖ్యాతమైన మందు అని అర్థం. ఈ పల్లవికి అర్థం





ఏమిటంటే భూరమణుడైన విష్ణువు మాకు దివ్యౌషధము. అది అన్ని రోగాలకీ దివ్యమైనది. అది వుండగా ఇంకా మంత్రాలు నాటు మందులు మాకు యెందుకయ్యా? ఆ శ్రీహరి పరమౌషధం సేవించండి అంటున్నారు.

**భావ వివరణ :**

ఓ ప్రజలారా! పుడమిథరుడు (భూకాంతుడైన విష్ణువు) మాకు భువనౌషధము (జగత్ప్రసిద్ధిమైన మందు). అది వుండగా, ఇక (ఇంకా) వెదమంత్రము (తుచ్ఛమైన మంత్రాలు), వేరు వెల్లంకులు (మూలికా వైద్యములు) యెందుకయ్యా!

ఓ శ్రీహరి! అచ్యుతా! అంటే పాపములన్నీ నశిస్తాయి. నరసింహా! అని అంటే నాటిన (పాతుకుపోయిన) రోగాలు తొలగిపోతాయి. పురుషోత్తమా! అని ప్రార్థిస్తే పుండ్లు (కురుపులు), బూచులు (దయ్యంపట్టుటవంటి మానసిక వ్యాధులు) తొలగిపోతాయి. కాబట్టి మాకు పాటింప (సమ్మతించిన) పరమౌషధం ఈతడే (ఈ శ్రీహరియే). వేరుగా ఇంకే మందూ అవసరం లేదు.

బంధములవలన (మానవ సంబంధముల వల్ల కలిగిన తగులములవల్ల) మనిషి వేదన చెందుతాడు. దానికీ ఒక మందువున్నది వాసుదేవా! అని ప్రార్థిస్తే చాలును. కృష్ణా! అని అంటే పేరుగన్న రోగాలు ఇబ్బందులు తొలగిపోతాయి. ఓ శ్రీసతీశా! అని అంటే విచారములు (చీకాకులు) అన్నీ తొలగిపోతాయి. గాసిదీర (మా శ్రమ తొలగుటకు) ఇతడే పో! ఘనమైన ఔషధము.

సగం వ్యాధులు సరైన తిండిలేక వస్తాయి. దానికి మందు ధనం. అదివుంటే సగం వ్యాధులు రావు. గోవిందా! అని అంటే సమస్త సంపదలు సమకూడుతాయి. ఇక మాధవా! అన్నాము అంటే ఇహమున సుఖములు పరమున (చనిపోయాక) మోక్షము లభిస్తాయి. ఓ దేవా! నారాయణా! అని అంటే దేహములో దేహి సుఖముగా వుంటాడు. ఇవన్నీ లభించాలంటే ఒక మంచి సిద్ధౌషధము (సిద్ధించిన ఔషధం) కావాలి కదా! మాకు ఆ సిద్ధౌషధమే శ్రీ వేంకటేశ్వరుడు.

సంపుటి : 1 కీర్తన : నేనేమిసేయుదును నీవు నాలోపలనుండి
సంఖ్య : 459 పుట : 308 రాగం : గుండక్రియ

## గుండక్రియ

6\. నే నేమిసేయుదును నీవు నాలోపలనుండి
శ్రీనాథుడవు నీచేత లింతేకాక ॥ పల్లవి ॥

తనువేమిసేయును తనువులోపలనున్న -
చెనటి యింద్రియములచేతలుగాక
మనసేమిసేయును మనసులోపలనున్న -
నినుపుగోర్కులు చేసేనేరములుగాక ॥ నేనే ॥

జీవుడేమిసేయును జీవునిబొదుగుతున్న -
భావప్రకృతి చేసేపాపముగాక
చేవదేర బుట్టు వేమిసేయు ముంచుకొన్నట్టి -
దైవపుమాయలోనిధర్మ మింతేకాక ॥ నేనే ॥

కాలమేమిసేయును గక్కన శ్రీ వేంకటేశు -
డేలి మన్నించేమన్నన యిదియేకాక
యేల యేల దూర నింక నెవ్వరు నేమిసేతురు
మేలిమి నిను దలచి మెచ్చుటేకాక ॥ నేనే ॥ 459

**అవతారిక :**

ఓ శ్రీనాథా! నీవునాలోపల అంతర్యామివైయుండి అన్నీ చేయిస్తున్నావు. పైకి నా తనువు, మనస్సు, ఇంద్రియాలు, జీవుడు నా పుట్టుక మొదలైనవి నా పనులన్నీ చేస్తున్నట్లు కనుపించినా అది నిజం కాదు. అన్నీ నీచేతలే. నేనేమి చేయుదును? ఇందులో ఇంకొకరిని నిందించవలసిన పనియేమిటి? ఎవ్వరుమాత్రం ఏమిచేయగలరు? మేలిమి (అధికుడవైన) నిన్ను మెచ్చుకుంటూ జీవిస్తే చాలును. అన్నమాచార్యులవారు చెప్పింది అక్షరసత్యం. నిగ్రహించగలిగినవాడు శ్రీవేంకటేశ్వరుడొక్కడే.





**భావ వివరణ :**

ఓ ప్రభూ! శ్రీనాథుడవైన నీవు, అంతర్యామివలె నాలోపలనుండి సమస్తము చేయించుచున్న నీ చేతలే ఇవన్నీ. అంతేకాక నేనేమిసేయుదును (నేనేమి చేయగలను?) నీవు చేయించేవే అన్నియూ అని గ్రహించాను.

నా తనువులో (శరీరంలో) వున్న చెనటి ఇంద్రియాలు (వ్యర్థమైన అవయవములు) చేయించే పనులే అన్నీ. మరి నాతనువేమి చేస్తుంది? నా మనస్సులోపలదాగి నినుపుగోర్కెలు (నిండియున్న వాంఛలు) నాచేత ఎన్నో నేరములను చేయించుచున్నవి. దానికి నా మనస్సేమి చేస్తుంది. దానిని నిందించి ప్రయోజనమేమిటి?

నాలోవుండే జీవుడికి పొదగుకొని (కమ్ముకొని) భావనలు కలిగించే ప్రకృతి ఒకటి యున్నది. అది వానిచేత సమస్త పాపములను చేయించుచున్నది. దానికి నాజీవుడేమిచేస్తాడు? భగవంతుని మాయ యొక్క ధర్మమేమిటంటే నిష్పక్షపాతంగా మా కర్మలకు తగిన పుట్టుక (జన్మ) నీయటం. ఒక్కసారి పుట్టాక ఆ జన్మకు తగిన కర్మలు చేస్తూనే వుంటాం. ముంచుకొన్నట్టి (అతిక్రమించే) మాయనేమీ అనకుండా, జన్మను నిందించి ప్రయోజనమేమిటి?

గక్కన (వెంటనే) శ్రీవేంకటేశ్వరుడు, మనని ఏలి (పరిపాలించి) మన్నిస్తే... ఆ మన్నన మనకి మేలు చేయగలదు కాని కాలము ఏమి చేయగలదు? అది క్షణ క్షణం గతించి పోతూనే వుంటుంది. కాబట్టి ఇక యెందుకు వాటిని వీటిని నిందించుట? ఎవ్వరేమి చేస్తారు? ఓ ప్రభూ! మేలిమి (అధికుడవైన) నిన్ను తలచి (ధ్యానించుచూ) మెచ్చుటేకాక (కీర్తించుట తప్ప) నేనేమిసేయుదును?

సంపుటి : 1 కీర్తన : అక్కరకొదగనియట్టి యర్థము

సంఖ్య : 456 పుట : 306 రాగం : ముఖారి

**ముఖారి**

7. అక్కరకొదగనియట్టియర్థము
లెక్క లెన్నియైనా నేమి లేకున్న నేమిరే ॥ పల్లవి ॥

దండితో దనకు గాని ధరణీశురాజ్యంబు
యెండెనేమి యది పండెనేమిరే
బెండుపడ గేశవుని బేరుకొనని నాలికె
వుండెనేమి వుండకుండెనేమిరే. ॥ అక్క ॥

యెదిరి దన్ను గానని యడపుల గుడ్డికన్ను
మొదల దెఱచెనేమి మూసెనేమిరే
వెదకి శ్రీపతి సేవ వేడుకజేయనివాడు
చదివెనేమి చదువు చాలించెనేమిరే ॥ అక్క ॥

ఆవల నెవ్వరులేనిఅడవిలోని వెన్నెల
కావిరి గాసెనేమి కాయకున్ననేమిరే
శ్రీ వేంకటేశ్వరు జేరనిదర్మములెల్ల
తోవల నుండెనేమి తొలగిననేమిరే ॥ అక్క ॥ 456

**అవతారిక :**

గొప్ప నీతివాక్యములను చెబుతున్నాడు అన్నమాచార్యులవారు. మనుష్యుడు ధనమును సంపాదించేది దేనికోసం? తనకు ఆపదలో అక్కరకొస్తుందని. అట్లా అవసరానికి సహాయపడని అర్థము (ధనము) నిరర్థకమంటున్నారు. లెక్కలేనంత ధనంవున్నా, లెక్కపెట్టవలసిన అవసరం లేనంత తక్కువ వున్నా నిరుపయోగమే అంటున్నారు. అడవిలో యెంతవెన్నెల కాచినా నిరుపయోగమే కదా! మన జీవనయానంలో యే





దర్మాన్ని ఆచరించినా దాని ప్రయోజనం శ్రీ వేంకటేశ్వరుని చేరటం. అందుకు కానప్పుడు ఆ ధర్మానికి అర్థం వ్యర్థమే.

**భావ వితరణ :**

ఓ మానవులారా! అక్కరకొదగని (అవసరమునకు ఉపయోగపడని) యట్టి అర్థము (ధనము), లెక్కలేనంత వుంటే నేమి – అసలు లేకుంటేయేమి?

ధరణీశునకు (రాజుగారికి) అతని రాజ్యము దండితో (గొప్పగా) తనకు గావలె (తనకు వుపయోగపడాలి) అట్లుకానిచో అది యెండెనేమి... పండెనేమి (నశించినా ఒకటే అభివృద్ధిచెందినా ఒకటే). ఆయనకేమి లాభం? బెండుపడ (నిర్బలుడైనప్పుడు) మనిషి కేశవుని స్మరించి రక్షణ పొందాలి. ఆ స్వామి పేరు పలుకని నాలుక వుంటేయేమి, లేకుంటే నేమిరా?

విరోధినుంచి తనను తాను రక్షించుకొనుటకు ఉపయోగించని కన్ను గుడ్డికన్నే కదా? అది తెరచివుంటేనేమి? మూసివుంటేనేమి? పెద్ద తేడా వుండదు.

శ్రీనాథుని వెదకి పట్టుకొని ఇష్టముతో సేవించాలి. అట్లా చేయనివాడు యెంత చదివితే నేమి వుపయోగం? అసలు చదవకపోయినా నష్టమేమిటి?

ఎవ్వరూ లేని నిర్జనారణ్యంలో ఎంత పండువెన్నెల కాచినా యెవరికి వుపయోగం? ఆ వెన్నెల యెంత చీకటిని తొలగించినా వుపయోగమేమిటి? ఏ ధర్మశాస్త్రమైనా శ్రీవేంకటేశ్వరుని చేరే మార్గం నేర్పాలి. అట్లా నేర్పని ధర్మాలు, తోవల (జీవనయానంలో) వుండెనేమి? తొలగినేమి (వుంటేనేమి? పోతేనేమి?)

సంపుటి : కీర్తన : అంగడినెవ్వరు నంటకురో

సంఖ్య : 241 పుట : 161 రాగం : శ్రీరాగం

**శ్రీరాగం**

8. అంగడి నెవ్వరు నంటకురో యీ -
దొంగలగూడినద్రోహులను (ము) ॥ పల్లవి ॥

దోసము దోసము తొలరో శ్రీహరి -
దాసానదాసుల దగ్గరక
ఆసలనాసల హరినెఱగక చెడి
వీసరపోయినవెఱ్ఱులను (ము) ॥ అంగ ॥

పాపము పాము పాయరో కర్మపు -
దాపపువారము(ల) దగ్గరక
చేపట్టి వేదపుశ్రీహరికథలు
యేపొద్దు విననిహీనులము ॥ అంగ ॥

పంకము పంకము పైకొనిరాకురో
కొంకు గొసరులకూళలము
వేంకటగిరిపై విభునిపుణ్యకథ
లంకెల వినని యన్యులము ॥ అంగ ॥ 241

**అవతారిక :**

ఈ ప్రపంచం, ఒక అంగడి (సరుకులు అమ్మే సూపర్‌బజార్ అన్నమాట) ఇందులో బేరసారాలు చేస్తున్న మనమంతా దొంగలమే. మామూలు దొంగలము కాదు ద్రోహబుద్ధిగల దొంగలము. మమ్మల్ని తాకవద్దు. మీరూ చెడిపోతారు. మమ్మల్ని పుట్టించి, పోషించి, రక్షిస్తున్న శ్రీహరినే మఱచి ఆయనని తలుచుకోని కృతఘ్నులము. ఆశాపాశమునకు చిక్కి వీసరపోయిన (మెత్తపడిపోయిన) పిచ్చివాళ్ళం అంటున్నారు





అన్నమాచార్యులవారు. భగవంతుని శరణాగతిలో ఆత్మనింద ఒక భాగము. నేను హీనాతిహీనుణ్ణి అని అంగీకరించటమే శరణాగతికి తొలిమెట్టు.

**భావవివరణ :**

ఓ నరులారా! ఈ ప్రపంచమే పెద్ద అంగడి వంటిది. ఇందులో జీవిస్తున్న మేము... భగవంతుని మరచి, దొంగలతో స్నేహం చేసి చేయరాని పనులను చేస్తున్న ద్రోహులము. మమ్మ అంటకురో (తాకవద్దురా). మీరూ చెడిపోతారు.

శ్రీహరికి దాసానుదాసులైనవారిని వదలిపెట్టండి. వారివద్ద నుండి తొలరో (తొలగిపోండి) వారిదగ్గరకెళ్ళకండి (ద్రోహులమైన మేమూ వెళ్ళము). అసలనాసల (అత్యధికమైన ఆశతో) శ్రీహరిని యెరుగక చెడి వీసరపోయిన (వెలితిపడి చిన్నబోయిన) వెఱ్ఱులము (పిచ్చివాళ్ళము). మేమేం చేస్తున్నామో మాకే తెలియటంలేదు).

మేము చేసికొనిన కర్మల తాపపువారము (ఆ కర్మల యొక్క తాపము చేత పీడించబడుతున్న వాళ్ళము). మాతో వుంటే మీకూ పాపము అంటుకొంటుంది. మా దగ్గరకు పాయరో (మాదగ్గరకు రాకండి). చేపట్టి (దీక్షవహించి) మేము యే పొద్దు (ఏ సమయంలో కూడా) శ్రీహరి కథాశ్రవణం చేయని హీనాతిహీనులము. వేదమూర్తి అయిన ఆయన కథలు వినని వారికి పాపము రాక ఇంకేమొస్తుంది?

మేము కొంకున్ గొసరుల కూళలము (భయము, సంకోచములచే పీడించబడు కుత్సితులము). ఓ పాపపంకిలమా! (బురదవంటి పాపమా) మమల్ని ఆశ్రయించవద్దు. వేంకటగిరిపైనున్న శ్రీవేంకట విభుని పుణ్యకథలను లంకెల (తగులుకొని) వినని అన్యులము (సరియైన వాళ్ళము కానివారము). అందుకని మమ్మల్ని మా కర్మకు వదలి మీరైనా మంచిగా వుండండి.

సంపుటి : 1 కీర్తన : మచ్చుగన్నతల్లి చేరి మూలకు నొదిగినట్లు
సంఖ్య : 240 పుట : 161 రాగం : శ్రీరాగం

### శ్రీరాగం

9. ముచ్చుగన్నతల్లి చేరి మూలకు నొదిగినట్టు
తెచ్చినసంబళమెల్ల దీరుబో లోలోనె ॥ పల్లవి ॥

దప్పముచెడినవానితరుణి కాగిట జేరి
అప్పటకప్పటికి నుస్సు రనినయట్టు
వొప్పయిన హరిభక్తి వొల్లనివాని యింటి -
కుప్పలైన సంపదలు కుళ్లుబో లోలోనె ॥ ముచ్చు ॥

ఆకలిచెడినవాని అన్నము కంచములోన
వోకిలింపుచు నేల నొలికినట్టు
తేకువైన హరిభక్తి తెరువుగాననివాని -
వేకపుసిరులు కొంపవెళ్లుబో లోలోనె ॥ ముచ్చు ॥

వొడలుమాసినవాని వొనరు జుట్టములెల్ల
బడిబడినే వుండి పాసినయట్టు
యెడయక తిరువేంకటేశు దలచనివాని -
అదరుబుద్ధులు పగలౌబో లోలోననె ॥ ముచ్చు ॥ 240

**అవతారిక :**

మానవులు పాపపుణ్యాలు చేస్తూనే వుంటారు. ఆపై వాటి ఫలితాలను అనుభవించటానికి హీనమైనవో, ఉత్తమమైనవో జన్మలు యెత్తుతూనే వుంటారు. ఈ జీవనయానం, అమ్మకడుపులో పడిన దగ్గర నుంచి మొదలవుతుంది. చివరి శ్వాస వదిలాక అంతమవుతుంది. ఈ జీవన యానానికి మనం వచ్చేప్పుడు "సంబళం" (దారి ఖర్చు) కూడా తెచ్చుకుంటాం. అదే మనం చేసిన మంచి కర్మ. కానీ దారిబత్తెంలాగానే అది 'తీరుబోలోలోన' (లోపల లోపల ఖర్చు అయిపోతూనేవుంటుంది.





మచ్చుగన్నతల్లి (దొంగకి జన్మనిచ్చిన తల్లి ఇతరులకి తన ముఖము చూపలేక ఒకమూల అవమానంతో ఒదిగియున్నట్లు, మానవుడి పాపపుణ్యాల ఫలం రహస్యంగా కఱగిపోతూనే వుంటుంది అంటున్నారు అన్నమయ్య.

**భావ వివరణ :**

ఓ మానవులారా! చేరి... ముచ్చుగన్నతల్లి మూలకునొదిగినట్లు (దొంగకు జన్మనిచ్చిన తల్లి అవమానంతో ఒక మూల పడి వుండి జీవించినట్లు), మనం పాపపుణ్యాల ఫలంగా వెంటతెచ్చుకొన్న సంబళం (దారిబత్తెం) తనంతట అదే లోపల్లోపల రహస్యంగా ఖర్చు అయిపోతూనే వుంటుంది.

దప్పముచెడినవాని తరుణి (ఔన్నత్యం కోల్పోయిన వాడిపెళ్ళాం) భర్త కౌగిటిలో కూడా ఉస్సురుమని జీవించినట్లు, మేలైన హరి భక్తి వద్దు అనే వాడి ఇంట్లో సంపద యెంతకుప్పలైవున్నా (సమృద్ధిగా వున్నా) అవి లోలోన కుళ్ళుబోవును (తమంత తామే లోపల్లోపల కుళ్ళి మురిగిపోతాయి). వాటివల్ల ఏ మంచీ జరుగదు. వాడికి పుణ్యం రానేరాదు.

ఆకలి చెడిపోయినవాడు తినే కంచంలోనే బొళుక్కుమని డోక్కొని తిన్న అన్నం నేలపాలు చేసికొంటాడు. శ్రీహరిభక్తి మానవులకి తేకువ (ధైర్యం) నిస్తుంది. కానీ శ్రీహరి భక్తి తెరువుగాననివాడు (దారినిపోనివాడు) ఇంట్లో యెంత వేకపు సిరివున్నా (అంటే... యెంత ఆగర్భ శ్రీమంతుడైనా) లోలోన కొంపవెళ్ళబోవు (తనంతట తనే దివాలా తీస్తాడు).

ఒడలు మాసినవాని (చెడిపోయినవాడి) చుట్టాలు వాని బడిబడినే వుండి (సమీపములోవున్నా) పాసినయట్లు (వాడిని వదలి వేసినట్లు) ఎడయక (వదలిపెట్టక) శ్రీ వేంకటేశ్వరుని స్మరించనివానికి తన బుద్ధియే తనకు శత్రువై దానంతట అదే వినాశన హేతువు అవుతుంది. అంటే వాడి బుద్ధే వాడి మృత్యువవుతుంది.

సంపుటి : 1 కీర్తన : ఎప్పుడు పక్వము గాదిదె యింద్రియ భోగంబులచే
సంఖ్య : 482 పుట : 323 రాగం మలహరి

### మలహరి

10. ఎన్నడు పక్వము గా దిదె యింద్రియభోగంబులచే
సన్నము దొడ్డను దోచీ సంసారఫలంబు ॥ పల్లవి ॥

తిత్తితో నూరేండ్లకును దేహము పండగబండగ
చిత్తం బెన్నడు పండక చిక్కెను కసుగాయై
పొత్తులపుణ్యముబాపము పులుసును తీపై రసమున
సత్తు నసత్తును దోచీ సంసారఫలంబు ॥ ఎన్న ॥

వెదవడి పుత్రుడులపౌత్రులే విత్తులు లోలో మొలచియు
పొది గర్మపుపూ మారదు పూపిందెయిన దిదే
తుద నిదె సుఖమును దు:ఖము తోలును గింజయి ముదురుక
చదురము వలయము తోచీ సంసారఫలంబు ॥ ఎన్న ॥

వినుకలిచదువుల సదలో వేమరు మాగగ బెట్టిన
ఘనకర్మపుటొగ రుడుగదు కమ్మర పులిగాయై
మనుమని శ్రీ వేంకటేశుకు మహి నాచార్యుడు కానుక
చనవున నియ్యగ వెలసెను సంసారఫలంబు ॥ ఎన్న ॥ 482

**అవతారిక :**

ఈ అధ్యాత్మ కీర్తనలో సంసారఫలము యొక్క విశిష్టత్వమును వివరిస్తున్నారు అన్నమయ్య. “ఎంత తిన్నా కడుపు నిండనిది - ఏ రుచీ లేకపోయినా ఎంతో రుచిగా వుందనిపించేది - ఒక్కసారి దొంగతనంగానైనా తింటే బాగుంటుంది అనే భ్రమ కలిగించేది - అని ఇతర మత గ్రంథాలు కూడా చెప్పాయి. అన్నమయ్య వర్ణన ఇంకా అద్భుతం. ఈ సంసారఫలము యెన్నడూ పక్వము కాదట అంటే ఎప్పుడూ పచ్చిగానే వుంటుంది కాని, పండదట. ఎందుకంటే ఇది ఇంద్రియ భోగాలతో నిండివున్నది కదా! అందుకని ఒకప్పుడు పెద్దదిగా





మరియొకప్పుడు చిన్నదిగా కనిపిస్తుందట. ఒక అక్షరము లోపంవల్ల ఈ కీర్తన భావమే మారిపోతుంది వివరాలు చదవండి.

**భావ వివరణ :**

ఓ ప్రజలారా! ఇదె సంసారఫలము. ఎన్నడూ పక్వము కాదు (ఏనాటికీ పండు పండదు). ఇది సన్నము (చిన్నదిగానూ) తోస్తుంది. దొడ్డను (లావుగానూ) అనిపిస్తుంది.

నూరేండ్లు వుంటుంది కాబట్టి ఈ దేహము, తిత్తితో (తోలుతో) పండగ పండగ (పండి వడలిపోతూనే వుంటుంది). కానీ దీంట్లో వున్న చిత్తము (మనస్సు) కసుగాయై (పచ్చికాయవలె) పండక వుంటుంది. ఎంతో మందితో పొత్తులు (జతకట్టుటలు) చేస్తుంది కాబట్టి పుణ్యకర్మలు పనికిరాని కర్మలవలెను, పాపకర్మలు ఆచరించదగ్గవిగానూ కనిపిస్తాయి. రసముల (ఇక రుచుల విషయానికి వస్తే … పులుపు తీపిగాను తియ్యనిది పుల్లనిదిగానూ అనిపిస్తుంది. సత్తు అసత్తుగా (నిజం అబద్ధంగా) అనిపిస్తుంటుంది.

ఈ సంసారఫలం విత్తులు వెదవడి (విత్తనాలు వెద చల్లుట వలన) ఆ విత్తనాలే కొడుకులు మనుమలు అయి లోలోన విపరీతమైన గర్వము పూపిందెలుగా మొలిచి విస్తరిస్తుంటుంది. దీనికి (ఈ సంసార ఫలానికి) పైతోలు ఏమిటో తెలుసునా… దేహి అనుభవించే సుఖము. ఇక దీని గింజలు ఆ దేహి దు:ఖమే. ఈ సంసార ఫలం యెన్నడూ ముదరదు. ఇది కొంతమందికి నలుచదరముగా కనిపిస్తే కొందరికి గుండ్రంగా కనిపిస్తుంది.

వినుకలి చదువుల సదలో (చదువులు, వినిపించుట జరిగెడి పండిత గోష్ఠిలో) దీనిని చాలాసార్లు మాగబెట్టిన తరువాత గానీ దీని ఒగరు రుచి వుడగదు (పోదు). కమ్మర (అటు పిమ్మట) పుల్లని కాయవలె భరించలేనిదవుతుంది. అప్పుడు మా గురుదేవులు చనవున (ప్రేమతో) శ్రీ వేంకటేశ్వరునకు, మనుమని (శరణాగతితో వుండమని) ఇయ్యగా - మహిని (ఈలోకంలో) సంసార ఫలము యొక్క తత్త్వం తెలిసినది.

సంపుటి : కీర్తన: ఏటి విజ్ఞానమేటి చదువు

సంఖ్య : 77 పుట : 53 రాగం : గుండక్రియ

## గుండక్రియ

11. ఏటివిజ్ఞాన మేటిచదువు
గూటబడి వెడలుగతి గురుతు గనలేదు ॥ పల్లవి ॥

ఏడుమడుకల చర్మమింతయును దూంట్లై
గాడబెట్టుచు జీము గారగాను
పాడైనయిందులో బ్రదుకు గోరీ బ్రాణి
వీడదన్నుక చనెడి వెరవు గనలేదు ॥ ఏటి ॥

కడుపునిండిన మహాకష్టంబు నలుగడల
వెడలుచును బెనుమురికి వేయగాను
యిడుమ బొందుచు సుఖం బిందుకే వెదకీని
వొడలు మోవగ జీవు డోపననలేదు ॥ ఏటి ॥

వుదకమయమగు కన్ను లురికి యేమైన గని
మదవికారము మతికి మరుపగాను
యిది యెరిగి తిరువేంకటేశు గని జీవుడా
సదమలానందంబు చవిగానలేదు ॥ ఏటి ॥ 77

**అవతారిక :**

అన్నమాచార్యులవారి కీర్తనలలో పల్లవే అర్థంకాదు అనటానికి ఇది చక్కని ఉదాహరణ. ఎంత చదువుకున్నా విజ్ఞానము (భగవంతుని గూర్చిన అనుభవపూర్వకమైన జ్ఞానం) లేకపోతే ఏమానవుడైనా కుంటివాడు కుంటుకుంటూ నడిచినట్లు వ్యర్థునిగా పేరు లేకుండానే బ్రతుకుతాడు – అని దీని అర్థం. భగవద్సాక్షిగా ఇది వ్రాసేవరకు నాకూ తెలియదు. ఆ ఏడుకొండలవాడిని స్మరించగానే మెఱుపులా స్ఫురిస్తుంది. కాగితం మీద వ్రాయగానే పన్నీరు ఆవిరైనట్లు ఇక బుఱ్ఱలో యేమీ వుండదు. ఇది సత్యం.





నిజానికి "గూటిబడి" అని వుండాలి. రాగిరేకులపై వ్రాసిన వారి పొరబాటువల్ల 'గూటబడి' అయింది. నీకెలా తెలుసునని నన్ను అడిగితే నిష్ప్రయోజనం సుమండీ!

**భావ వివరణ :**

ఏటి విజ్ఞానము, ఏటి చదువు? (విజ్ఞానం యేమిటి – చదువేమిటి). చదువు కొనినంత మాత్రాన విజ్ఞాని (ఆత్మజ్ఞానం కలవాడు) కాలేడు. కుంటివాడు వెడలు (నడచిపోవు) గతి (విధముగా) గురుతు గనలేడు. (నేర్పరికాలేడు). అనగా కుంటివాడు ఎలాగైతే సరిగా నడవలేడో చదువుకొనినంత మాత్రంచేత భగవత్సాక్షాత్కారం పొందలేడు.

మానవుని దేహం ఏడు మడకల చర్మము (ఏడు పొరలున్న చర్మము) తో చేయబడినది. దీని నిండా దూంట్లే (రంధ్రములే) (రోమ రంధ్రములు). ఇది కాడ బట్టుచు (నశించిపోతూ) చీము కారుతూ వుంటుంది. ప్రాణి (జీవుడు) ఇందులో బ్రతుకగోరి వస్తాడు. ఇది పాడైనా, దీంట్లోనే వుంటాడు. ఈ ప్రాణి ఈ శరీరంలేకుండా బ్రతికే వెఱపు (దారి) తెలియదు.

మహాకష్టముతో ఆ దేహి కడుపు నిండుతుంది. ఒక్కసారి కడుపు నిండాక ఈ దేహి గొప్ప మురికి కూపాల్లోంచి పోతుంటాడు. ఇడుము (కష్టము) పొందుతూనే వుంటాడు. కానీ అదే సుఖము అనుకొంటుంటాడు. దాంట్లోనే సుఖం వెతుక్కుంటుంటాడు. వాడి శరీరం కూడా వాడు మోసికొనలేని స్థితి చేరుకుంటాడీ జీవుడు.

వాడి కళ్ళువున్నాయే... అవి వుదకమయము (నీటితో నిండినది). కానీ అవి ఆ జీవి మనస్సునకు మదము, వికారము అలవరుస్తాయి. ఇది తెలిసికొని శ్రీవేంకటేశ్వరుని దర్శనం పొందగానే ఆ జీవికి సదమలానందంబు (సత్తు యొక్క నిర్మలమైన ఆనందము) కలుగుతుంది. పైవన్నీ తెలిసికొంటేకాని ఆ ఆనందం యొక్క చవిగానలేడు (అనుభవం పొందలేడు.)

సంపుటి:1 కీర్తన : సొగియునా మఱియు ముచ్చుకు బండువెన్నెలలు
సంఖ్య : 242 పుట : 162 రాగం : బౌళి-జంపెతాళం

**బౌళి-జంపెతాళం**

12. సొగియునా మఱియు ముచ్చుకు బండువెన్నెలలు
పగవానివలెనె లోపల దాగుగాక ॥ పల్లవి ॥

దక్కునా పేదకును తరముగాని ధనంబు
చిక్కి యెవ్వరికైన జేరుగాక
వెక్క సంబైన గోవిందుని దలపుబుద్ధి
తక్కినపరులకెల్ల దలపేల కలుగు ॥ సొగి ॥

అరగునా దుర్బలున కరుదైన యన్నంబు
కురుచబుద్ధులను నరమిగొనుగాక
తొరలునా హరివినుతి దుష్టునకు నది నోర
దొరలెనా యతనినే దూషించుగాక ॥ సొగి ॥

చెల్లునా యమృతంబు సేవించ నధమునకు
వొల్లనవి నేలపై నొలుకుగాక
వెల్లి గొనుమందునకు వేంకటేశుస్మరణ
చల్లనౌనా మనసు శరియించుగాక ॥ సొగి ॥ 242

**అవతారిక :**

ఇదే పల్లవికి నాలుగైదు రకములుగా భావవిరణ చేయవచ్చు. అన్నమాచార్యులవారి ఆలోచన 'ఇది' అని చెప్పగల శక్తి నాకులేదు. సొగియుట అంటే ఇంపు అవుతుందా అని అర్థం. అంటే రుచిస్తుందా? అని. విరగగాసిన పండువెన్నెల దొంగకి రుచిస్తుందా? వాడు యెప్పుడూ చీకటినే కోరుకుంటాడు. శత్రువుకుండే పగ బైటకు రాకుండా లోపలే దాగి వుండి నలుగురి కంట బడక అపకారం చేస్తుంది. (దాగివున్నది పగ





కాదు... పగవాడు అని కూడా అర్థం చెప్పుకోవచ్చు). అట్లాగే మందబుద్ధి! మనస్సుని వేంకటేశ్వరుని స్మరించి చల్లగా వుంచుకోవే అంటే అది మాట వింటుందా మొండికేస్తుంది కాని, అంటున్నారు.

**భావ వివరణ :**

ఓ ప్రజలారా! ముచ్చుకు (దొంగకు) విరబూసిన పండువెన్నెల సొలయునా (రుచిస్తుందా)? అట్లాగే శత్రువునకుండే పగ లోపల్లోపలనే దాగి వుండి అపకారం చేస్తుంది కానీ బయటపడుతుందా?

ఒక పేదవాడికి అంతులేని ధనం లభిస్తే అది వాడికి దక్కుతుందా? అది ఎవ్వరికో పరాయి వాళ్ళకే చేరిపోతుంది. వెక్కసంబైన (దుర్లభమైన) శ్రీహరి నామచింతన చేయాలనే బుద్ధి ఆయన దయకలిగిన వారికి తోస్తుంది కానీ మిగతావారికి తోచను కూడా తోచదు. వాడి పక్కనున్న వాళ్ళంతా గోవిందా అంటున్నా వీడు మాత్రం నోరు విప్పడు.

దుర్బలుడైనవాడు పొట్టనిండా అన్నం మ్రింగినా హరించుకోగలడా? అల్పబుద్ధులు వుండేవారు నరమిగొనుగాక (కృత్రిమంగా వుంటారు). వారికి మంచి చెప్పినా రుచించదు. ఒక దుష్టబుద్ధికి హరి కీర్తనము తొరలునా (కలుగుతుందా?) వాడి నోటిలో హరి నామము దొర్లుతుందా? వాడెంతసేపటికీ శ్రీహరిని తిడుతూనే వుంటాడు లేదా తనకి తాను ఒక గొప్ప హేతువాదిననుకొని తనలోనే వున్న ఆ అంతర్యామిని గుర్తించనేలేదు.

అర్హతలేని అధమునికి అమృతం చేతికందించినా అది వాడికి దక్కుతుందా? ఒల్లనని (వద్దని) నేలపై ఒలకపోసికొంటాడు. ఎన్నో జన్మలనుంచి వెల్లిగొనుమందునకు (పరంపరగా వస్తున్న మందబుద్ధికి) శ్రీ వేంకటేశ్వరుని సంస్మరణ చల్లనౌనా (శమనం కలిగిస్తుందా?) వాడి మనస్సు శరియించుగాక (మొరాయిస్తూనే వుంటుంది కదా!)

సంపుటి : 1 కీర్తన : ఇత్తడి బంగరుసేయ నింతకు నేరుతునంటా
సంఖ్య : 360 పుట : 241 రాగం : సామంతం

**సామంతం**

13. ఇత్తడి బంగారుసేయ నింతకు నేరుతునంటా
కొత్తసేతలెల్ల దొరకొంటిగా నీవు ॥ పల్లవి ॥

హీనులైనవారు నిన్ను నేచి కొలిచిన ఘన –
మైనపదవుల బెట్టేయె (య?)టు వలెనే
మానక యెవ్వతెనైన మచ్చిక దగిలి నాతో –
నానిపట్టి సరిసేసే వద్దిరా నీవూ ॥ ఇత్త ॥

కడుబాతకులు నిన్ను గదిసి కొలిచేరంటా –
నదరి పుణ్యులజేయునటువలెనే
కడగి యెవ్వతెనైన గాజు మాణికము సేసి
వడి నన్ను గెరలించవద్దురా నీవూ ॥ ఇత్త ॥

దిందుపడ మాయసేసి దేవుడ నేగానంటా –
నందరి భ్రమలబెట్టునటువలెనే
అందమైన తిరువేంకటాద్రీశ నీ ప్రేమ
చెంది నన్ను గూడి దాచజెల్లునా నీవూ ॥ ఇత్త ॥ 360

**అవతారిక :**

శ్రీ వేంకటేశ్వరుని యోగులు జ్ఞానులేకాదు హీనులు దీనులు కూడా కొలుస్తారు. కొందరు జ్ఞానం వల్ల కలిగిన వైరాగ్యంతో సేవిస్తే, కొందరు బాధలవల్ల కలిగే పీడలనుంచి రక్షణ కోసం శరణు అంటారు. కనుక హీనులు పుణ్యులు కూడ ఆయననే ఆశ్రయిస్తారు. ఒక్కసారి ఆయన రక్షణలో చేరితే ఇత్తడి వంటి సామాన్య లోహాన్ని బంగారం చేయగలడాయన అంటే అతి సామాన్యుడైన నాబోటి అల్పునికూడా విశిష్ట





వ్యక్తిని చేయగలడు. అటువంటి కొత్తసేతలెల్ల (పనులన్నీ) దొరకొంటివి కదా (ప్రయత్నిస్తూనేవుంటావు స్వామీ!) అంటున్నారు అన్నమాచార్యుల వారు.

**భావ వివరణ :**

ఇత్తడిని బంగారము చేయుట నేర్చితినంటూ కొత్తకొత్త సేతలు (మహిమలు) చూపేవు స్వామీ! నీవు దొరకొనిన (ప్రయత్నించిన) ఆ పనులన్నీ వింతలే. ఇత్తడి వంటి అల్పులను బంగారంవంటి ఉన్నతులుగా చేస్తావు.

హీనాతిహీనులైన వారుకూడా నిన్ను నేచి కొలచిన (పూనుకొని సేవిస్తే) వారికి ఉన్నతమైన పదవుల నందిస్తావు నేను లోలుడనై ఎవ్వతెకైనా మచ్చికదగిలి (అలవాటుపడి) మానకవుంటే (వదలలేని స్థితిలో వుంటే) నాతో నానిపట్టి (విశ్వప్రయత్నాలు అయినా సరే) నన్ను సరిచేసేవు (బాగు చేస్తావు).

అద్దిరానీవూ (నీవంటే అదేరా నామాలవాడా!) అట్లాగే, అతిపాపాత్ములు కూడా నిన్ను గదిసి (ఆశ్రయించి) కొలిచితే, అరే – వీళ్ళు నా భక్తులు అని అదరి పుణ్యుల చేతువు (ప్రయత్నించి పుణ్యాత్ములను చేసెదవు). గాజు ముక్కవంటి అల్పురాలను కూడా గొప్పయోగినిని చేసి మాణిక్యమువలె అపురూపం చేస్తావు. అటువంటప్పుడు, ఓ ప్రభూ నీవూ వడి నన్ను గెరలించవద్దా? (శీఘ్రముగా నన్ను కూడా నీవు బాగుచేయవద్దటయ్యా?)

దిందుపడ మాయసేసి (మూర్ఛపోవునంతగా నీ మాయాజాలంలో ఇరికించి) నేను దేవుణ్ణి కాదురా అని అందరినీ భ్రమపెడతావు. (ఆనాటి యశోదాదేవి దగ్గర నుంచి ఈనాటి చార్వాకుల దాకా అలా భ్రమలో పడ్డవారే, పడుతున్నవారే). సౌందర్యమూర్తివైన ఓ శ్రీ వేంకటేశ్వరా! నీ ప్రేమ నాకు చెందినది. నన్ను గూడి (నావాడవై) నీవు ఆ ప్రేమను దాచిపెడితే... అది చెల్లునా (అదేమన్నా బాగుందా తండ్రీ!).

సంపుటి : 1 కీర్తన : పరమపాతకుడ భవబంధుడ

సంఖ్య : 33 పుట : 22 రాగం: సామంతకం

**సామంతకం**

14. పరమపాతకుడ భవబంధుడ శ్రీ-
హరి నిను దలచ నే నరుహుడనా ॥ పల్లవి ॥

అపవిత్రుడ నే నమంగళుడ గడు
నపగత పుణ్యుడ నలసుడను
కపటకలుష పరికరహృదయుడ నే
నపవర్గమునకు నరుహుడనా ॥ పర ॥

అతిదుష్టుడ నే నధిక దూషితుడ
హతవివేకమతి నదయుడను
పతిలేనిరమాపతి మిము దలచలే -
నతులగతికి నే నరుహుడనా ॥ పర ॥

అనుపమవిషయపరాధీనుడ నే -
ననంతమోహభయాతురుడ
వినుతింపగ దిరువేంకటేశ ఘను -
లనఘులుగాక నే నరుహుడనా ॥ పర ॥ 33

**అవతారిక :**

భగవాదారాధనలో ఆత్మనింద (తన చెడుగుణములను తానేకరువుపెట్టుకొని మన్నించమని వేడుకొనుట) ఒక ప్రత్యేకత. నేను అటువంటి నీచుణ్ణి... ఇటువంటి దుర్మార్గుణ్ణి... నీ దయకు అర్హుడినా ప్రభూ! కానేకాదు. కానీ కనికరించు అని వేడుకొంటున్నారు అన్నమాచార్యులవారు. ఈ కీర్తనలో చాలా మాటలు విన్నవే... కానీ అర్థం తెలియనివి. మన దైనందిన జీవితములో చాలా మాటలకి మనకు అర్థం తెలియదు. ఓ శ్రీహరీ! నేను పరమపాపిని యెందుకంటే భవబంధాలచే





కట్టివేయబడ్డాను. అసలు నిన్ను ధ్యానించే అర్హతయైనా నాకున్నదా ప్రభూ! అంటున్నారు.

**భావవివరణ:**

ఓ శ్రీహరీ! నేను పరమపాతకుడను. భవబంధాలచేత కట్టివేయబడినవాడను. కామక్రోధాది అరిషడ్వర్గములకు లొంగిపోయి యెన్నో అకృత్యములను చేశాను. అసలు, నాకు నీదయ పొందే అర్హతవున్నదా ప్రభూ!

ఓ దేవా! నేను పవిత్రత లేని వాడను. "అమంగళుడ" (మంగళకరములు కాని పనులనే చేయువాడను). అపగతపుణ్యుడ (పోయిన పుణ్యము కలవాడను అంటే యేమాత్రం పుణ్యం లేనివాడను)... అలసుడను (సోమరిని). కపట కలుష పరికర హృదయుడను (కుత్సితము వంటి చెడుగుణములు సమూహాముగా గల హృదయం వున్నవాడను) ఓ ప్రభూ! ఇట్టి నేను అపవర్గమునకు (మోక్షమునకు) అర్హుడనా తండ్రీ?

స్వామీ! నేను అతి దుష్టుడ (చెడ్డవాడను). అధిక దూషితుడ (దైవదూషణ చేయు నీచుడను), హతవివేకుడ (నశించిన వివేకము కలవాడను... అంటే వివేకము లేని వాడను). అధముడను (దయా గుణము లేనివాడను). పతిలేని రమాపతీ! (ప్రతిలేని లక్ష్మీపతీ... అంటే నీలాంటి మరెవ్వడూ లేని శ్రీపతీ!) నేను మిమ్మల్ని తలచనేరను. శ్రేష్ఠమైన ముక్తికి నేను అర్హుడనా ప్రభూ?

ఓ దేవదేవా! నేను అనుపమ విషయపరాధీనుడను (సాటిలేని విషయ సుఖములకు బానిసనైనవాడను). అనంతమోహభయ ఆతురుడ (అంతులేని మోహము, భయము అను రోగములచే పీడితుడను). ఇది నీకు తెలిసిన విషయమే. నీవు శ్రీవేంకటేశ్వరుడవు. ఘనులు, అనఘులు (పాపరహితులు) కాక, నిన్ను వినుతించుటకు (కీర్తించుటకు) నేను అర్హుడనా తండ్రీ!

సంపుటి : 1    కీర్తన : కలలోని సుఖమే కలియుగమా

సంఖ్య : 118   పుట : 81    రాగం : సామంతం

**సామంతం**

15. కలలోనిసుఖమే కలియుగమా, వెన్న -
కలిలో నెక్కడిదె కలియుగమా ॥ పల్లవి ॥

కడిగడి గండమై కాలము గడపేవు
కడుగగడుగ రొంపి కలియుగమా
బడలికె వాపవు పరమేదో చూపవు
గడిచీటియును నీవు కలియుగమా ॥ కల ॥

కరపేవు కఱతలే మఱపేవు మమతలే
కరకఱ విడువవు కలియుగమా
తెరచీర మఱగింతే తెరువేల మానేవు
గరుసేల దాటేవో కలియుగమా ॥ కల ॥

కానిదె మెచ్చేవు కపటాలే యిచ్చేవు
కానీలే కానీలే కలియుగమా
పై నిదే వేంకటపతి దాసులుండగ
కానవా నీవిదేమి కలియుగమా ॥ కల ॥ 118

**అవతారిక :**

కలియుగంలో కలపురుషుని ప్రభావం వలన ధర్మం అధర్మంగానూ అధర్మం ధర్మంగానూ కనిపిస్తాయి. విపరీతమైన విశృంఖలత్వంతో మంచి వినేవారే వుండరు. ఈ కీర్తనలో ఆ కలియుగం యొక్క ప్రభావాన్ని వివరిస్తున్నారు అన్నమాచార్యులవారు. కలలో మనం సుఖంగా వున్నట్లు కలవచ్చినంతమాత్రాన ఆ సుఖం నిజంగా వుంటుందా? వెన్నకలి (ఒక దినుసు)లో పేరుకేగాని వెన్నయెలాగైతే వుండదో కలియుగంలో అంతా కలిగినట్లనిపించినా సుఖమనేది కలలోని మాట అంటున్నారు. ఎందుకంటే కపటత్వమే ఈ కలియుగ లక్షణం.





**భావవివరణ :**

ఓ కలియుగమా! వెన్నకలిలో పేరులోనే కానీ నిజంగా వెన్న అనేది ఎలా వుండదో... కలియుగంలో సుఖం కలిగివుంటుంది అనుకుంటే అది కేవలం కలలోని మాటయే సుమా! నిజంగా ఏ సుఖమూ వుండదు.

ఈ కలియుగంలో కడిగడి గండమై, (ప్రతి ఘడియా గండమువలే) కాలము గడుస్తుంది. కడుగుతున్న కొద్దీ రొంపి (బురద) అంటుతూనేవుంటుంది. తీరని అలసట కలుగడుతుంది. ముక్తి పొందు మార్గం గురించిన ఆలోచనయే రాదు. నీ ప్రయాణం ఎటువంటిదంటే... దానికి గడిచీటి (అనుమతిపత్రం) కూడ లేదు. ఓ కలియుగమా ఇక నీకు నీతి యెక్కడిది!

కరపేవు (అలవాటు చేస్తావు) కఱతలే (చెడ్డపనులు). మఱపేవు మమతలే (మమతానురాగాలతో ఒళ్ళు మఱచేట్లు చేస్తావు). కరకఱలు (కోపతాపాలు) విడిచిపెట్టవు. ఓ కలియుగమా! నీ గురించి ఇంకా ఏమి చెప్పమంటావు? తెఱచీరె (అడ్డముగా తెరవలె కట్టిన చీరె) ఏమి మఱుగు (చాటు) అందిస్తుంది? ఓ కలియుగమా! నీకున్న తెరువు (దారి... అంటే సన్మార్గం) ఎందుకు మూసివేస్తావు? గరుసేల దాటేవు? (నీ హద్దులు యెందుకు అతిక్రమిస్తావు?) ఓ కలియుగమా! నీవు చేస్తున్నది తప్పు.

ఓ కలియుగమా! ఏది మెచ్చుకోకూడదో దాన్నే మెచ్చుకుంటావు. కపట ప్రవర్తన అలవాటు చేస్తావు. కానీలే కానీలే నీ వ్యవహారం కూడా ఎంతకాలం సాగుతుందో చూద్దాము. పైనవున్న శ్రీవేంకటేశ్వరుని దాసులను కూడా కానవా యేమిటి? ఇదేమి పద్ధతే కలియుగమా? నీ ఆటలు వారి ముందు సాగవు జాగ్రత్త సుమా!

సంపుటి : 1 కీర్తన: ఏమియు జేయగవద్దు యింతలోనె మోక్షము

సంఖ్య : 430 పుట : 288 రాగం : గుండక్రియ

### గుండక్రియ

16. ఏమియు జేయగవద్దు యింతలోనె మోక్షము
దీమపువిజ్ఞానమే దివ్వెత్తుఫలము ॥పల్లవి॥

పాపచింత మదిలోన బారకుండా నిలిపితే
చేపట్టి దానములెల్లా జేసినంత ఫలము
కోపానలములోన కోరికలు వేల్చితేనే
యేపున యజ్ఞాలు నేసి యేచినంతఫలము ॥ఏమి॥

కనకముపై యాస కాదని పోదొబ్బితేనే
తనకు వేవేలు గోరతపముల ఫలము
వనితల మోహమువల బడకుండితేనే
దినము గోటితీర్థాలు దిరిగినఫలము ॥ఏమి॥

శ్రీ వేంకటేశ్వరు జేరి కొలుచుటే
ధావతిలేనియట్టి తన జన్మ ఫలము
భావించి యాచార్యపాదపద్మమూలమే
సావధానమున సర్వశాస్త్రార్థఫలము ॥ఏమి ॥ 430

**అవతారిక :**

చిత్తశుద్ధిలేని శివపూజలేలరా అన్నారు పెద్దలు. ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు మోక్షము సిద్ధించాలంటే ఘోరమైన తపస్సులాంటివి చేయవలసిన పనియేలేదు అంటున్నారు. దీమపు విజ్ఞానమే దివ్వెత్తుఫలము చేకూరుస్తుంది అంటున్నారు. అది దీమసపు విజ్ఞానమై యుంటుందని నా భావన. అంటే భగవంతుని గూర్చిన వుపయోగపడే జ్ఞానమే ఆకాశమంత ఉన్నతమైన ఫలమునిస్తుంది అని భావము. మదిలో పాపచింతన లేకుండా





బ్రతికితే సకలదానములు సలిపినంత ఫలము అంటున్నారు. గూఢార్థమేమంటే పాపచింతనతో యెన్ని దానాలు చేసినా నిరుపయోగం సుమా! అని.

**భావవివరణ :**

ఓ ప్రజలారా! ఇంతలోనే మోక్షము లభిస్తుంది. దాని కోసం ఏమియు చేయగవద్దు. మీకు దీమ (స)పు విజ్ఞానము (ఉపాయముతో కూడిన భగవత్ జ్ఞానమే దివి+యెత్తు ఫలము (అత్యున్నతమైన ఫలితము) నిస్తుంది.

మదిలోన పాపచింతన పారకుండనిలిపితే (సోకకుండా నిగ్రహించితే), చేపట్టి (నిర్వహించి) సమస్త దానములను చేసినంత ఫలమును చేకూరుస్తుంది. మనకి కోపం వస్తే అది అగ్నిలా దహించివేస్తుంటుంది. అది మన యొక్క మనస్సును దహించకుండా మనలో నిబిడీకృతమైన కోరికల్ని దహించి వేస్తే... ఏపున (గొప్పగా) సమస్త యజ్ఞాలూ చేసిన ఫలము కలుగుతుంది.

కనకముపై ఆస (బంగారం అంటే వ్యామోహం) మానవుని బలహీనత. దాన్ని పోదొబ్బితే (మెడపట్టి గెంటేస్తే) తనకు (అట్లాచేసిన వానికి) వేవేల తపములు (వేల కొలది తపస్సులు) చేసినంత ఫలము నిస్తుంది. స్త్రీల వ్యసనంతో మోహపీడితుడై వారి వెంటబడకుండా వుంటే, కోటి పుణ్యతీర్థములను దర్శించినంత ఫలము కలుగుతుంది. (అంటే... స్త్రీ వ్యసనంవున్నవాడు యెన్నిసార్లు కాశీ ప్రయాగలు వెళ్ళినా ఫలితం లేదు డబ్బు దండుగ... అంతేనంటున్నారు.)

శ్రీ వేంకటేశ్వరుని శరణుజొచ్చి సేవించిన ఆరాధించుటే ధావతిలేని యట్టి తన జన్మఫలము (నిరాసక్తితో జీవించే జన్మయొక్క సత్ఫలితము). భావములో కూడా అచంచల విశ్వాసంతో గురువుల పాదసేవ చేయుటయే సావధానముగా (హెచ్చరికతో) సర్వశాస్త్రములను అర్థసహితముగా నేర్చినంత ఫలము.

సంపుటి : 1　　కీర్తన : చీచీ వో బదుకా సిగ్గులేనిబదుకా

సంఖ్య : 467　　పుట : 33　　రాగం : బౌళి

**బౌళి**

17. చీచీ వో బదుకా సిగ్గులేనిబదుకా
వాచవికి బతిమాలి వడబడ్డ బదుకా　　॥పల్లవి॥

ఆసలకు జోటు గద్దు అంతరంగాన నెంతైన
నీసమంతా జోటు లేదు విరతికిని
యీసున సంసారమున కెందరైనా గలరు
వోసరించి మోక్షమియ్య నొకరు లేరు　　॥చీచీ॥

భోగించ వేళ గద్దు పొద్దువొడపుగుంకును
వేగమే హరిదలచ వేళలేదు
వోగులలంపటమున కోపి కెంతైనా గద్దు
యోగపు సత్కర్మాన కొకయింత లేదు　　॥చీచీ॥

యెదుట ప్రపంచాన కెఱు కెంతైనా గద్దు
యిదివో యాత్మజ్ఞాన మించుకా లేదు
మది శ్రీవేంకటేశుడు మమ్ము నిట్టె కాచెగాని
పదరి నానేరములు పాప మతి లేరు　　॥చీచీ॥ 467

**అవతారిక :**

అనుక్షణం కొత్త కొత్త కోరికలుకు తొత్తులైపోతూ సిగ్గులేని బ్రతుకులు ఈడుస్తూ జిహ్వాచాపల్యం కొఱకు బ్రతుకుతూ, ప్రతిదానికీ సర్దుకొనిపోయి జీవితం గడిపేస్తున్న మానవులు జీవించరు.... బ్రతుకుతారు. అట్టి బ్రతుకులకు ఛీ కొడుతున్నారు అన్నమాచార్యులవారు. తాను బ్రతికే ప్రపంచమే సర్వం అని తన ఆత్మజ్ఞానం కొద్దిగానైన నేర్వక ప్రపంచం గురించి ఇంకా తెలుసుకోవాలనుకొనే మాబోటివారికి దిక్కెవరు? నా





నేరములు పాప మతి వేంకటేశ్వరుడు దక్క అన్యులులేరు, అంటున్నారు. నా నేరముల బాప... అని వుంటే ఇంకా బాగుండేది.

**భావవివరణ :**

ఓ మానవ జీవితమా! ఛీ ఛీ ఎంత సిగ్గులేని బ్రతుకే? నీ వాచలకి (జిహ్వా చాపల్యం తీరుటకు) పరులను బ్రతిమాలి, భంగపడుతూ వడిబడ్డ (సర్దుకొనిపోయి) జీవితం గడిపేస్తున్న బ్రతుకా! దేనికోసం ఇదంతా?

ఓ బ్రతుకా! ఆసలకు చోటుగద్దు (వుంటుంది). కాని అంతరంగంలో విరతికి (విశ్రాంతికి) మాత్రం వీసమంత (కొంచెంకూడా) చోటులేదు. ఈర్ష్యా ద్వేషములతో ప్రపంచంలో గడుపుటకు అందరూ సిద్ధమే కానీ... ఓసరించి (వద్దు అని) మోక్షమార్గం ఇచ్చేవాళ్ళు ఒక్కరంటే ఒక్కరుకూడా లేరు.

నాకు భోగించడానికి మాత్రం బోలెడంత సమయం గద్దు (దొరికింది). వేగంగా రాత్రింబవళ్ళు గడచిపోయాయి. కాని శ్రీహరిని తలుచుకొనుటకు కూడా క్షణం తీరిక దొరకలేదు. ఓగుల లంపటానికి (దేవురించే పీకులాటలకు) మాత్రం ఎంత ఓపికయైనా నాకు వుంటుంది. యోగమార్గం నేర్చి సత్కర్మ చేయటానికి మాత్రం ఒకింతకూడా అవకాశం లేకుండా పోయింది.

ఓ శ్రీ వేంకటేశ్వరా! నాయెట్ట నెదుట నున్న ప్రపంచం తెలుసుకోవాలని ఆసక్తి, తెలుసుకొనే సాదనకు మాత్రం ఎంతైనా నాకు ఎఱుక (ప్రపంచజ్ఞానం) గద్దు (వున్నది). కానీ ఇదిగో నా ఆత్మయేమిటో తెలుసుకొనే ఆత్మజ్ఞానం మాత్రం అణువంతైనా లేదు. మా మదిలో వున్న శ్రీపతి మమ్ము ఇట్టే కాచుకొని (రక్షించాలికానీ).... పదరి (త్వరగా) నా నేరములబాప మతి దిక్కెవ్వరును లేరంటే లేరు.

సంపుటి : 1 కీర్తన : బోధకులెవ్వరు లేక భోగినైతిని

సంఖ్య : 465 పుట : 312 రాగం : కన్నడగౌళ

**కన్నడగౌళ**

18. బోధకులెవ్వరు లేక భోగినైతిని
శ్రీదరుడే మాకు దిక్కు చింతింప నికను ॥పల్లవి॥

పట్టి దిగంబరినై పాలే యాహారముచేసి
తొట్టినపంచేంద్రియములతోవ విడిచి
పుట్టితి సన్యాసినై బుద్దెటిగినెఱగక
అట్టె నడుమ సంసారినైతి నేనూ ॥బోధ॥

గచ్చుల నన్నీ మఱచి గాలే ఆవటించుకొని
అచ్చపుబరమయే కాంతసమాధి
నిచ్చలు నిద్రాభ్యాసనిర్మలయోగినైతి
కచ్చుపెట్టి మేలుకొని ఘనకర్మినైతి ॥బోధ॥

భావము పారవిడిచి బ్రహ్మాండమెల్ల నిండి
వేవేలు గోరికల వేడుకతోడ
జీవన్ముక్తుడనైతి శ్రీవేంకటేశ్వరు జేరి
ధావతు లిన్నియు మాని తన్మయుడనైతి ॥బోధ॥ 465

**అవతారిక :**

అతి తేలికగా కనుపించే ఈ కీర్తన బహు జటిలమైనదని నా అభిప్రాయం. నేను వ్రాసిన భావ వివరణే సరి అయినది అనే దుస్సాహసం చేయలేను. కాని ఇది నాకు స్ఫురించిన వివరణ. తాను జీవన్ముక్తుడనయ్యానని అంటున్నారు అన్నమాచార్యులవారు. ఇప్పటి వరకు హితవు బోధించేవారు లేక భోగినై శారీరక ఆనందమే పరమావధిగా జీవించాను. ఆ శ్రీధరుడే మాకు దిక్కై ఆదుకొన్నాడు. ఇక చింతించాల్సిన పనిలేదు అంటున్నారు.





**భావవివరణ:**

ఓ ప్రజలారా! ఇంతకాలమూ భోగివలె జీవించాను. బోధకులు (మంచి చెడు విడమరచి చెప్పేవారు) లేక నాకున్న సమయమునంతా వ్యర్థపరచి కొంటిని. శ్రీధరుడైన తిరుమలనాథుడు మాకు దిక్కు అయినాడు. ఇక మాకు చింతించవలసిన పనియేముంది?

తల్లి గర్భంలో చేరి నేను దిగంబరినైతిని (వస్త్రవిహీనుడనైతిని). పాలేయాహారముగా (తల్లి అందించే జీవరసాయనమే నా ఆహారముగా) పంచేంద్రియములతో నిమిత్తం లేక పెరిగి, సన్యాసినై (సంగరహితుడనై) పుట్టాను. బుద్ధి వున్నా లేనట్లే. నాకు మలమూత్రాల విచక్షణ కూడా లేదు. అట్లా పెరుగుతూ సంసారపు యావలో పడిపోయాను.

ఆ తరువాత నాలో పూచిన భావముల నన్నింటిని మఱచి గాలినే పొందికగా, నిజమైన ఏకాంత సమాధిలోకి ప్రవేశించి, నిత్యమూ యోగనిద్రలో గడిపే నిర్మలయోగినయ్యాను. ప్రయత్న పూర్వకంగా యోగనిద్ర నుంచి విముక్తడనై ఘనకర్మిష్ఠినైతిని. రకరకముల యోగకర్మలనవలంభించితిని.

వేవేల కోరికలను సంతోషముతో విడనాడి, భావము పారవిడచి (మనస్సులో కూడా మలినము లేక) బ్రహ్మాండమెల్ల ఆత్మరూపినై నిండిపోయాను. ఆ విధంగా నేను జీవన్ముక్తుడనయ్యాను. శ్రీ వేంకటేశ్వరు చేరుకొని, ధావతులన్నీ మానివేసి (ఆసలన్నీ విడనాడి) తన్మయత్వ స్థితి జేరుకొంటిని.

సంపుటి : 1    కీర్తన : ఏదియునులేని దేటిజన్మము

సంఖ్య : 301    పుట : 201    రాగం : నాట

**నాట**

19. ఏదియునులేని దేఁటిజన్మము
వేదాంతవిద్యావివేకి గావలెను ॥పల్లవి॥

పరమమూ ర్తిధ్యానపరుఁడు గావలె నొండె
పరమానందసంపద లొందవలెను
పరమార్థముగ నాత్మభావింపవలె నొండె
పరమే తానై పరగుండవలెను ॥ఏది॥

వేదశాస్త్రార్థకోవిదుఁడు గావలె నొండె
వేదాంతవిదుల సేవించవలెను
కాదనక పుణ్యసత్కర్మి గావలె నొండె
మోదమున హరిభక్తి మొగి నుండవలెను ॥ఏది॥

సతతభూదదయావిచారి గావలె నొండె
జీతమైనయింద్రియస్థిరుఁడు గావలెను
అతిశయంబగు వేంకటాద్రీశుసేవకులె
గతియనుచు తన బుద్ధిఁ గలిగుండవలెను ॥ఏది॥ 301

**అవతారిక :**

మానవునిగా జన్మము పొందిన జీవికి జీవితలక్ష్యం జ్ఞాన సముపార్జన. జ్ఞానం అంటే మనిషి బ్రతుకుటకుపయోగపడే 'విద్య' కాదు. అది యెలాగునైనా నేర్వవలసిందే. మరి చచ్చే దాకా బ్రతకాలికదా! జ్ఞానం భగవత్కృప వుంటేనే కాని కలుగదు. అసలు నీవు యెవరు? ఇది నేర్వవలెనంటే సత్యాసత్యాలు నిత్యానిత్యాలు జ్ఞానాజ్ఞానాల మధ్య తేడా తెలియాలి. ఈ వివేకము వేదాంత విద్య నేర్చుట వలన కలుగుతుంది.



అన్నమయ్య అధ్యాత్మ చింతన

అట్లు నేర్చినవానిదే నిజమైన మానవజన్మ. ఏమియులేక నిద్రాహారభయ మైధునాదుల నిమిత్తం బ్రతికితే అదేటి జన్మరా నాయనా? అంటున్నారు అన్నమాచార్యులవారు. 'ఒండె' అంటే ఏమిటి? నేటి కాలంలో 'అట్లా కాకపోతే' అని అంటున్నాం. జాగ్రత్తగా భావవివరణ చదవండి.

**భావవివరణ :**

ఏదియును లేని (యెట్టి ప్రయోజనము లేని) జన్మము (బ్రతుకు) యేటి జన్మము? (ఎట్లాంటి బ్రతుకు?) మనిషిగా పుట్టిన వాడు వేదాంత విద్యనేర్చిన వివేకి కావలెను. (నిత్యము తరించాలి). సత్యము కాని వాటికి ప్రాకులాడక వేంకటేశ్వరుని సేవలో పరమ మూర్తియైన శ్రీవల్లభుని ధ్యానపరుడు కావలెను. ఒండె (అట్లా కాకపోతే) పరమానందముచే లభించు అమందానందమును అనుభవించవలెను. ఆత్మయే పరమార్థము. అది భగవదంశతో కూడిన నిత్యసత్య స్వరూపము. ఆత్మను అట్లా భావించాలి. ఒండె (లేదా) తానే పరము, పరమే తానను విధమున యుండవలెను.

మానవుడు వేదాంతశాస్త్రము యొక్క అర్థములన్నీ నేర్చిన కోవిదుడు (పండితుడు) కావలెను. లేదా వేదాంత విశారదులను సేవిస్తూ జీవించాలి. కాదనక (వ్యతిరేకించక) పుణ్యకర్మలు (సత్కర్మలు) చేయు కర్మిష్టి కావలెను. లేదా సంతోషంతో హరిభక్తిలో దీక్షాదక్షుడైవుండవలెను.

మానవుడు ఎల్లప్పుడూ భూతదయతో కరుణామయునిగా జీవించాలి. లేదా జితేంద్రియుడైన స్థిరచిత్తుడు కావలెను. అతిశయించిన శ్రీవేంకటేశ్వరుని దాసులే దిక్కని బ్రతుకవలెను. అటువంటి భగవత్సేవకులే గతియను తన స్వంత బుద్ధి కలిగి యుండవలెను.

సంపుటి : 2 కీర్తన : అయ్యోమాయల బొంది అందునిందునున్నవారు

సంఖ్య : 12 పుట : 9 రాగం : భైరవి

## భైరవి

20. అయ్యో మాయలఁ బొంది అందు నిందు నున్నవారు
యియ్యగొనఁ గర్తలుగా రెఱఁగరు జడులు ॥పల్లవి॥

చుక్కలై యుండినవారు సురలై యుండినవారు
యిక్కడనుండి పోయినయీ జీవులే
దిక్కుల వారి నిందరు దేవతలంటా మొక్కేరు
యెక్కడైన హరి నాత్మ నెఱఁగరు జడులు ॥అయ్యో॥

పాతాళవాసులును పలులోకవాసులును
యీతరవాతనుండిన యీజీవులే
కాతరాన వారిపుణ్యకతలే వినేరుగాని
యీతల శ్రీహరికత లెఱఁగరు జడులు ॥అయ్యో॥

యిరవెఱిఁగినముక్తు లెఱఁగని బద్ధులు
యిరవై మనలోనున్న యీ జీవులే
సిరుల మించినవాఁడు శ్రీవేంకటేశ్వరుఁడే
శరణాగతులు దక్క చక్కఁగారు జడులు ॥అయ్యో॥ 12

**అవతారిక :**

'జడుడు' అంటే జడత్వము కలవాడని అర్థం. తెలివి తక్కువవాడు లేక మందబుద్ధి అని వివరించవచ్చును. అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో అయ్యో! మాయలో తగులుకొనిన అందునిందునున్నవారు (పరలోకంలోగాని ఇహలోకంలోగాని వున్నవారు) ఇచ్చిపుచ్చుకొనుటకు కర్తలు కారు, (వాళ్లు కర్మఫలం ఇయ్యలేరు, పుచ్చుకోలేరు). అంతమాత్రంకూడా యెరుగని జడులు. శ్రీవేంకటేశ్వరుని శరణాగతులు దక్క మిగతాజడులకు ముక్తి యెన్నటికీ సిద్ధించదు అంటున్నారు.





**భావవివరణ:**

అయ్యయ్యో! మాయలు బొంది (భగవంతుని మాయలలో తగులుకొనిన) జీవులే... అందునిందునున్నవారు (పరలోకములలోను, ఈ భూలోకంలోనూ వున్నవారు. వారి కర్మఫలాలననుసరించియే వారికీ లోకాలు దక్కాయి. కాని ఆ కర్మఫలం ఇయ్యటానికి గాని పుచ్చుకొనటానికి గాని వారు (జీవులు) ఎంతమాత్రము కర్తలు కారు. వారికేమీ తెలియదు. వారు జడులు (మందబుద్ధులు).

నక్షత్రాలలోవున్న ధ్రువునివంటివారు, దేవేంద్రాది దేవతలైనవారు, ఈ భూమిపై నుండి వారి పుణ్యవశమున అక్కడ చేరినవారే సుమా! ఆ దేవతలలోనే కొంతమంది దిక్కులవారు (దిక్పాలకులైనవారు). జడులైన ఈ మానవులు ఆ దేవతలనే సర్వశ్రేష్ఠులని మొక్కుతున్నారు. వీరు తమ ఆత్మలోనున్న శ్రీహరిని యెన్నటికీ తెలుసుకోలేరు. ఎక్కడెక్కడో ఆ హరి కోసం వెతుకుతూనేవుంటారు.

అధోలోకములైన పాతాళమున నున్న వారు అతల, వితల, సుతల రసాతల.... మొదలైన యెన్నో లోకముల నున్నవారు... యీ తరువాత నుండిన (మిగిలిన) ఈ జీవులే. ఆశ్చర్యమేమంటే... జడులైన ఈ లోకవాసులు, కాతరాన (భయంతో) వారికథలనే పురాణాలుగా వింటున్నారు. వారికే పుణ్యం వస్తుంది చెప్పండి? ఈతల (ఈలోకంలో) వారు శ్రీహరికథలనెరుగని జడులు కదా!

ఇకపోతే మనలోనే వున్న ఈ జీవుడు మాత్రం ఇరవెరిగిన (తనస్థానం... తన గమ్యం తెలిసినవాడైతే) ముక్తుడు (భవబంధములను వదలిన ఉన్నతుడు). లేనిచో ఏమి యెరుగని బద్ధుడు (బద్ధుడై చిక్కుబడినవాడు). సర్వైశ్వర్యములకు అధిపతి ఆ శ్రీవేంకటేశ్వరుడు. ఆయన కృపలేక మోక్షలక్ష్మి దక్కుతుందా? ఇది తెలియనివారు జడులే కదా! మరి అటువంటి జడులు ఎట్లా చక్కగా అవుతారు? ఆ శ్రీహరి శరణాగతితో మాత్రమే సుమా!!

సంపుటి : 2 కీర్తన : ప్రపన్నులకు నిది పరమాచారము

సంఖ్య : 317 పుట : 212 రాగం : నాదరామక్రియ

**నాదరామక్రియ**

21. ప్రపన్నులకు నిది పరమాచారము
విపరీతాచారము విడువఁగవలయు ॥పల్లవి॥

భగవదపచారము భాగవతాపచారముఁ
దగులక దేవతాంతరము మాని
నగధరు శరణము నమ్మి యాచార్యుని
బగివాయనిదే పరమవైష్ణవము ॥ప్రప॥

దురహంకారము దుఃఖము సుఖమునుఁ
బొరయక ప్రాకృతుల పొంతఁ బోవక
దరిశనాభిమానాన ధర్మము వదలక
పరిశుద్ధి నుండుటే పరమవైష్ణవము ॥ప్రప”

ఉపాయాంతరము లొల్లక భక్తి చేపట్టి
యెపుడూఁ దీర్థప్రసాదేచ్ఛతోడ
నిపుణత శ్రీవేంకటనిలయుఁడే గతియని
ప్రపత్తి గలుగుటే పరమవైష్ణవము ॥ప్రప॥

**అవతారిక :**

అహోబల మఠపు జీయరు, నృసింహోపాసకుడు అయిన శఠగోప యతీంద్రులచేత మంత్రోపదేశమును పొంది విశిష్టా ద్వైతం స్వీకరించిన అన్నమయ్య తన జీవితకాలంలో వైష్ణవుడై శ్రీవేంకటేశ్వరుని శరణాగతితో జీవించి 32000 కు పైగా సంకీర్తనలు చెప్పి తరించారు. శ్రీపతి శరణాగతి పొందిన ప్రపన్నులకు (ప్రపత్తిచేసినవారి) గొప్ప ఆచారము ఇదియే. ఇంకా అన్యములైన విపరీతాచారములను తక్షణమే విడువవలెను అంటున్నారు. వైష్ణవం చెప్పని ఏ ఆచారమైనా విపరీతమేనని అన్నమయ్య అచంచల విశ్వాసం. శ్రీవేంకటేశ్వరుడే గతియని ప్రపత్తి (శరణాగతికూడిన



అన్నమయ్య అధ్యాత్మ చింతన

భక్తి) గలుగుటే పరమవైష్ణవం యొక్క ముఖ్య లక్షణము. ఈ కీర్తనలో తీర్థ ప్రసాదేచ్ఛతో వుండమన్నారు. అంటే పానకం, వడపప్పు లొట్టలేసుకొంటూ తినటం కాదు. మరేమిటో చదవండి.

**భావవివరణ :**

ఓ భక్తులారా! ప్రపన్నులకు (వైష్ణవ దీక్ష స్వీరించి శ్రీహరి శరణాగతితో జీవించు వారికి), ఇది (శరణాగతి) పరమాచారము (విశిష్టమైన ఆచారము). ఇదిగాక విపరీతములైన (వ్యతిరేకములైన) ఆచారములను వెంటనే వదలివేయవలయును.

పరమ వైష్ణవమంటే యేమిటో తెలియుడు భగవదపచారము (భగవంతుని పట్ల నేరము) భాగవతాపచారము (భగవంతుని నమ్మినవారి పట్ల నేరము) తగులక (ఆచరించక) దేవతాంతరము (అన్యదేవతలను ఆరాధించుట) మానవలెను. నగధరుడు (కొండను వ్రేలిపై ధరించిన శ్రీకృష్ణుడు) శరణము అని నమ్మి తన ఆచార్యుని బగివాయనిదే (తోడు వదలిపెట్టక) సేవించుచు వుండవలెను.

దురహంకారము పనికిరాదు. సుఖదుఃఖములకు అతీతుడుగా వ్యవహరించవలెను. వాటిలో బొరయక (పొందుకోరక) వుండవలెను. ప్రాకృతులు (పామరుల) పొంత (పొత్తు పనికిరాదు. దరిశనాభిమానము (భక్తులు తీసికొనువచ్చు కానుకలపై కాంక్ష) ఏమాత్రమూ పనికిరాదు. ధర్మమునెప్పుడూ వదలిపెట్టరాదు. పరిశుద్ధాత్ములై వుండవలెను. పై లక్షణములన్నియు కలిగియుండుటే పరమవైష్ణవము. కేవలము వేష భూషణములు కలవారు వైష్ణవులు కారు.

ఉపాయాంతరములొల్లక (పని సానుకూలమగుటకు మరియొక తేలిక మార్గముల నంగీకరించక), భక్తి అను దీక్షను చేబట్టి, ఎప్పుడూ తీర్థ ప్రసాదేచ్ఛతో వుండవలెను (అనగా తీర్థయాత్రలు చేయుట, ప్రసన్నతతో యుండుట యందు ఇష్టము కలిగియుండవలెను). నైపుణ్యంతో శ్రీవేంకటేశ్వరుడే దిక్కు అని నమ్మి ప్రపత్తి (శరణాగతి) కలిగి యుండవలెను. అదియే పరమవైష్ణవము. మిగతావన్నీ బూటకములే.

సంపుటి : కీర్తన : మటి హరిదాసుడై మాయల జిక్కుపడితే

సంఖ్య : 29 పుట : 20 రాగం : దేసాక్షి

## దేసాక్షి

22. మటి హరిదాసుఁడై మాయలఁ జిక్కుపడితే
వెఱపించఁబోయి తానే వెఱచినట్లవును ॥పల్లవి॥

శూరుఁడైనవాఁడేడఁజొచ్చిన నడ్డము లేదు
ఆరీతిజ్ఞానికి విధు లడ్డము లేవు
కారణాన నప్పటినీఁ గలిగెనా నది మరి
తేరిననీళ్ల వండు దేరి నట్లవును ॥మటి॥

సిరులరాజైతే నేమి సేసిన నేరమి లేదు
పరమాధికారియైతేఁ బాపము లేదు
అరసి తనకుఁదానే అనుమానించుకొనెనా
తెరువే పోయేసుంకరిఁ దెలిపిన ట్లవును ॥మటి॥

భూమెల్ల మేసినా నాఁబోతుకు బందె లేదు
నేమపుఁబ్రపన్నునికి నింద లేదు
యీమేర శ్రీవేంకటేశ్వరుని శరణని
సోమరి కర్మమంటితే జుంటీఁగ కతవును ॥మటి॥ 29

**అవతారిక :**

హరిని నమ్మిన హరిదాసుడు నిర్మోహి కనుక ఏవిధమైన మాయలకు జిక్కుబడక నిస్సంగుడై వుంటాడు. అతనే మాయలో పడితే, భయపెట్టవలెనని భీకరమైన వేషధారణ చేసినవాడు తన వేషం చూసికొని తానే భయపడినట్లవును సుమా! అంటున్నారు అన్నమాచార్యులవారు.

అన్నమయ్య వాడిన భాష గ్రాంధిక భాష కాదు. రాయలసీమ మాండలికం. అందులోనూ ఆరువందల యేళ్ళనాటి మాండలికం అవటం వల్ల కొంత ఇబ్బంది తప్పదు. కాబట్టి భావ వివరణ కొంత భావజనితమే.





**భావవివరణ :**

హరిదాసుడైనవాడు నిర్మోహి. కనుక అతనిని భ్రమలు కలిగించే సంసార మాయలేమీ చేయలేవు. మరి అటువంటి హరిదాసుడే మాయలో జిక్కితే, వెఱపింపబోయి (భయపెట్టాలని ప్రయత్నించి) చివరికి తానే భయపడ్డట్టవుతుంది.

శౌర్యవంతుడెక్కడకు వెళ్ళినా, ధైర్యంగా అడ్డంకులన్నీ అధిగమించగలడు. అదే విధంగా జ్ఞానియైనవాడు కర్మమార్గంపై విరక్తుడై వుంటాడు గనుక వాడికే విధులు అడ్డురావు. కారణాన (సహేతుకంగా) నప్పటి నీగలిగితే భగవదర్పణ చేయగలిగితే అది వండుమట్టి జేరిన నీళ్ళు తేర్చితే తేరి శుద్ధమైనట్లు అవుతుంది.

సిరులన్నీ వున్న కుబేరుడైనా చేసిన దోషము దోషమే. అత్యున్నత అధికారియైనా పాపముచేస్తే పాపమే, శిక్షార్హుడే. తనమీద తనకే నమ్మకం లేక అనుమానంతో పీడింపబడేవాడు తనని తాను అనుమానించుకొంటే, దారినపోయే బాటసారి తనకు తానే సుంకము (ఈనాటి సేల్స్ టాక్స్) నేను ఇంత కట్టాలి అని తెలిపినట్లవుతుంది.

ఆంబోతుకు అచ్చువేసి వూరిపై వదలిపెడతారు. అది ఎక్కడపడి మేసినా బందిలదొడ్డిలో పెట్టరు. ఎందుకంటే అది పరమేశ్వరుని ప్రీతికోసం చేస్తున్నామని భావిస్తారు కనుక. నేమపు (నియమములు గల) ప్రపన్నులకు (హరి శరణాగతులకు), నిందలేదు (ఏతప్పు వుండదు). ఈ విధంగా శ్రీవేంకటేశ్వరుని శరణు జొచ్చినవారు తిరిగి సోమరి కర్మమంటితే (వ్యర్థమైన కర్మిష్టులైతే), జుంటీగ కతవును (తుమ్మెద కథమాదిరవుతుంది). పూలమీద వాలి మకరందం పోగుచేసి, కష్టపడి తేనెపట్టులో అది దాచుకొన్న తేనె, చివరికి దానికేమన్నా ఉపయోగపడుతుందా? ఆలోచించండి.

సంపుటి: 2 కీర్తన : పరులకైతే నిదే పాపము గాదా

సంఖ్య : 316. పుట : 212 రాగం : నాదరామక్రియ

**నాదరామక్రియ**

23. పరులకైతే నిదే పాపముగాదా
పురిగొని నీవంకఁ బుణ్యమాయఁగాక ॥పల్లవి॥

పరమపురుష నీవు పట్టినదే ధర్మము
అరసి నీవు చెల్లించినదే సత్యము
ధరలోన నీరెంటికి తండ్రితో విరోధించఁగ
దొరసి ప్రహ్లాదునకు దోడైనదే గురుతు ॥పరు॥

నారాయణుఁడు నీవు నడపినదే తగవు
ఆరూఢి నీవౌనన్నదే ఆచారము
సారెకుఁ దమయన్నతో చండిపడి పెనగఁగ
కోరి సుగ్రీవు వహించుకొన్నదే గురుతు ॥పరు॥

శ్రీవేంకటేశ నీవుచేసినదే నీతి
చేవతో నీవొడఁబరచినదే మాట
కావించి తాతతోఁ బోరఁగా నీవు చక్రమెత్తి
ఆవేళ నడ్డమైనందుకు అర్జునుఁడే గురుతు ॥పరు॥

**అవతారిక:**

న్యాయాన్యాయాలు, ధర్మాధర్మాలు మానవమాత్రులకే కాని, పరమాత్మకి ఈ పరిమితులేవీ లేవు. ఆయన చెప్పిందే ధర్మం ఆయన చేసిందే న్యాయం. భాగవతం చదివిన పామరులకి ఇది అన్యాయం అనిపించినా ధర్మసూక్ష్మం తెలిసినవారు పరమాత్మ ధర్మపక్షపాతి కనుక అలా జరిగిందని భావిస్తారు. ఆయన, తండ్రీ కొడుకులకు... అన్నాదమ్ములకు... తాత మనుమళ్ళకు తంపులు పెట్టే తంపులమారిగా మనకు కనిపిస్తాడు. సానపట్టని వజ్రాన్ని సామాన్యులు పోల్చుకోగలరా?





ఇంకొకళ్ళకి ఇదే నీపనులు పాపములు గావా? నీకు మాత్రం పుణ్యములే అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావవివరణ:**

ఓ దేవదేవా! పరులకైతే ఇదే (నీవు చేసిన ఈ పనులే) పాపముగాదా? (పాపకర్మలు అవుతాయి కదా!) పురిగొని (వ్యాపించి) నీవంక (నీపక్షంగా చూస్తే) అదే పుణ్యకర్మ అయిపోయింది గదా!

నీవు పరమపురుషుడవు కాబట్టి నీవు చేబట్టినదే ధర్మము. నీవు చెల్లుబడి చేసినదే సత్యము. మానవలోకంలో దీనికి గురుతు (సాక్ష్యం) యేమిటో చెప్పమంటావా స్వామీ! ఈ రెండిటికీ ప్రహ్లాదుని చరిత్రయే గురుతు. తండ్రీ కొడుకులకు విరోధం పెట్టి కొడుక్కి తోడై తండ్రిని తుదముట్టించావు కదయ్యా!

నీవు శ్రీమన్నారాయణుడవు. నీవు నడిపినదే తగవు (ఇద్దరిమధ్య తగవులు పెట్టాలంటే పెడతావు తీర్చాలంటే తీరుస్తావు). రూఢిగా నీవుదేన్ని ఔనంటే అదే ఆచారము. ఈసారి దీనికి గురుతు యేమిటో చెప్పనా? తన అన్నతో చండిపడి (విభేదించి), పోరాడగా సుగ్రీవుని కోరివహించి (కావాలని అతని పక్షాన చేరి, చెట్టుచాటునుంచి శత్రువుకాని వాడిని చంపావనే అపకీర్తిని కూడా రామావతారంలో భరించావు). ఇంతకంటే గురుతు ఇంకేమి కావాలి?

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు చేసినదే నీతి. నీవు అంగీకరింపజేసినదే మాట (వేదవాక్కు). ఆ రోజుల్లో నృసింహ, రామచంద్రులుగా అలా చేశావు, సరే మరి ద్వాపరయుగంలో ఏమిచేశావు? తాతగారితో (భీష్మునితో) మనుమడు (అర్జునుడు) సరిగా యుద్ధం చేయటంలేదనే నెపంతో చక్రం పట్టనన్న మాటని గాలికి వదలివేసి చక్రంతో భీష్ముని చంపబోయి రోషపడిన మనుమడితో తాతని చంపించావు. ఇంతకంటే గురుతు ఏమికావాలి? తండ్రీ! నీవు జగన్నాటక సూత్రధారివి. నీకు అడ్డేమిటయ్యా! కానివ్వు నీ ఇష్టం.

సంపుటి : 2 కీర్తన : అంతరుమాలినయట్టి అధములాల

సంఖ్య : 17 పుట : 12 రాగం : మలహరి

**మలహరి**

24. అంతరుమాలినయట్టి అధములాల
పొంత సంతకూటమి పొరిచూపు గాదా ॥పల్లవి॥

కనక మిత్తడితోడ కలయ సరిదూఁచితే
అనువవునా అది దోష మవుఁగాక
ఘనుఁడైన హరితోఁ గడుహీనదేవతల
ననిచి సరివెట్టితే నయ మవునా భువిని ॥అంత॥

పట్టభద్రుఁడు గూర్చుండే బలుసింహాసనముపై
వెట్టిబంటుఁ బెట్టేవారు వెఱ్ఱులేకారా
గట్టిగా శ్రీహరితోడ కలగంపదేవతలఁ
బెట్టి కొలుచుట విందువెట్టి పగగాదా ॥అంత॥

కొంచక సింహముండేటిగుహ నుండవచ్చునా
పొంచి నక్కలకెల్ల బొక్కలేకాక
అంచెల శ్రీవేంకటేశుఁ డాత్మలోనే వుండఁగాను
కొంచపుదైవాల పలువంచలనేకాక ॥అంత॥ 17

**అవతారిక:**

అన్నమాచార్యులవారి కీర్తనలలో పల్లవిని అర్థం చేసికోవటమే ఒక గండం. ఈ పల్లవికి అర్థం... తారతమ్యాలు తెలియని అధములారా! సంతకూటములలో ఒకడికింకొకడు తెలియక పోయినా పరస్పరం మర్యాదలొలక బోసికొనినట్లు, ముక్కూ మొగం తెలియని చిల్లర దేవుళ్ళకు మొక్కటం పొరిచూపు (భేద భావంతో చూచుటే) కదా! ఆ దేవతలు శ్రీహరికి సరితూగగలరా? మృగరాజైన సింహం వుండాల్సిన గుహలో





బొక్కలు (ఎముకలు) తినే నక్కలు వుండతగునా అంటున్నారు. అన్నమయ్య తీవ్రవైష్ణవతత్వం పాఠకుల్ని సంభ్రమపరుస్తున్నది.

**భావవివరణ :**

అంతరుమాలినయట్టి (తారతమ్యాలు తెలియని) అధములారా! సంతకూటమి పొంత (వారం వారం జరిగే సంతల దగ్గర) పొరిచూపెగాదా? (భేద దృష్టితో చూచుటలాంటిదేకదా!) అంటే... ఒకడి కంటే ఇంకొకడు గొప్ప అని పరస్పరం మన్నించుకోవటం లాంటిదే ఈ విభిన్న దేవుళ్ళను కీర్తించటం కూడా.

ఒక కంసాలి ఇత్తడి బంగారం ఒకే రంగులో వున్నాయని సమానంగా తూస్తే... అది దోషమవుతుంది గాని, అనువవునా (అంగీకారము అవుతుందా? అదే విధంగా ఘనుడైన శ్రీహరితో అతిహీనులైన (కామక్రోధాలకు లొంగిపోయే) ఇతర దేవతలను సరిబోలిస్తే భూలోకంలో, అది నయము అవుతుందా? ననిచి (అతిశయించి) అట్లు చేయదగునా?

సింహాసనం మీద పట్టభద్రులు (సర్వశ్రేష్ఠుడని నిర్ణయించే ప్రశంసాపత్రం పొందినవారు) కూర్చోవాలి. అటువంటి సింహాసనం మీద వెట్టి చాకిరి చేసే బంటులను (నేటి కాలంలో బంట్రోతులు) కూర్చోబెట్టేవాళ్ళు వెఱ్ఱివాళ్ళు కాదా? శ్రీహరితో కలగూరగంప దేవుళ్ళను (రకరకాల కూరగాయలుండే గంపలో ఏవేవో కూరలున్నట్లు, వూరికొక్కరుండే దేవతలను) పెట్టి పూజిస్తే అది విందుకు పిలిచి పగవారిని గౌరవించుట కాదా?

మృగరాజైన సింహం వుండాల్సిన గుహలో, పొంచి (దాగికొని) కొంచక (సంకోచము లేక) వుండే నక్కలకు ఏం మిగులుతాయి? బొక్కలే కాక మృగాలు దొరుకుతాయా? ఆత్మస్థితుడైయుండే పరమాత్మ ఎవరు? ఆ శ్రీవేంకటేశ్వరుడే. ఆ దేవదేవునితో కొంచెపుదైవాల (అల్పులైన దేవతలను) సరితూచటం పలువంచలనేకాక (అమర్యాదకరమైన పనియే సుమా!)

సంపుటి : 2 కీర్తన : నన్ను నింతగా గడించి నాయమా దిగవిడువ

సంఖ్య : 39 పుట : 27 రాగం : కన్నడగౌళ

## కన్నడగౌళ

25. నన్ను నింతగా గడించి నాయమా దిగవిడువ
అన్నిటా రక్షించకపో దంతర్యామి ॥పల్లవి॥

సొమ్ము వోవేసినవాఁడు చుట్టిచుట్టి వీథులెల్లా
కమ్మక వెదకీనట కన్నదాఁకాను
నమ్మిన అజ్ఞానములో నన్నుఁబడవేసుకొని
అమ్మరో వూరకుందురా అంతర్యామి ॥నన్ను॥

వోడబేరమాడేవాఁడు వొకదరి చేరిచి
కూడినయర్థము గాచుకొనీనట
యీడనే ప్రపంచములో నిట్టె నన్ను దరిచేర్చి
వోడక కాచుకోరాదా వోయంతర్యామి ॥నన్ను॥

చేరి వుప్పమ్మేవాఁడు చిట్లు వేఁగనఁడట
వూరకే శ్రీవేంకటేశ వోపికతోడ
ఆరయ నన్నుఁ బుట్టించినట్టివాఁడవు నాభార...
మేరీతి నైన మోవు మిఁక నంతర్యామి ॥నన్ను॥ 39

**అవతారిక :**

పరమాత్మ మనలోనే అంతర్యామివలె వుంటాడనేది జగమెరిగిన సత్యం. మనని కల్పించిన వాడు ఆయనే కదా! శరీరాన్ని ఇచ్చి పోషించి, మనోవికాసము మనోవ్యాకులత కూడా కల్పించేవాడు ఆ శ్రీహరియే. ఇంతగా నన్ను గడించి (కల్పించి) ఇప్పుడు దారిమధ్యలో నన్ను దిగవిడచుట న్యాయమా ప్రభూ? నేనేమైపోతాను? ఓ అంతర్యామీ! అన్ని విధాలా నన్ను రక్షించక పోదు (కుదరదు). నన్ను పుట్టించావు కదా! మరి





నా భారం ఇంకెవరు మోస్తారు అదెవరివలనవుతుంది? నీకు తప్పదు అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావవివరణ :**

ఓ దేవదేవా! నన్ను ఇంతగా గడించి (కల్పించి), ఇప్పుడు దిగవిడువ (ఉన్నట్లుండి వదలివేయుట) నాయమా (న్యాయమేనా?) ఓ అంతర్యామీ! (అంతరాత్మవలె నాలోనే వున్న మహానుభావా!) అన్నిటా నన్ను రక్షించక పోదు (తప్పదు) తండ్రీ!

ఒక అజ్ఞాని సొమ్ముపారేసికొనినాడు (ధనం పారవేసికొనినాడు). దానిని కన్నదాకాను (అది దొరికేదాకా) వీధులెల్లా చుట్టిచుట్టి కమ్మక తిరుగుతూ వెదకుతూనే వుంటాడు. నేనూ అజ్ఞానినే కదా! నిన్ను పారవేసికొని అదేపని చేస్తున్నాను. అమ్మరో! (అయ్యయ్యో!!) నన్ను అజ్ఞానంలో పడవేసి ఈ రీతి వూరకుందువో? ఓ అంతర్యామీ! ఇది నీకు న్యాయమేనా తండ్రీ!

ఓడనుబేరం చేసికొని దానిపై వెళ్ళి వ్యాపారం చేసి వచ్చిన లాభం యెక్కడ లెక్కవేసికొంటాడు? సముద్రంమీదకాదు కదా! అట్లాగే ప్రపంచమనే ఈ మహాసాగరంలోంచి నన్ను దరితేర్చి అప్పుడు ఇట్టే నీలెక్కలు కట్టుకోరాదా? ఓడక (వదలిపెట్టక) కాచుకోరాదా? (కాపాడుకోకూడదా?) ఓ అంతర్యామీ! ఈ సముద్రం మధ్యలో నీవు లెక్కలు వేసికొంటూ కూర్చుంటే నాకు దిక్కెవరు? తండ్రీ! నీకు తెలియందేముంది?

బజారులో చేరి పువ్వమ్మేవాడు (పూలు అమ్ముకొనేవాడు) చిట్లువేగనడు (ఒకటి రెండు పనికి రాని పూలువున్నా పట్టించుకోకుండా మంచివాటితోపాటు వీటినీ చెలామణి చేస్తాడు). ఓ శ్రీవేంకటేశ్వరా ! నీవు ఎంతో ఓపికతో నన్ను పుట్టించావు. పైగా అంతర్యామివై నన్ను అనుక్షణం నిర్దేసిస్తున్నవాడవూ నీవే. మరి ఇక నా భారం నీవు కాక ఇంకెవరు మోపగలరు? (మోయగలరు?) నీకు తప్పదు ప్రభూ!

సంపుటి : 2 కీర్తన : నాకు నందు కేమి వోదు నన్ను నీ వేమిచూచేవు
సంఖ్య : 28 పుట : 19 రాగం : సాళంగనాట

## సాళంగనాట

26. నాకు నందు కేమి వోదు నన్ను నీ వేమిచూచేవు
నీ కరుణ గలిగితే నించి చూపవయ్య ॥పల్లవి॥

ఘోరమైన దేహపు దుర్గుణ మేమి గలిగిన
ఆరసిఁ బ్రకృతిఁబోయి అడుగవయ్య
నేరని నాజన్మముతో (లో?) నేరుపేమిగల్లా నన్ను
ధారుణిఁ బుట్టించినవిధాత నడుగవయ్య ॥నాకు॥

పంచేంద్రియములలోని పాపమేమి గలిగినా
అంచెలఁగామునిఁబోయి అడుగవయ్య
ముంచిన నాకర్మములో మోసమేమి గలిగినా
మంచితనానఁ జేయించేమాయ నడుగవయ్య ॥నాకు॥

అన్నిటా నా వెనకటి అపరాధ మేమిగల్లా
మన్నించి నాగురుఁజూచి మానవయ్య
మిన్నక శ్రీ వేంకటేశ మీఁది పనులేమిగల్లా
నిన్నుఁజూచుకొని నన్ను నీవే యేలవయ్య ॥నాకు॥

**అవతారిక :**

అరిషడ్వర్గ ప్రేరితమైన మానవజన్మనెత్తాను. కాని ఈ జన్మ నీవిచ్చిందే కదా! ఈ దేహంతో చేసిన పాపాలకు ప్రకృతిది బాధ్యత. ఇకపోతే నన్ను ఇట్లా పుట్టించిన బ్రహ్మగారిది తప్పు. నాపంచేంద్రియాలదేమి తప్పు? వాటిని వశం చేసికొనిన మన్మథుడు బాగానే వున్నాడు. నీమాయ నడిపించినట్లు నడిచిన నా కర్మములో మోసమేముంది? పోనీ ఒకవేళ వున్నా... నా గురువును చూచి నన్ను వదిలివేయవయ్యా!





ఓ శ్రీవేంకటేశ్వరా! మీది పనులేమిగల్లా (నన్ను మించిన పనులు ఏమన్నావుంటే) సర్వేశ్వరుడవైన నిన్ను జూచుకొని, నేను నీ భృత్యుడను కాబట్టి నన్ను నీవే ఏలవయ్యా! ... అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావవివరణ :**

నేను నేరస్థుడనని నీవు భావించవచ్చును. అది నీ తప్పు కాకపోవచ్చును. కానీ జరిగేవన్నీ నానేరములే నని అనటం ఏమి న్యాయం? ఒకవేళ నీవు నన్ను నిందించినా... నాకున్ అందుకేమియునుపోదు. నన్ను నేరస్థునిగా నీవేమి చూచేవు? నామీద జాలి కలిగితే నీ కరుణ చూపించు. కాని అయిన దానికి కాని దానికి నన్ను తప్పుబట్టకు స్వామీ!

నా దేహములో ఘోరమైన దుర్గుణములు కలిగినా నేనేం చేస్తాను? పోయి ప్రకృతిని అడుగవయ్యా. అది చేసే దుర్మార్గానికి నాదా తప్పు? నా జన్మమున ఏమాత్రము నేర్పు (తెలివీ, లేదా, అతితెలివి) వున్నా దానికి బాధ్యుడు నన్ను పుట్టించిన విధాత (బ్రహ్మగారు). పోయి ఆయన్నడగవయ్యా! ఏమిటిరా బ్రహ్మా! వీడిజన్మ ఇలా తగలబడిందేమిటి? అని ఆయనను అడుగు.

నా పంచేంద్రియములవల్ల పాపములు జరుగుతున్నవి అని అనడమేమి సబబు ప్రభూ! నీవు పోయి వాటిని వశం చేసికొని నన్ను ఆడిస్తున్న ఆమన్మథుని అడగరాదా? నీ మాయ, మంచిని కనబరుస్తూ మాచేత అనేక కర్మములను చేయించుచున్నది. అది కర్మబంధం. దానిలో మునిగి మేము బయటపడలేకున్నాము. కర్మలను చేస్తూనే వున్నాం ఫలితం అనుభవిస్తూనే వున్నాం. ఇందులో కర్మల యొక్క మోసం ఏముంది? మహామాయ నీదయితే మా కర్మలేం చేస్తాయి స్వామీ!

పోనీ... నా పురాకృత కర్మములు (వెనుకటి జన్మల కర్మలు) అపరాధ భూయిష్టములనుకొందాం. కాని నా గురుపుంగవులు మహానుభావులు వారిని జూచి నన్ను మన్నించరాదా? మిన్నక (ఊరకనే) నన్ను యేలుకోవయ్యా! ఎందుకంటే... ఓ శ్రీవేంకటేశ్వరా! మీది పనులేమిగల్లా (నన్ను మించిన పనులు, నేను ఒక వేళ ఏమన్నా చేసివున్నా... నేను నీ భృత్యుణ్ణి కాబట్టి) నిన్ను జూచుకొని నీవే నన్ను యేలుకోవాలి. నీకు తప్పదు మరి.

సంపుటి: 2 కీర్తన : సేయనివాడెవ్వడుచేరి చిల్లర దోషాలు

సంఖ్య : 72 పుట : 49 రాగం : రామక్రియ

**రామక్రియ**

27. సేయనివాఁ డెవ్వఁడు చేరి చిల్లర దోషాలు
యేయెడ జీవులజాడ లీశ్వరకల్పితమే ॥పల్లవి॥

దేవునినమ్మినయట్టి దేహియట యాతనికి
యీవల నెంతటిపాప మేమిసేసును
భావించి యన్నినేరాలు పరిహరించు నతఁడే
ఆవటించు సూర్యునికి నంధకార మెదురా ॥సేయ॥

పూజింపించుకొనేవాఁడు భువనరక్షకుఁడట
తేజముతో దురితాలు తెంచఁగలేఁడా
రాజు సేసినయా ణాజ్ఞ రాజుకంటే నెక్కుడా
వోజతో వజ్రాయుధాన కోపునా పర్వతాలు ॥సేయ॥

చేతనాత్మకుఁడట శ్రీవేంకటేశ్వరుఁడు
జాతిలేనిజీవునికి స్వతంత్ర మేది
కాతరపుజన్మానకుఁ గార్యకారణ మేది
యేతున గరుడనికి నెదురా పాములు ॥సేయ॥ 72

**అవతారిక :**

అన్ని మతములు ఘోషించేది ఒకే సూత్రాన్ని. పాపము చేసిన వానిని ద్వేషించకండి. వాడి పాపమును ద్వేషించి వాడు తిరిగి ఆ పాపం చేయకుండా సన్మార్గంలో నడపండి. చిన్న చిన్న దోషములు వుండని మానవుడు వుండనే వుండడు. ఈ జీవుల జాడుల (రూట్స్) ఈశ్వర కల్పితములు. కాబట్టి వీరిని సంస్కరించే శక్తి వున్నదీ ఆయనకే. అసలీ జీవుడికి స్వతంత్రమేది? చేతనాత్మకుడైన శ్రీ వేంకటేశ్వరుడు దయతలచక పోతే... అంతే సంగతులు అంటున్నారు అన్నమాచార్యులవారు. నేను





పండితుడిని, సమర్థుడిని, స్వతంత్రుడిని అనుకునే అమాయక జీవుల్లారా! పాములు గరుత్మంతుణ్ణి ఎదిరించగలవా? అంటున్నారు.

**భావవివరణ :**

ఓ మానవులారా! చిల్లరదోషములు (చిన్నచిన్న తప్పులు) చేయని వాడెవ్వడుంటాడు? ఏయెడ (ఎక్కడెక్కడా) జీవుల జాడలు (విధానములన్నియును) ఈశ్వర కల్పితములే. (భగవంతునిచే నిర్దేశించబడినవి మాత్రమే). ఆయన సంకల్పంతోనే అన్నీ జరుగుతాయి.

దేవుని నమ్మినటువంటి దేహి (జీవుడు). వాడిని ఎంతటి పాపమైనా యేమిసేసును (ఏం చేస్తుంది?) ఈ జీవుడి నేరాలన్నింటినీ భావించి (గ్రహించి) పరిహరించే (నిర్మూలించే) సమర్థుడు ఆ సర్వేశ్వరుడే. ఆవటించి (పొందుపడి... లేక ... పూనుకొని) సూర్యకాంతిని చీకటి ఏమిచేయగలదు?

మనందరితో పూజింపించుకొనేవాడు (పూజలు చేయించుకొనేవాడు) పదునాల్గు భువనాలను రక్షించు దీక్షాదక్షుడైన జగదీశ్వరుడు. ఆ తేజోమూర్తి మన దురితములను (పాపములను) తెంచగ లేడా? రాజు సేసిన, ఆణాజ్ఞ (ఆన+ఆజ్ఞ) రాజుగారికంటే ఎక్కువా? ఓజతో (దేదీప్యమానంగా వెలిగిపోయే) వజ్రాయుధానికి (ఇంద్రుని వజ్రాయుధాన్ని) పర్వతాలు ఓపునా? (చాలునా)

శ్రీవేంకటేశ్వరుడు చేతనాత్మకుడట (చేతనాస్వరూపుడైన ఆత్మవలె జీవులన్నిటిలోనూ వున్నాడు). ఆ జీవుడికి జాతి అనేది లేనే లేదు. ఇక స్వతంత్రం మాత్రం ఎక్కడుంది? ఇవన్నీ కాతరపు జన్మలే (తత్తరపాటు కలిగిన బ్రతుకులే). వీటికి కార్యకారణమేది? (ఇది ఇందుకు జరిగింది అని చెప్పగలిగిన మొనగాడెవడు?) వాడే... ఆ జగన్నాథుడే చెప్పగలడు. చిన్న చిన్న పాములవంటి ఈ జీవులు గరుత్మంతుడువంటి పరమాత్మ నెదిరించగలవా?

సంపుటి : 2 కీర్తన : ఇద్దరు దేహసమ్మంధ మిదివో మాయ

సంఖ్య : 92 పుట : 62 రాగం : సామంతం

## సామంతం

28. ఇద్దరు దేహసమ్మంధ మిదివో మాయ
గద్దించి యాడవుండునో కడసారీ తాను ॥పల్లవి॥

తోడఁబుట్టినమమత తొడఁగి కొన్నాళ్లకు
వాడికె పుత్రులమీఁదవలె నుండదు
వేడుక వారెవ్వరో వీరెవ్వరో కాని
కూడపెట్టీ వీరికే కొట్లాడీ వారికే ॥ఇద్ద॥

తల్లిమీఁదఁ గల భక్తి తనకే కొన్నాళ్లకు
యిల్లాలుమీఁదవలోబఎ నింత వుండదు
వెల్లవిరి నది యెంత విచారించ నిది యంత
యిల్లుముంగి లొక్కరిది యెరపు వొక్కరిది ॥ఇద్ద॥

నీతితో శ్రీవేంకటేశునిత్యసేవ కొన్నాళ్ల –
కీతల సంసారమంత యితవు గాదు
అతఁడెట్టు యివిమెట్టు అందరూ నెఱిఁగినదే
చేతు లొకటిమీఁదట చిత్త మొకయందు ॥ఇద్ద॥ 92

**అవతారిక :**

మానవుని జీవితంలో బాల్య, కౌమార, యౌవన, వృద్ధాప్య దశలుంటాయి. ఆయా దశలలో అతనికి అప్పటికవసరమైన బంధాలు అనుబంధాలు కలుగుతాయి. అన్నదమ్ములు సర్వస్యం అనుకొని, ఆడిపాడి వారితో పెరిగి తనకి పుత్రులు కలగగానే సోదరులతోనే కలహిస్తాడు. తల్లి మీద భక్తితో పెరిగినవాడే, తన ఇల్లాలు రాంగానే. ఇల్లాలికి ముంగిలి (ఇంటిలో ముందు ప్రదేశం) తల్లికి యెరవు (అడుక్కోవటం) ఇస్తాడు. శ్రీవేంకటేశ్వరుని సేవ చేయు దీక్షాపరులకు ఇతర సంసార





తాపత్రయములు రుచించవు. వారి చేతలు ప్రాపంచికంగావున్నా, మనస్సు స్వామిపైనే వుంటుంది. మరికొందరు దౌర్భాగ్యులున్నారు. వారి చిత్తము సంసారము మీద, చేతులు దేవుడి పూజమీద వుంటాయి. అంతా... ఆ నామాలవాడి మాయ అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావవివరణ :**

నేను ఇకపై చెప్పబోవు... ఇద్దరు (రెండు రకములు) వారితోటి సంబంధములూ ఆత్మ సంబంధములు కావు. అవి ఈ జన్మకు, ఈ దేహంతో కలిగిన సంబంధములు మాత్రమే. ఇది ఒక మాయ. తాను (ఈ జీవి), గద్దించి (సాధికారంగా) కడసారి (క్రిందటి జన్మలో) ఏడవుండునో (ఎక్కడున్నాడో ఎవరికి తెలుసు?) అంటే ఇప్పుడు నేను ఈ పేరు గల వ్యక్తిని... (క్రిందటి జన్మలో ఎవరినో...?)

తోడబుట్టినవాళ్ళతో ఆడుతూ పాడుతూ పెరిగినా, తన పుత్రులు పెరిగి పెద్దవుతూనే, ఆస్తికోసం తగాదాలు పడతారు. ఆలోచించండి. నిజానికి వారెవ్వరు? వీరెవ్వరు. ఇద్దరూ కేవలం ఈ జన్మకే వచ్చినవారుకదా! గత జన్మలో లేరు... వచ్చే జన్మలో రారు. మరి కొడుకులకోసం కూడబెడతారు, తోబుట్టులతో కోట్లాడుతారు. ఏమిటీమాయ?

మానవజీవితంలో తన తల్లి మీద ఎంత భక్తితో పెరిగినా అది తన ఇల్లాలి మీదవున్నంత వుండదు. ఇదంతా విచారించి చూస్తే వెల్లువిరిసిన మాయ అనిపించకమానదు. ఆలోచించి చూడండి ఒక్కరికి (పెళ్ళానికి) ఇల్లు ముంగిటి అంటే ఇంటిలోని ముందు ప్రదేశం (నేటి భాషలో పడకగది). ఇంకొకరికి (తల్లికి) ఎరవు (ఎరువు తెచ్చుకొని బ్రతకటం). ఏమిటీ ఘోరం?

నీతితో (ఒక నియమం ప్రకారం) శ్రీవేంకటేశ్వరుని సేవచేస్తూ బ్రతికినా... కొన్నాళ్ళకు విధి ప్రేరితమై సంసార తాపత్రయంలో పడతారు (ఆచార్యులవారికే ఆ బాధ తప్పలేదు... మనమెంతటివాళ్ళం చెప్పండి). ఆ హరిసేవ, సంసారసుఖమంత ఇతవు (హితవు) అంటే హితకరముగానుండదు. ఆ శ్రీహరి సేవకు చేతుల్ని వాడెదము కాని ముఖ్యమైన చిత్తాన్ని మాత్రం సంసారంవైపే మరల్చివుంచుతామే... ఏమిటీ మాయ?

సంపుటి : 2 కీర్తన : చెల్లబో తియ్యనినోర జే దేటికి యీ
సంఖ్య : 59 పుట : 40 రాగం : సామంతం

### సామంతం

29. చెల్లఁబో తియ్యనినోరఁ జేఁ దేఁటికి యీ-
పల్లదపుఁగోరికలపాలు సేయవలెనా ॥పల్లవి॥

ఆసలకు నాదేహ మమ్ముకొంటి వింటింట
దాసునిఁగా నాపాలిదైవమా నీవు
పోసరించి భూమిలోనఁ బుట్టించి రక్షించి
యీసులేక భంగపెట్టు టిది గొంత వలెనా ॥చెల్లఁ॥

పామరపుటింద్రియాలబారిఁ దోసితివి నన్ను
దామెనకట్టుగాఁ గట్టి తత్వమా నీవు
దోమటి నామతిలోనఁ దోడునీడవై యుండి
పామేటిసుఖములనే భ్రమయించవలెనా ॥చెల్లఁ॥

గక్కన నింతట నన్నుఁ గరుణించితివి నేఁడు
మొక్కితి శ్రీవేంకటాద్రిమూలమా నీకు
దిక్కుదెసవై నాకు దేవుఁడవై యేలికవు
చొక్కి నామన సింత సోదించవలెనా ॥చెల్లఁ॥ 59

**అవతారిక :**

ఈ కీర్తనలోని కొన్ని మాటలు నేటి తెలుగులో వాడుకలో లేవు. వాటికి అన్నమాచార్యులవారి భావం అంత సులభగ్రాహ్యం కాదు. 'దోమటి నామదిలోన తోడు నీవై యుండి...” అనే వాక్యంలో దోమటి అంటే దోషభూయిష్టమైన అనే భావనలో వుపయోగించారు. “పల్లదపు కోరికలకు” తిన్నని అర్థం చెప్పటం కూడా కష్టమే. “చెల్లబో” అనేది సంతోషాన్ని వ్యక్తం చేసే అన్యయపదము. నేటి కాలంలో





“సరిపోయిందిపో” అని సంతోషంతో అంటున్నాం. ఈ రోజుల్లో ఈ పల్లవికి రమారమి ఇలా అర్థం చెప్పుకోవచ్చు. “సరిపోయిందిపో! తీపిని కోరుకునే నోటిలో చేదు యెందుకు పెడతారయ్యా! బ్రతుకును, పల్లదపు (వ్యర్థమైన) కోరికల పాలు చేయతగునా”? అంటున్నారు.

**భావవివరణ :**

చెల్లబో! (సరిపోయింది పో!) తియ్యటి నోటిలో చేదు యెందుకు పెడతారయ్యా! మన బ్రతుకును ఈ పల్లదపు కోరికల పాలు (వ్యర్థమైన వాంఛలపరం) చేయతగునా?

ఆసలకున్ ఆ దేహము అమ్ముకొంటివి (ఆ యొక్క దేహం ఆశలకు అమ్ముడు పోయింది). ఇంటింటా దాసునిగా బ్రతికాను. నా పాలిదైవమా! నీవు భూమిపై నన్ను నీదాసునిగా పుట్టించి రక్షించావు. ఈసులేక (ఈర్ష్యకులోనుగాక) నన్ను కాపాడాలి. కానీ ఇట్లా భంగపెట్టుట ఇది కొంత (ఇది చిన్నతనము). ప్రభూ! ఇది వలెనా? (తగిన పనియేయా)

నీవు చేసిన పని యేమిటో చూశావా స్వామీ! నన్ను పామరపు ఇంద్రియాల (అజ్ఞానపు భోగేంద్రియాల) పాలు జేశావు. ముడిమీద ముడివేసి కట్టిపడేసి, తత్త్వ చింతన లేకుండా చేశావు. దోషభూయిష్టమైన నా మనస్సులో తోడు నీడవైయుండి కాపాడక నన్ను, పామేటి సుఖముల (వశపరచుకొను ఇంద్రియ భోగముల) పాలు చేశాను. అట్లా భ్రమయింపజేయ తగునా? ప్రభూ!

ఈ వ్యవహారం ఇట్లా నడుస్తూ... ఈ జన్మల చక్రబంధములో నేను ముప్పు తిప్పలు పడుతుంటే ఒకరోజు నీకే నాపై జాలి కలిగింది. నన్ను గక్కున (వెంటనే) కరుణించావు. శ్రీ వేంకటాద్రి మూలాధారమైన ఓ శ్రీవేంకటేశ్వరా! నేను భక్తితో నీకు మ్రొక్కితిని తండ్రీ! నీవు నాకు దిక్కుదెస (నిర్దేశనము) అయ్యావు. నా దైవమై నన్ను పరిపాలించావు. అటువంటప్పుడు నా మనస్సును ఇంతగా చొక్కి సోధించవలెనా? (ఇంతచేటు పరీక్షించవలెనా) ప్రభూ!

సంపుటి : 2 కీర్తన : ఏమిసేసేమిక నేము యెంతని దాచుకొందుము

సంఖ్య : 51 పుట : 35 రాగం : మలహరి

**మలహరి**

30. ఏమి సేసే మిఁక నేము యెంతని దాఁచుకొందుము
నీమహిమ యింతంతననేరము నేమయ్యా ॥పల్లవి॥

అంది నిన్ను నొకమాటు హరియని నుడిగితే
పొందినపాతకమెల్లాఁ బొలిసిపోయ
మందలించి మఱి యొకమాటు నుడిగినఫల -
మందె నీ కప్పగించితి మదిగోవయ్యా - ॥ఏమి॥

యిట్టె మీకు. రెండుచేతులెత్తొకమాటు మొక్కితే
గట్టిగా నిహపరాలు గలిగె మాకు
దట్టముగ సాష్టాంగదండము వెట్టినఫల -
మట్టె నీమీఁద నున్నది అదిగోవయ్యా ॥ఏమి॥

సరుగ నీకొకమాటు శరణన్నమాత్రమున
సిరులఁబుణ్యుఁడ నైతి శ్రీవేంకటేశ
ధరలోన నే నీకు దాసుఁడనైతి శ్రీవేంకటేశ
ధరలోన నే నీకు దాసుఁడనైనఫల -
మరయ నీమీఁద నున్న దదిగోవయ్యా ॥ఏమి॥ 51

**అవతారిక :**

వైరాగ్యానికి పునాది భక్తి. ఫలితం అధ్యాత్మచింతన. కారణం భగవత్కృప. దాదాపు అందరూ భోగంతో మొదలుపెట్టి, విరాగులై, యోగులై ముక్తి పొందినవారే. అన్నమాచార్యులవారి ఈ కీర్తన వారికి హరిపైగల పరిపూర్ణ భక్తిని మరీమరీ చాటుతోంది. నీమహిమ ఇంతటిది అనటానికి వీలులేదు. ఎంతని దాచిపెట్టగలం. ఎక్కడచూచినా నీ మహిమే. మేం మరేం





చేయగలమయ్యా... అంటున్నారు. నేను నీకు దాసుడను. అట్లా ఆయినదాని ఫలము నీమీదనున్నది అనగా నిన్ను మించి వున్నది, అంటున్నాడు. హరి కంటే హరిదాసులే అధికులనే దాసభక్తిని చాటుతున్నారు.

**భావవివరణ :**

ఇకన్, ఏము (మేము) యేమిసేసేము? నీమహిమ ఎంతని దాచుకొందుము. అయ్యా! అది ఇంతింత అన నేరము (ఇంతుంటుందని ఒక పరిమితిని చెప్పఏము, తండ్రీ!)

అంది (పూనుకొని), ఒక్కమాటు 'హరి' అని నుడిగితే (అంటే) కలిగిన పాపములన్నియు పొలసిపోయ (చచ్చిపోతాయి). అరె!! అని తెలివితెచ్చుకొని, ఇంకొకమాటు 'హరి' అంటే అంతా... మిగిలిపోయిన పుణ్యమే కదా! అదిగో అప్పుడు నేనేం చేశానంటే ఆ పుణ్యఫలం నీకే సమర్పించాను. ఇక నాకు విచారమెందుకయ్యా!

ఏదీ నీ గుడికి వచ్చాను కదా! అని ఒక్క మాటు నా రెండు చేతులూ ఎత్తి నీకు నమస్కరించాను. దాంతో మాకు ఇహపరాలు గలిగే (ఈ లోకంలో పొందవలసిన భోగాలన్నీ దక్కటమే కాకుండా, పరలోకంలో సుఖం పొందే అర్హత కూడా సంపాదించుకొన్నాను). సరే, ఇదేదో బాగుందని దట్టముగా (బాగా) నీకు సాష్టాంగ నమస్కారం చేశాను. అదిగో దాని ఫలితము నీమీద నున్నది (నిన్ను మించి పోయింది). అయ్యా! అదిగో ఇందులో నా గొప్పతనం యేమీలేదు.

ఓ శ్రీవేంకటేశ్వరా! నీకు ఒక్కమాటు, సరగున (వేగముగా) శరణు మహాప్రభో! అన్నాను. అంతమాత్రాన అన్ని వైభవాలతో పుణ్యాత్ముడనయ్యాను. మరి అటువంటప్పుడు నీ దాస్యమే జీవనోపాధిగానెంచుకొన్నవారు పొందే ఫలము యెంత గొప్పది? అయ్యా! అదిగో... అది అరయన్ (చూడగా), నీమీద నున్నది (నిన్ను మించిపోయింది ప్రభూ!)

సంపుటి : 2 కీర్తన : విభుడ వింతటికి వెరవుతో నను(గావు

సంఖ్య : 66 పుట : 45 రాగం : పాడి

## పాడి

31. విభుఁడ వింతటికి వెరవుతో ననుఁగావు
అభయాహ స్తముతోడి ఆదిమూలమా ॥పల్లవి॥

పలులంపటాలచేతఁ బాటువడి పాటువడి
అలసితిఁ గావవే వో ఆదిమూలమా
చలమరి యితరసంసారభ్రాంతిఁ జిక్కితి న -
న్నలరించి కావవే వో ఆదిమూలమా ॥విభుఁ॥

యెంతకైనా నాసలచే యేఁగేఁగి వేసరితి -
నంత కోపఁ గావవే వో ఆదిమూలమా
సంతలచుట్టరికాల జడిసితి నిఁకఁ గావు
అంతరాత్మ నాపాలి) ఆదిమూలమా ॥విభుఁ॥

రంటదెప్పుటింద్రియాల రవ్వైతిఁ గావవే వో -
అంటిన శ్రీవేంకటాద్రి ఆదిమూలమా
గెంటక ముమ్మాటికిని నీకే శర-
ణంటిఁ గావవే వో ఆదిమూలమా ॥విభుఁ॥ 66

**అవతారిక :**

పరమాత్మ అన్నిటికి ఆదిమూలము అంటే "తల్లివేరు॥ చెట్టుకి తల్లివేరు ఎలాగో ఈ విశ్వానికి పరమాత్మ అటువంటివాడు. ఈ విశ్వానికంతటికీ ఆయన విభుడు. అంటే భర్త. అభయహస్తముతో నన్ను కాపాడుము ప్రభూ! అంటున్నారు అన్నమాచార్యులవారు. స్వామీ! నేను "రంటదెప్పుటింద్రియాల రవ్వైతిని. నన్ను కాపాడవయ్యా" అంటున్నారు. అంటే ఏమిటో తెలియాలంటే భావ వితరణ చదవక తప్పదు మరి. లంపటము - అంటే, దొంగతిండితినే గొడ్లకు మెడనుండి రెండు





కొయ్యలను వ్రేలాడకడతారు. పరుగెత్తి పారిపోకుండా అవి కాళ్ళకు అడ్డం తగలి గొడ్లను ఇబ్బంది పెడతాయి. అదే లంపటము. మనిషికి లంపటమేవటో వూహించండి.

**భావవితరణ :**

అన్నిటికీ ఆదిమూలము (రూట్ కాజ్) వైన ఓ పరమాత్మా! నీవు ఇంతటికీ (జగత్తునకు) ఆధారభూతుడవు. నెరవుతో (ఉపాయముతో) నన్ను కాపాడుము ప్రభూ! నీ అభయమును చూపు హస్తమును నాకందించి నన్ను రక్షించుము.

ఓ ఆదిమూలమా! అనేక లంపటాలతో (గుది కొయ్యలతో) ఇబ్బందులు పడీ పడీ బాగా అలసిపోయాను. నన్ను ఇకనైనా విముక్తుని చేసి రక్షించరాదా? నాకు చలమరి భ్రాంతులు (మత్సరమును పెంచు భ్రమలు) కలిగించు ఇతర సంసార తాపత్రయములలో చిక్కుపడిపోయాను. నన్ను సేదదీర్చి ఆదుకోరాదా? నీవు తప్ప నన్ను ఆదుకోగలవారెవ్వరు?

ఓ ఆదిమూలమా! ఆసలకై (నా ఆశలను తీర్చుకొనుట కొరకు) ఎంతైనా (ఎంత దూరమైనా) పోయిపోయి వేసరితి (విసిగిపోయాను). అంతకు ఓపన్ కావవే (అటుపైన ఓపికతో నన్ను కాపాడరాదా?) నాకున్న చుట్టరికాలు అన్నీ సంతలో చుట్టరికాలు. ఎదురుపడ్డప్పుడు కలుపుగోరుతనంగా పరామర్శించే వారేకాని, ఆపదలో ఆదుకొనేవాడొక్కడూ వుండడు. నా పాలిటి అంతరాత్ముడవైన ఓ ఆదిమూలమా! నన్ను అనుగ్రహించవయ్యా!

ఓ శ్రీవేంకటేశ్వరా! నేను రంటన్ తిప్పు ఇంద్రియాల రవ్వ యైతిని (రెండిటి యందు, సుడిగుండం వలె త్రిప్పే ఇంద్రియాలకు చూరచూర అయిపోయాను). అనగా... సుఖదుఃఖముల వంటి ద్వంద్వములు కలిగించు ఇంద్రియ లోలుడనయ్యాను. ముమ్మాటికి (మనో వాక్కు, కాయకర్మలు అనే మూడిటితోనూ నీకు శరణాగతుడనయ్యాను. ఓ ఆదిమూలమా! నన్ను గెంటక (తిరస్కరించక) కావవే (కాపాడరాదా తండ్రీ!)

సంపుటి : 2 కీర్తన : అన్నిటికి నొడయడవైన శ్రీపతివి నీవు

సంఖ్య : 64 పుట : 43 రాగం : శ్రీరాగం

## శ్రీరాగం

32. అన్నిటికి నొడయఁడవైన శ్రీపతివి నీవు
యెన్నరాదు మా బలఁగఁ మెంచుకో మా పౌఁజు ॥పల్లవి॥

జ్ఞానేంద్రియము లైదు శరీరిలోపల
ఆనక కర్మేంద్రియము లైదు
తానకపు కామక్రోధాలవర్గము లారు
యీ నెలవు పంచభూతా లెంచు మాపౌఁజు ॥అన్ని॥

తప్పనిగుణాలు మూఁడు తనువికారము లారు
అప్పటి మనోబుద్ధ్యహంకారాలు
వుప్పతిల్లువిషయము లుడివోని వొక అయిదు
యిప్పటి మించేకోపము యెంచుకో మాపౌఁజు ॥అన్ని॥

ఆఁకలి దప్పియును మానావమానములను
సోఁకినశీతోష్ణాలు సుఖదుఃఖాలు
మూఁకగమికాఁడ నేను మొక్కెద శ్రీవేంకటేశ
యేఁకటారఁ గడపేవా నెంచుకో మాపౌఁజు ॥అన్ని॥ 64

**అవతారిక :**

నేటికాలంలో మనవెంట ఎంతమంది 'గుండాలు' వుంటే మనం అంత గొప్పవాళ్ళమని గుర్తు. అవునా? అలాగే అన్నమాచార్యులవారి కాలంలో ఒక రాజుగారికి ఎంత పెద్ద సేన వుంటే అంత గొప్పవాడని ప్రసిద్ధి. ఓ శ్రీపతీ! మా పౌజు (మా బలగం) కూడా అంత తేలికగా లెక్కించలేము. కావాలంటే లెక్కపెట్టుకో అని ఒక ఏభైమంది లెక్కచెబుతున్నారు. వీటితో నేను మూకగమికాడను (చుట్టుముట్టి వెంటవచ్చే నాయకుడును). ఓ శ్రీవేంకటేశ్వరా! నీకు మాత్రం నేను మొక్కుతాను "ఏకటార గడపేవా నెంచుకో మాపౌజు" అని అంటున్నారు. అంటే ఏమిటో... ఆపౌజు వివరాలు





తెలయాలంటే... ఇంకో దారి లేదు. ఈ కీర్తనకు భావ వివరణ చదవాల్సిందే... తప్పదు. ఇంతకీ... ఒడయడవైన.... అంటే యేమిటో తెలుసునా మగడవైన లేక భర్తవైన అని అర్థం.

**బావవివరణ:**

ప్రభూ! శ్రీపతివైన నీవు అన్నిటికీ ఒడయడవైన (భర్తవైన) జగన్నాథుడవు. అయినప్పటికీ నేనూ తక్కువ వాడిని కాదు. మా బలగము (సేనను) యెంచరాదు (అంతతేలికగా లెక్కించలేము). కావాలంటే చెబుతాను, యెంచుకో (లెక్కించుకో) మా పౌజు (ఏన).

మాకు (నాకు) ఐదు జ్ఞానేంద్రియాలు (కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము), ఆనక (ఆ తరువాత) ఐదు కర్మేంద్రియాలు (కాళ్ళు, చేతులు మొ॥) తానకపు (స్థానం చేసికొనిన) ఆరుగురు మిత్రుల్లాంటి శత్రువులు (కామ, క్రోధ, మోహ, లోభ, మద, మత్సరములు), వీటన్నింటికీ నెలవైన స్థానమైన (భూమి, ఆకాశము వంటి) పంచభూతాలు వున్నాయి. ఈ లెక్క సరిపోయిందా?

ఇంకా విను... జీవులందరికి తప్పని సరైన మూడు గుణాలు (సత్త్వ, రజస్తమో గుణములు) నాకూ వున్నాయి. వాటితోపాటు శైశవ, బాల్య, యౌవన, కౌమార, వృద్ధాప్య, మరణావస్థలవంటి దశలలో వచ్చే ఆరు వికారాలు నాకూ వున్నాయి. ఎన్నడూ ఉడివోని (తొలగని) గ్రంథ పరిజ్ఞానంతో నేర్చిన ఆరు విషయములు, అప్పటి (మరల మరల వేధించే) మనస్సు, బుద్ధి, అహంకారం నాకూ వున్నాయి. ఇంకొకటుంది ... అది, ఇప్పటిమించే కోపం (అవకాశాన్ని మించే కోపము) కూడా వుంది.

ఇక మరొకమారు మాపౌజు లెక్కించుకో, స్వామీ! ఆకలి, దప్పిక, మానావమానాలు నాకూ వున్నాయి. ఇక సుఖదుఃఖాలు, కలిమిలేములు, శీతోష్ణాలు, ఇష్టాయిష్టాలు, మొదలైన ద్వంద్వముల గురించి చెప్పనే అక్కరలేదు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఏను (నేను) మూకగమికాడను (వెంట వెంట నా బలగాన్ని తిప్పుకొని నడిచేవాడను). ఇన్నాళ్ళు ఇలాగే బ్రతికాను. ఇప్పుడు బుద్ధి వచ్చింది. కావున, ఏకటారన్ (మిక్కిలి ఆపేక్షతో) కడపేవా (గడుపు తావా?) అని మాపౌజునెంచక నన్ను కనికరించు. నీకు మ్రొక్కెదను తండ్రీ!

సంపుటి : 2 కీర్తన : ఏమిసేతు దైవమాయెన్నడు గరుణించేవో
సంఖ్య : 105 పుట : 71 రాగం : భైరవి

**భైరవి**

33. ఏమిసేతు దైవమా యెన్నఁడు గరుణించేవో
దామెనసంసారములోఁ దట్టువడీ మనసు ॥పల్లవి॥

యెక్కడిపగయొకో ఇంద్రియాలు నన్నుఁబట్టి
చక్కు ముక్కు సేసి యెంచి సాదించీని
గుక్కక యేమిసేసినకొలయొకో వెంటవెంట
వెక్కసపు పుట్టువులై వెనుతగిలీని ॥ఏమి॥

యెన్నాళ్లపాపమొకో యెడతెగక నాలోన
వున్న తపుఁగోపమై వుమ్మగిలీని
తిన్ననై యెవ్వరిచేతితిట్టు దాఁకినవిధమో
విన్ననై విజ్ఞానమెల్లా వీటిఁబోయఁ దుదిని ॥ఏమి॥

యేవేళ గుణమో యెడతెగని కర్మాలు
రావిమానిజిగురై వూరక యంటీని
శ్రీ వేంకటేశుఁడ నీవు చిత్తములోపల నుండి
కావఁగఁగదా నీవే గతి యనవలసె ॥ఏమి॥ 105

**అవతారిక :**

సంసారము అంటే ఆలుబిడ్డలతోడియునికి అని అర్థం. భార్యాపిల్లలతో సుఖదుఃఖాలు అనుభవిస్తూ, మనుష్యుడు జీవనయానాన్ని కొనసాగించటమే సంసారమంటే. ఇది ఒక దామెన సంసారము (అనేకమైన బంధములు గల సంసారము). నామనస్సు ఇందులో తట్టువడీ (ఇరుక్కుపోయినది). ఓ దైవమా! ఏమిచేయగలను? దిక్కు తోచుట లేదు. నన్ను యెన్నడు కరుణిస్తావు తండ్రీ ! అని ఆక్రోశిస్తున్నారు అన్నమాచార్యులవారు. త్రిగుణాత్మకమైన కర్మలను అంతూపొంతూ లేక చేస్తుండటం వలన వాటి కర్మఫలం "రావిమాని జిగురై





వూరకే అంటీని" ... అంటున్నారు. అంటే యేమిటో తెలియాలంటే, భావవివరణ చదవక తప్పదు... మరి.

**భావవివరణ :**

ఓ దైవమా! నేనేమి సేతును (చేసెదను)? దామెన సంసారములో (అనేక బంధనములు గల సంసారములో) మనసు (నాయొక్క మనస్సు) తట్టువడీ (ఇరుక్కుపోయింది). బయటకు రాలేకపోతున్నాను. నన్ను కనికరించుము తండ్రీ!

ఎక్కడి పగయో కాని నా ఇంద్రియాలు నన్ను యెంచి బట్టి (యెంచిపట్టుకొని) నన్ను చక్కుముక్కుసేసి (చిందరవందజేసి) సాధించినవి. ఏమి చేసిన కొలయొకో (పగసాధింపో) కాని, వెంటవెంటనే గుక్కక (నన్ను గ్రుక్కతిప్పుకోనివ్వకుండా వెంటబడి తరిమి తరిమి) వెక్కసపు పుట్టువులై (దుస్సహమైన జన్మలై) వెనుతగలీని (వెంటతగులుకొన్నాయి). ప్రభూ! ఇప్పుడు నాగతి ఏమిటి?

స్వామీ! ఎన్నాళ్ళనుంచి నేను చేసికొనిన పాపమో కాని, నాలో అది అంతులేని కోపముగా, ఉమ్మగిలి (ఉడకబెట్టి) నాకు మనశ్శాంతి లేకుండా చేసింది. ఎవ్వరిచేత యెన్నడు తిట్టుదాకిన విధమో (శపించబడితినో కాని)... తుది (చివరికి) విశిష్టమైన ఆత్మజ్ఞానము, యెల్లా వీటుబోయెను (అంతా నష్టపోయింది).

ఓ దేవదేవా! ఏవేళ గుణమో (ఎప్పుడు ఏ గుణము ఆవహిస్తుందో కాని) త్రిగుణాత్మకమై (సత్వ రజ స్తమో గుణావసిష్ఠుడనై) అంతులేని కర్మలు చేస్తూనే వున్నాను. అవి రావిమాని జిగురై (రావి చెట్టునుండి కారే బంకవలె) నాకు అంటుకొని ఎన్నటికీ వదలటంలేదు. ఓ శ్రీవేంకటేశుడా! నీవు నా చిత్తములోపల తిష్టవేసికొని వుండి, కావగన్ (రక్షించుటకు).... నీవే గతియనవలసె కదా! (అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ... అని అనవలెను కదా!)

సంపుటి : 2 కీర్తన : చెల్లనెక్కికొంటివిగా జీవుడయీ బలుకోట

సంఖ్య : 84 పుట : 57 రాగం : కాంబోది

## కాంబోది

34. చెల్ల నెక్కికొంటివిగా జీవుఁడ యీబలుకోటా
బల్లిదుఁడ నీకు నేఁడు పట్టమాయఁ గోటా ॥పల్లవి॥

తొమ్మిదిగవనులైన దొడ్డతోలుఁగోటా
కొమ్మలచవుల మూలకొత్తళాలకోటా
వమ్ములేని మెడవంపువంకదారకోటా
పమ్మి పగవారినెల్లా పట్టుకొన్న కోటా ॥చెల్ల॥

తలవాకిలిదంతపుతలుపులకోటా
తలిరుఁజేతులపెద్దదంతెనాలకోటా
వెలియాసలనేదండువిడిసినకోటా
గులుగై యింద్రియములు కొల్లగొన్నకోటా ॥చెల్ల॥

నడచప్పరములనే నలువైనకోటా
జడిసినచెవుల మించుసవరణకోటా
పడనిపాట్లఁ బడి ఫలియించెఁ గోటా
యెడమిచ్చి శ్రీవేంకటేశుఁ డేలెఁ గోటా ॥చెల్ల॥ 84

**అవతారిక :**

చాలా తేలిక అనిపించే బహుక్లిష్టమైన అధ్యాత్మ కీర్తన చెబుతున్నారు అన్నమాచార్యులవారు. ఆనాటి చంద్రగిరి రాజుల కోటను స్ఫురణలో బెట్టుకొని చెప్పారేమో అనిపించింది నాకు. ఇందులో వాడిన చాలా మాటలు నేటికాలంలో వాడుకలో లేవు. ప్రతిచరణంలోనూ 'కోటా' అని పలికిన మాట సంగీతపరంగా వాడబడినదిగానే గుర్తించాలి. "చెల్లనెక్కికొంటివిగా"... అన్న పల్లవి అర్థంకావటానికే తలప్రాణం



అన్నమయ్య అధ్యాత్మ చింతన

తోకకివచ్చిన తోకరాయుణ్ణినేను. ఈ కీర్తన నెట్లా సాధించాలి? అన్నమయ్య అన్నట్లు యెడమిచ్చి శ్రీవేంకటేశుడేలితేగాని" దారిలేదు. ఓ దేవదేవా! నీవే దారి చూపించాలి తండ్రీ!

**భావవివరణ :**

ఓ జీవుడా! చెల్లన్ (బాగుగా) యెక్కి (అధిరోహించి) ఈ బలుకోటా (బలమైన కోటను) కొంటివిగా (నీ ఆధీనం చేసికొంటివి కదా!) బల్లెదుడా (వీరుడా!) నేడు నీకు ఈ కోట పట్టమాయెను (పట్టముగట్టబడినది).

ఈ కోట, తొమ్మిది గవనులైన (ద్వారములున్న) గొప్ప తోలుతో చేయబడిన కోట. ఈ కోటలో మూల మూలకూ క్రొత్తక్రొత్త వింతలున్నాయి. ఈ కోటలో నమ్మలేని (అభేద్యమైన) మెడవంపులవంటి వంకదార (రు)లున్నాయి. వంకరటింకరగా పోయే ఈ దారుల్లో దారితప్పటం "ఖాయం", పమ్మి (అతిశయించి) ఈ కోటలో పగవారు (కామ క్రోధాది శత్రువులు) పట్టుకొనబడియున్నారు.

ఈ కోట తల వాకిలి (ముఖద్వారము) లో దంతముతో చేయబడ్డ తలుపులున్నాయి. (32 పళ్ళు వున్న నోరు దీని ముఖద్వారం అని భావము). ఈ కోట పెద్ద దూలములతోను తలరు (ఆశ్చర్యకరమైన) చేతులతోను (కదిలే భాగములతోనూ) విలసిల్లుచున్నది. ఈ కోటలో వెల్లివిరిసిన ఆశలు అనే దండు (సైన్యము) విడిసియున్నది (స్థావరం చేసికొనబడియున్నది. ఈ కోటను గులుగైన ఇంద్రియాలు (లోపలలోపలనే చెడగొట్టు ఇంద్రియములు) కొల్లగొట్టేశాయి.

ఈ కోటకు పెద్ద గుడారముల వంటి చప్పరములను (తొడుగులను) తొడుగుతారు. ఈ కోటలో రకరకములైన సవరణలు (పరికరములు) అమర్చబడియున్నవి. పడరాని శ్రమలు పడితేగాని ఈ కోటను స్వాధీనపరుచుకోలేము. ఎడమిచ్చి (అవకాశము కల్పించి) శ్రీవేంకటేశ్వరుడు యేలే (పరిపాలించే) కోటయే మన దేహము. ఆయన దయలేకపోతే ఎన్ని హంగులున్నా ఇది చిటికెలో ఛిద్రమైపోతుంది సుమా!

సంపుటి : 2 కీర్తన : హరి భక్తి వోడయెక్కినట్టివారలేకాని
సంఖ్య : 56 పుట : 38 రాగం : గుండక్రియ

## గుండక్రియ

35\. హరిభక్తివోడ యెక్కినట్టివారలే కాని
తరఁగు మొరఁగులను దాఁటలే రెవ్వరును ॥పల్లవి॥

నిండుఁజింతాజలధికి నీళ్లు దనచిత్తమే
దండిపుణ్యపాపాలే దరులు
కొండలవంటి కరళ్లు కోరికె లెందు చూచినా
తండుముండుపడేవారే దాఁటలే రెవ్వరును ॥హరి॥

ఆపదలు సంపదలు అందులోని మకరాలు
కాఁపురపులంపటాలే కై యొత్తులు
చాపలపుగుణములే సరిఁజొచ్చేయేరులు
దాపుదండ చేకొని దాఁటలే రెవ్వరును ॥హరి॥

నెలవై వుబ్బుసగ్గులే నిచ్చలుఁ బోటునుఁ బాటు
బలువైనయాశే బడబాగ్ని
యెలమి శ్రీ వేంకటేశుహితులకే కాల్నడ
తలఁచి యితరులెల్ల దాఁటలే రెవ్వరును ॥హరి॥ 56

**అవతారిక :**

సంసారసాగరాన్ని దాటాలంటే ఒక 'నావ' కావాలి కదా! ఏమిటా ఓడ 'నావ'? ఆ సంసారసాగరం యెటువంటిది? ఎటువంటివారు ఆ నావనెక్కగలరు? అన్నమాచార్యులవారు వివరిస్తున్నారు. ఈ సంసార సాగరంలో మొసళ్ళుకూడా ఉన్నాయట. నెలవై వుబ్బుసగ్గులే నిచ్చలు బోటును బాటు – అంటే ఏమిటో అంత తేలికగా తెలుస్తుందా? శ్రీ వేంకటేశ్వరుని హితులకే ఇది కాల్నడ అంటున్నారు. ఇతరులెవ్వరూ యెంత తలచినా దాటలేరట. అచ్చతెలుగు ఈనాటి వారికి కొరుకుడుపడని మాట నిజమే కాని, చక్కటి భావగరిమ వున్న కీర్తన ఇది. 'తరఁగు





మొరఁగు' అనే మాట బహుశాత 'తఱుగు మెఱుగు' అయివుండవచ్చును. ఆ మాటకు జరామరణములు అని అర్థం చెప్పుకోవచ్చును. అన్నమయ్య ఆంతర్యం అంతుచిక్కదు.

**భావవివరణ :**

ఓ మానవులారా! శ్రీహరి భక్తి, ఈ సంసార సాగరం దాటింపజేయగల ఒకే ఒక 'ఓడ' (నావ). దీనిని యెక్కినవారు మాత్రమే ఈ సంసార జలధిని దాటగలరు. కాని.... జీవికి సహజమైన తరగుమొరగులను (జరామరణములను) అన్యులెవ్వరూ దాటలేరు. (అంటే... హరి భక్తులకు జరా మరణాలు వుండవని కాదు, వాటి భయం వుండదు... అని అర్థం).

మనని పుట్టుకతోనే సంసారజలధిలో పడవేశాడు ఆయన. ఈ సంసార చింతా జలధికి, నిండావున్న నీళ్ళు యేమిటో తెలుసునా? మానవుడి చిత్తమే (మనస్సే). దీనికి 'తరులు' పాపపుణ్యాలు (ఒక ఒడ్డు పుణ్యం... ఒక ఒడ్డు పాపం). కొండల వలె ఎత్తైన "కర(డ)ళ్ళు" (అలలు) ఏమిటో తెలుసా ఈ మానవుడి కోరికలు. ఈ సంసారజలధిలో ఎక్కడ చూచినా అలలే. అందరూ ఇందులో తండుముండు పడేవారే (తొట్రుపడే వారే). ఎవ్వరూ దాటలేరు.

ఈ సంసారసాగరంలో భయంకరమైన మకరాలు (మొసళ్ళు) వున్నాయి. అవే క్షణక్షణం మరణహేతువైన 'ఆపదలు'. అవికాకుండా ప్రాణానికే ముప్పు తెచ్చే సంపదలు. స్త్రీ చేతిలో కలిగించబడిన 'యొత్తులే' మానవుడికి కాపురపులంపటాలు (సంసార లంపటం) కలిగించి వేధిస్తాయి. ఆ కాపురంలో చాపల్యం కలిగించే గుణములు వుంటాయి కదా! అవి మంచిని మరపించే తలనొప్పిగా పరిణమిస్తాయి.

ఈ సంసారసాగరంలో వున్న 'ఉబ్బుసగ్గులు' (హెచ్చుతగ్గులు) నిచ్చలు (రోజూవుండే) ఆటుపోట్లు తప్పనిసరి. తెలియకుండానే ఒకేసారి ఈ సముద్రంలో పెల్లుబికే బడబాగ్ని ఏమిటో తెలుసునా? బలమైన ఆశలు. అయితే ఇంత గొప్ప సంసారజలధి కూడ, శ్రీ వేంకటేశుని హితులకు మాత్రం ఒక చిన్న కాల్నడ, (ఉచ్చుగుంట). వారు దాన్ని దుమికి దాటగలరు. మరింకెవ్వరూ ఎంత తలచినా... దాటనే లేరు.

సంపుటి : 2 కీర్తన : అన్నిటా శ్రీహరిదాసుడగువానికి

సంఖ్య : 68 పుట : 46 రాగం : రామక్రియ

**రామక్రియ**

36. అన్నిటా శ్రీహరిదాసుఁడగువానికి
కొన్ని దైవములఁ గొలువఁగఁ దగునా ॥పల్లవి॥

విహితకర్మముసేసి వెదకేటి హరి నిట్టె
సహజమై కొలచేటిసరసునికి
గహనపుఁగర్మాలు కడమలైన నేమి
మహిఁ గనకాద్రికి మరి పైఁడి వలెనా ॥అన్ని॥

పలుదానములకెల్ల బలమైనహరి నిట్టె
బలువుగఁ జేకొన్న భక్తునికిని
నెలకొని యాతఁడన్నియునుఁ జేసినవాఁడె
తెలిసి సూర్యునిఁ జూడ దీపాలు వలెనా ॥అన్ని॥

వేదవేద్యుఁడు శ్రీవేంకటపతినామ-
మాదిగాఁ బఠియించే యధికునికి
ఆదైనచదువులు అఱచేతి వతనికి
మేదినిఁ దిరుగాడ మెట్లు వలెనా ॥అన్ని॥ 68

**అవతారిక :**

అన్నమాచార్యులవారి నాటి తెలుగు నుడికారం నేటి భాషతో పోలిస్తే వ్యత్యాసం కనబడుతుంది. "కొన్ని దైవముల గొల్వనేల" అంటే కొందరు దేవతలను కొలుచుటెందుకు అని. "వేవేదద్యుడు శ్రీ వేంకటపతి" అని ఆనాటి రాగిరేకులో వ్రాసివుంది. పెద్దలు దాన్ని 'వేదవేద్యుడు' అని పరిష్కరించారు. ఆ విధంగా, పెద్దలు పరిష్కరించకపోతే బహుశా నేటి తరం వారు ఏమీ అర్థంకాక వాటిదారిన వాటిని వదలివేసేవారేమో! ఈ కీర్తనలో అన్నమయ్య ప్రతిభ ప్రతి చరణంలోనూ ప్రస్ఫుటమవుతుంటుంది. చదువరి ఆనందంతో పులకించిపోతాడు.





**భావ వివరణ :**

అన్నిటా (మనోవాక్ కర్మలలో) శ్రీహరిని దాస్య భక్తితో సేవించే వానికి, కొన్ని దైవముల (కొందరు ఇతర దేవతలను) కొలుచుట యెందులకు? అది తగదు.

వేదోక్తమైన విహిత కర్మలు చేయుట శ్రీహరిని వెదకి (శోధించి) కనుగొనవలెను. కాని సహజముగ (స్వభావ సిద్ధముగానే) హరియే తన సర్వస్వమని కొలిచేటి సరసునికి (ఆనంద సిద్ధి పొందినవానికి).... గహనపు కర్మాలు (అడవిదారివలె అయోమయం కలిగించే కర్మలు).... కడమలైననేమి (కొఱత అయితే మాత్రం ఏమి నష్టం?) ఈ భువిలో కనకాద్రికి (బంగారంతో మెరిసే మేరు పర్వతానికి ఇంకొంచెం బంగారం చేరిస్తే తేడా ఏమి వస్తుంది?

అన్ని దానములకన్న శ్రీహరి భక్తి బలమైనది. ఆయన జగన్నాథుడు కావున ఏదానమైనా ఆయన ఇవ్వవలసినదే. ఆయననే బలంగా చేకొన్న హరిభక్తునికి అన్ని దానముల ఫలమూ సిద్ధిస్తుంది. అతడు అన్ని దానములను చేసినవాడే అగుచున్నాడు. సూర్యుణ్ణి చూడటానికి ఎవడన్నా పగటి వేళ దీపము వెలిగిస్తాడా? అట్లాంటి వెఱ్ఱినేమని అంటాము?

శ్రీ వేంకటేశ్వరుడు వేదవేద్యుడు (వేదము ద్వారా ప్రకటింపబడినవాడు). ఆదిగా (నిద్రలేస్తూనే) ఆ నామం పఠించేవాడు (సహజంగానే పలికేవాడు) సర్వాధికుడు. అతనికి ఆదైన చదువులు (మొదలుపెట్టిన చదువులన్నీ) అఱచేతివి (కరతలామలకములు). ఏదన్నా మేడనెక్కాలంటే మెట్లు కావాలి కాని మేదిని దిరుగాడు వానికి (తేలికగా నేలమీద నడిచేవానికి) ఆ మెట్లు యెందుకు?

సంపుటి : 2 కీర్తన : ఇతరుల దూరనేల యెవ్వరూ నేమిసేతురు

సంఖ్య : 174 పుట : 117 రాగం : వరాళి

**వరాళి**

37. ఇతరుల దూరనేల యెవ్వరూ నేమిసేతురు
మతి వారూఁ దమవంటిమనుజులేకాక ॥పల్లవి॥

చేరి మేలుసేయఁ గీడుసేయ నెవ్వరు గర్తలు
ధారుణిలో నరులకు దైవమేకాక
సారెఁ దనవెంటవెంటఁ జనుదెంచేవారెవ్వరు
బోరునఁ జేసినపాపపుణ్యాలేకాక ॥ఇత॥

తొడఁగి పొగడించాను దూషించా ముఖ్యులెవ్వరు
గుడిగొన్న తనలోనిగుణాలేకాక
కడుఁగీర్తినపకీర్తి గట్టెడివా రెవ్వరు
నడచేటి తనవర్తనములే కాక ॥ఇత॥
ఘనబంధమోక్షాలకుఁ గారణ మిఁక నెవ్వరు
ననడిచిన జ్ఞానాజ్ఞానములే కాక
తనకు ఎ వేంకటేశుఁ దలపించేవారెవ్వరు
కొనమొద లెఱిఁగిన గురుఁడేకాక ॥ఇత॥ 174

**అవతారిక :**

చక్కటి జ్ఞాన ప్రబోధన చేస్తున్నారు అన్నమాచార్యులవారు. ప్రపంచంలో మానవులు పరులకు మేళ్ళూ కీళ్లూ చేస్తూనే వుంటారు. ఇకరిని పొగడుతుంటారు ఇంకొకరిని తిడుతుంటారు. దీనివలన ఒకరినొకరు తిట్టుకొంటారు కొట్టుకొంటారు. ఆ పరాయి మనుష్యులు కూడా తమబోటివారే కదా! మదిలో వారు కూడా తమవలెనే కామకోధాది అరిషడ్వర్గపీడితులు. ఈ భాగ్యానికి ఇతరులను నిందించుట తగునా? ఎవ్వరు మాత్రం ఏమి చేయగలరు? అంటున్నారు. మరి దారేమిటి?





**భావ వివరణ :**

ఇతరులను నిందించుట అతి తేలికపని. కాని ఆ విధంగా పరులను దూరనేల (నిందించుటెందుకు)? మతి (మనస్సు విషయంలో) వారూ... తమవంటి మనుష్యులే కదా! దీనికి యెవ్వరునూ, యేమి సేతురు (చేస్తారు)?

ధారుణిలో (భూమిమీద) నరులకు మేళ్ళూ, కీళ్ళూ (ఉపకారములు, అపకారములు) చేయుటకు కర్తలు యెవ్వరు? దైవమేకాక (దేవుడు తప్ప) ఇంకొకరు కర్తలా? మనిషి చనిపోయాక వాడి వెంట ఎవరు వస్తారు? బోరున (గొప్పగా) సారెన్ (ప్రతిసారీ) వాడు చేసిన పాపపుణ్యాలు గాక ఇంకేమన్నా వాడి వెంట వస్తాయా? రానేరావు.

ఈ మానవుడు కొందరిని పొగడుతుంటాడు, కొందరిని దూషిస్తుంటాడు. తొడగి (ప్రారంభించి) ఈ రెండు పనులూ చేయించే ఆ ముఖ్యమైన వారెవరు? వాడిలో గుడిగొన్న (అతిశయించిన) గుణములే (సత్త్వ రజ స్తమో గుణములే) కదా! ఈ మానవుడికి గొప్పకీర్తి, అపకీర్తి ... రెండూ కలుగుతుంటాయి. వాడికి ఆ రెండూ అంటగట్టే వారెవరు? నడచేటి, వాడినడత మరియు ప్రవర్తనలే కదా!

ఇక, ఈ మానవుడు సంసార బంధాలలో చిక్కినా, మోక్షము సిద్ధింపచేసికొనినా కారణమెవ్వరు? ననిచిన (చిగురించిన) జ్ఞానము, అజ్ఞానమే వాటికి కారణం. అవి కాక ఇంకేమీ కారణం కావు. ఇదిట్లుండగా అంతటికీ కారణభూతుడైన ఆ శ్రీ వేంకటేశ్వరుని తలపించే (స్ఫురింపజేసే) వారెవ్వరు? ఈ జ్ఞానామృతానికి, కొన మొదలు (అంతము – ఆది) రెండూ తెలిసిన గురుదేవులే కదా! ఇంకెవరు ఆ దేవదేవుని అందించగలరు?

సంపుటి : 2 కీర్తన : ఏమి నెఱగనివాడు యిటు నిన్ను గొలిచేనా
సంఖ్య : 135 పుట : 91 రాగం : మాళవిగౌళ

**మాళవిగౌళ**

38. ఏమీ నెఱఁగనినాఁడు యిటు నిన్నుఁ గొలిచేనా
నీమాయ దెలుపఁగా నిను ననేఁగాకా ॥పల్లవి॥

పసురముగఁ జేసితే బడి నిన్నుఁ దలఁచేనా
వెస రాయిఁజేసితే వెదకి నిన్నెఱిఁగేనా
పొసఁగ మానుగ నన్నుఁ బుట్టించితేఁ బొగడేనా
ముసిపి నరుఁడజేయఁగా మొరయిడేఁగాక ॥ఏమీ॥

మొగి మృగముఁ జేసితే మొక్కనెఱిఁగేనా
తగఁ బక్షిఁ జేసితేఁ దరిఁ బూజసేసేనా
జిగి నితరజంతువుగఁ జేసితేఁ దగిలేనా
అగపడి వివేకిఁ జేయుఁగ ననేఁగాక ॥ఏమీ॥

యింత కథకారిఁ జేసి యీప్రపంచజ్ఞాన -
మింత యొసఁగితివి మరఁ గిఁకనేలా
చింత లిన్నియుఁ దీర శ్రీవేంకటేశ నను
సంతతము నేలఁగా శరణనేఁగాక ॥ఏమీ॥ 135

**అవతారిక :**

అన్నమాచార్యుల కాలంనాటి తెలుగులో కొంత నుడికార వ్యుత్యాయసం వలన ఈ కీర్తనకి భావవివరణ కావలసి వచ్చింది. లేకపోతే బహు సరళమైన కీర్తన ఇది. ఓ దేవదేవా! నన్ను కరుణించి నీమాయ నాకు తెలిపినావు. అట్లా చేయకపోతే... ఇటు నిన్ను గొలిచే వాడినా? ఏమీ ఎఱగనినాడు కేవలం అజ్ఞానాంధకారంలో పడి మగ్గిన ప్రాణిని. నేడు ఇంత అధికారిని జేసి, ఈ ప్రపంచజ్ఞానం ఇంత ఇచ్చి మరగు (దాగుడుమూతలు) ఇకనేల? అంటున్నారు. నీవు జగదీశ్వరుడివి. నన్ను





పశువుగా పుట్టించినా, పక్షిగా పుట్టించినా, అడవిలో చెట్టుగా పుట్టించినా, జంతువుగా పుట్టించినా నిన్ను కాదనేవాడెవడు? నిన్ను శరణాగతి బొందగల జ్ఞానమున్న ఈ మానవజన్మనిచ్చావు, నీకు సదా కృతజ్ఞుడను.

**భావ వివరణ :**

ఓ తిరుమలేశా! ఏమీ ఎఱగని నాడు (అజ్ఞానాంధకారములో వున్ననాడు)... ఇటు నిన్ను కొలిచే వాడినా? నీమాయ తెలుపుట వలన కాకపోతే ఇది (నేను నిన్ను శరణుజొచ్చుటు) జరిగే పనియేనా? అసాధ్యం ప్రభూ!

నన్ను పసురముగ (పశువుగా) పుట్టించితే, బడి (క్రమముగా) నిన్ను తలచేవాడినా? వెస (శ్రీఘ్రముగా) నునన ఒక రాయిని చేస్తే... వెదకి నిన్ను ఎఱిగేవాడినా? పోనీ నన్ను నీకు అనుకూలముగా... ఒక చెట్టులాగా పుట్టిస్తే నిన్ను ఇట్లా కీర్తించగలిగేవాడినా? ముసిపి (అజ్ఞానాంధకారం తొలగించి) నరుని జేయుట చేత ఇట్లా నీమాయ తెలిసింది... ఇట్లా మొరబెట్టు కొంటున్నాను. లేకపోతే ఇది జరిగేదా?

మొగి (నీవు పూనుకొని) నన్ను ఒక మృగముగా చేస్తే... నీకు నమస్కరించగలిగేవాడినా? తగన్ (నా కర్మానుసారముగా) ఒక పక్షిగా పుట్టిస్తే నిన్ను సమీపించి పూజించేవాడినా? ఇతరములైన ఏ జంతువును చేసినా నిన్ను తగిలేనా (అనుసరించేవాడినా?) నాకు అగపడి (ప్రత్యక్షమై) వివేకవంతుని జేయుటవలన గాక నీ దాసుడనయ్యేవాడినా?

ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంతకు నన్ను అధికారిని జేసి ఇంత ప్రపంజ్ఞానము నాకు ఇచ్చావు. మరగికనేలా (ఇంకా నాకు అపరిచితుడుగా నుండి పోవుట యెందులకు?) నాకున్న చింతలన్నియు దీరినవి. సంతతము (ఎల్లవేళలా) ఎలగా (నన్ను పరిపాలించుటకు) శరణని అన్నాను. అనేగాక (అట్లా కాకపోతే) నీమాయ దెలియుట సాధ్యమా?

సంపుటి : 2 కీర్తన : మాపులేమరణములు రేపులే పుట్టువులు
సంఖ్య : 157 పుట : 105 రాగం : దేశాక్షి

**దేశాక్షి**

39. మాపులే మరణములు రేపులే పుట్టువులు
చాపలాలు మాని విష్ణు శరణను మనసా ॥పల్లవి॥

చాలునంటే ఇంచుకంతే చాలును జన్మమునకు
చాలకున్న లోకమెల్లఁజాలదు
వీలినయీయాసా వెట్టివానిచేతిరాయి
చాలు నింక హరి నిట్టె శరణను జీవుఁడా ॥మాపు॥

పాఱకున్న పశుబాలై బడలదు మనసు
పాఱితే జవ్వనమునఁ బట్టరాదు
మీఱిన నీరుకొద్దిదామెర యింతె యెంచి చూడ
జాఱవిడిచి దేవుని శరణను జీవుఁడా ॥మాపు॥

సేయకున్నఁ గర్మము శ్రీపతిసేవనే వుండు
సేయఁబోతేఁ గాలమెల్లా సేనాసేన
వోయయ్య యిది యెల్లా వుమినాఁకే చవుతాలు
చాయల శ్రీవేంకటేశు శరణను జీవుఁడా ॥మాపు॥ 157

**అవతారిక :**

ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు వాడిన ఆనాటి తెలుగు భాషవల్ల కొంత, రాగిరేకులపై వ్రాసినవారి పొరబాట్లవల్ల కొంత, శ మరియు స అనే అక్షరాలు యధేచ్ఛగా తారుమారగుటవలన కొంత.... అతి సులువైన ఈ కీర్తన, అర్థంకాని పరిస్థితిని సంతరించుకొన్నది. 'వెట్టివానిచేతిరాయి' అనే మాటలు వెట్టివాని చేతిరాయిగా వ్రాయబడింది. 'పసిబాలై' అనేమాట 'పశుబాలై'గా చెక్కబడింది. 'వుమినాకే చవుతాలు' అంటే ఉమ్మినాకే చవితెలియునని భావించాలి. అంటే ఏమిటో తెలియాలంటే భావవివరణ చదవక తప్పదు. కాలమెల్ల 'శేనాశాన' అని రాగిరేకులో వున్నది. అది 'సేనాసేన' కావచ్చును. అంటే ఏమిటి?





**భావవివరణ:**

ఓ మనసా! ఈ ప్రపంచంలో చావుపుట్టుకలు జీవికి తప్పవు. మాపులే (సాయంకాలములే) ఆజీవి మరణములు. రేపులే (మరునాటి ఉషోదయములే) పుట్టుకలు (తిరిగి జన్మించుటలు) – రేయింబవళ్ళెలా తప్పవో, చావుపుట్టుకలూ జీవికి తప్పవు. చాపలాలు (చంచల స్వభావములను) మాని (వదలి) విష్ణుశరణమునందుకొనుము.

మానవ జన్మమునకు తృప్తి వుండితీరాలి. చాలును అంటే ఇకవద్దు, నాకున్నది చాలు అనిపించాలి. లేకపోతే... వాడికి ఈ లోకమంతా నీదే అని ఇచ్చినా చాలదు. వీలిన (అనుకూలముకాని) ఈ ఆశ మానవునికి అపకారి. ఎందుకంటే... అది పిచ్చివాడి చేతిలోని రాయివంటిది. వాడు దాన్ని ఎవరిపై విసురుతాడో ఎవరికి తెలుసు? వెట్టివాడి చేతిలోని రాయి ఎవరికి తగులుతుందో? అందువలన ఆశను వదలిపెట్టి శ్రీహరిని శరణు వేడుకో. ఓ జీవుడా అదే నీకు మేలు.

మనస్సు ఎటువంటిదంటే... అది పాఱక వున్న (పరుగెత్తలేని) పసిపాపవలె వున్నంతవరకు బడలదు (అలసిపోదు). కాని యౌవనం రాగానే అది పాఱితే (పరుగులు తీస్తే) దానిని పట్టరాదు (పట్టుకోవటం అసాధ్యం). ఎంచి చూస్తే, మీఱిన నీరుకొద్ది (అధికమైన నీరునుబట్టి) దామెర (ఆపద కలిగించె ఊపిరాడని చావు వుంటుంది కదా!) అందుకని ఓ జీవుడా! అన్నీ జాఱవిడిచి ఆ దేవదేవుని శరణు అని వేడుకో.

ఓ జీవుడా! నీవు కర్మము సేయకున్న (కోరికతో ఏ కర్మలూ చేయకుంటే) శ్రీపతి సేవలోనే వుంటావు. ఒకవేళ అలాకాక కర్మలు సేయబోతే నీ కాలమంతా సేనాసేన (జోహారు... జోహారు) అనగా నీవు కర్మలు చేస్తున్నంతకాలం, వహ్వా! వహ్వా! అని పొగడ్తలే వస్తూ వుంటాయి. ఓ అయ్యా! వేంకయ్యా! ఇది యెల్లా (ఇదంతా) వుమినాకే చవుతాలు (ఉమ్మివేసి పారవేస్తేకాని, నీ కరుణామృతం యొక్క రుచి తెలియదు). ఓ జీవుడా! శ్రీవేంకటేశ్వరుని చాయల (నీడలో) శరణు తండ్రీ! అనవయ్యా!

సంపుటి : 2 కీర్తన : దైవమా నీవేమమ్ము దయదలచుటగాక

సంఖ్య : 158 పుట : 106 రాగం : ధన్నాసి

**ధన్నాసి**

40. దైవమా నీవే మమ్ము దయదలcచుటగాక
చేవల నీసేcతలెల్ల చెల్లును లోకానను ॥పల్లవి॥

తీపునంజేవేళ నట్టె తేటcబులు సింపౌను
పై పైc బుణ్యమయితేc బాప మింపౌను
వోపి జంతువుల కివి వొకటొకటికి లంకె
చేపట్టి పాపము లెట్టు సేయకుండవచ్చును ॥దైవ॥

కడుcజలువై తేను గక్కన వేcడింపౌను
చెడనివిరతివేళ సిరు లింపౌను
వొడలు మోచినవారి కొకటొకటికి లంకె
తొడరుభోగాలు మాని తోయ నెట్టువచ్చును ॥దైవ॥

యినియు నీమాయే యిన్నియు నీయాజ్ఞలే
జవళిc బ్రాణులకెల్ల సమ్మతైనవి
యివల శ్రీవేంకటేశ యిటు నీకే శరణంటి
తవిలి నీవే గతి దాcగ నెట్టువచ్చును ॥దైవ॥ 158

**అవతారిక :**

అన్నమాచార్యులవారి కీర్తనలో పల్లవిని, సాధించటం బహుక్లిష్టమైన ప్రక్రియ. 'చేవల' అంటే 'వశపరచుకోగల' అని భావించవచ్చును. ఓ దేవా! నీవేమి చేసినా చెల్లుతుంది. మేము నీ ఆజ్ఞాబద్ధులము. నీవే మమ్మల్ని కరుణించాలి కానీ మేము చెయ్యగలగిందేమీ లేదు - అని దీని అర్థం. మానవుడికి విపరీతమైన చిత్త చాంచల్యం పెట్టావు. ఒక పని చేస్తూనే దానికి విరుద్ధంగా ఆలోచన చేస్తాడు. పుణ్యకార్యాలు చేస్తూనే పాపకార్యాలు ఇష్టపడతాడు. విరక్తిని పొందుతూనే సిరులు గడించాలని ఆలోచిస్తాడు. ఈ వైరుధ్యంవల్లనే అనేక పాపాలు చేస్తాడు. భోగలాలసుడవుతాడు.





నీమాయావర్తనుడైన ఈ నీ అధీనుల్ని నీవుకాక ఇంకెవరు ఆదుకొంటారు తండ్రీ!

**భావవివరణ:**

ఓ దేవదేవా! నీవే మమ్ము దయదలచి రక్షించవలెను. చేవల (ఆజ్ఞావర్తనులను చేయగలిగిన నీసేతలెల్ల (నీలీలలన్నియును) లోకానను (ఈ లోకంలో) చెల్లును (సాగుతూనే వుంటాయి). మేము చేయగలిగిందేమీ వుండదు.

మేము తీపు నంజేవేళ (తీపి తింటున్నప్పుడు) మాకు తేట బులుసు (పుల్లని పదార్థములు) ఇంపౌను (బాగుంటాయి అనిపిస్తుంది). పైపైన పుణ్యకార్యాలు చేస్తూనే పాపము చేస్తే బాగుంటుందేమో అనే భ్రమ కలుగుతుంది. మరి, మేము నడిచే జంతువులం కదా! ఈ విరుద్ధ భావాలు ఒకదానికొకటి లంకె (ముడిపడివుంటాయి). ఇక మేము పాపము చేయకుండా వుండగలమా? అదెట్లా సాధ్యమవుతుంది ప్రభూ!

కడు జలువైతే (ఎక్కువ చల్లగా వుంటే) గక్కున (వెంటనే) వేడిగావుంటే బాగుండును అనిపిస్తుంది. చెడని విరతివేళ (వైరాగ్యంతో వున్నవేళ) సిరిసంపదలు సంపాదిస్తే బాగుండుననిపిస్తుంది. వొడలు మోచినవారికి (శరీరధారులైన మానవులకు) ముడిపడ్డ ఈ పరస్పర వైరుధ్యాల వలన, భోగలాలస తొడరు (భోగములపై రక్తి కలుగుతుంది). మాని (వద్దు అని) వీనిని తోయనెట్టవచ్చునా (విసర్జించగలమా?)

ఓ ప్రభూ! ఇవన్నియును నా మాయలే ఈ నీ ఆజ్ఞలు జమళి (నిత్యనూతన)మైనవి జీవులందరికీ శిరోధార్యమైనవి. ఇందువలన ఓ శ్రీవేంకటేశ్వరా! నేను నీకే తవిలి (తగులుకొని) శరణు అన్నాను. మాకు నీవే గతి. నన్ను నీవు తాగనెట్టువచ్చునా (అధఃపాతాళానికి త్రోయవచ్చునా తండ్రీ!)

సంపుటి : 2    కీర్తన : పాటెల్లా నొక్కచో నుండు భాగ్య మొక్కచో నుండు

సంఖ్య : 182    పుట : 122    రాగం : రామక్రియ

### రామక్రియ

41. పాటెల్లా నొక్కచో నుండు భాగ్య మొక్కచోనుండు
యీటవెట్టి పెద్దతనా లెంచఁ బనిలేదు ॥పల్లవి॥

సరవిఁ గలకాలముఁ జదువుచుండు నొకఁడు
గరిమ నీకృప నిన్నుఁ గను నొకఁడు
ధరఁ బ్రయాసముతోడఁ దపముసేయు నొకఁడు
శరణుచొచ్చి నీకుఁ జనవరౌ నొకఁడు ॥పాటె॥

వొక్కఁడు మోపుమోచు నొక్కఁడు గొలువుసేయు
వొక్కఁడు పొగడీ త్యాగ మూరకే యందు
వొక్కఁ డాచారము సేయు నొక్కఁడు మోక్షము గను
యెక్కడా నీకల్పన కేమిసేయవచ్చును ॥పాటె॥

భావించ నటుగాన ఫలమెల్లా నీమూలము
యేవలనైనా నీవు యిచ్చితేఁ గద్దు
జీవులు నిన్నెఱఁగక జీఁకటి దవ్వఁగనేల
శ్రీవేంకటేశ్వర నిన్ను సేవించేదే నేరుపు ॥పాటె॥ 182

**అవతారిక :**

అచ్చతెలుగు నుడికారాలతో చిక్కేమిటంటే వేర్వేరు అర్థములు ఒకే మాటకి వుండటం వలన అపార్థానికి దారితీస్తుంది. 'పాటెల్లా నొక్క చోట' అంటే, 'ఒకచోట పాటు యెల్లా వుంటుంది' అని అర్థం చెప్పుకోవాలి. 'ఈటువెట్టి పెద్దతనాలెంచబనిలేదు' అంటే.. 'అనవసరంగా గొప్పతనం అంటగట్టాల్సిన పనిలేదు' అని అర్థం. ఈ పల్లవిని నేటి భాషలో చెప్పాలంటే... 'పడరాని తిప్పలు ఒకరికి, భోగభాగ్యాలు ఇంకొకరికి' ఇవి వీరి వారి గొప్పతనం అని అనుకోకూడదు. అవి వారి వారి కర్మఫలాలు.





చవట ఒకడైతే చక్రవర్తి ఇంకొకడవుతాడు. కానీ అసలైన నేర్పు ఈ స్థితిగతుల్లో లేదు... శ్రీవేంకటేశ్వరుని సేవించుటయే నేర్పు అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావవివరణ:**

ఓదేవదేవా! 'కష్ట'మంతా ఒకచోట వుంటే 'కలిమి' ఇంకొకచోట వుంటుంది. ఈటువెట్టి (వ్యర్థముగా) అవతలివారు గొప్పవారు అని అనుకోకూడదు.

స్వామీ ఎంత చిత్రం! ఒకడు వున్న కాలమంతా సరవి (క్రమంగా) వేదాలు చదువుతూనే వుంటాడు. ఈ మధ్యలో ఒకడు వున్నట్లుండి నీ కృపకు పాత్రుడవుతాడు. ఒకడు అనేక ప్రయాసలు (బాధలు) పడి నీకై ఘోరతపస్సు చేస్తాడు. మరింకొక జనవరి (జనులచే వరించబడినవాడు) అవుతున్నాడు. ఎందుకంటే, వాడు నిన్ను శరణుజొచ్చి నీకుదాసుడైయున్నాడు. ప్రభూ! అతితేలికయైన మార్గం వదలి యెందుకా తిప్పలు.

ఓ దేవా! ఒకడు మోపుమోచు (బరువులెత్తి జీవిస్తాడు), ఒకడు గొలువు సేయు (రాజుగారి కొలువులో వుంటాడు). ఒకడు భట్రాజులా ఇంకొకర్ని పొగడుతూనే వుంటాడు. ఒకడు వూరకనే త్యాగము (ఈవి) కలిగి వుంటాడు. ఒకడు యజ్ఞయాగాలవంటి ఆచారములను చేస్తాడు. ఇంకొకడు అతి తేలికగా మోక్షం పొందుతాడు. అయ్యా! నీ కల్పనకు అంచనాకట్టడం యెవరి తరము?

భావించన్ (ఆలోచిస్తే) అటుగాన ఫలమెల్ల (ఆ, యా, ఫలములన్నీ), నీ మూలము (నీమూలంగా కలిగినవే). ఎవరికైనా నీవిచ్చినదే కద్దు (దక్కుతుంది). మరి, ఈ జీవులు దీని నెరుంగక చీకటి దవ్వనేల (చీకట్లో తవ్వి ఏవేవో పొందాలనుకోవటం ఎంత పిచ్చితనము?) ఎందుకీ తిప్పలు? ఓ శ్రీవేంకటేశ్వరా! నిన్ను సేవించటమే నేర్పరితనం. మిగతా ప్రయాసలన్నీ శుద్ధ... దండుగ తండ్రీ!

సంపుటి : 2 కీర్తన : ఎంత కఠినమో హృదయమిది

సంఖ్య : 181 పుట : 121 రాగం : నాట

**నాట**

42. ఎంత కఠినమో హృదయ మిది
చెంత ఱాతఁజేసిరి గాఁబోలు ॥పల్లవి॥

అమరఁ బురాణములందు నరకముల-
క్రమములు చదివియుఁ గలఁగవు
యమకింకర ఘోరాకృతు లటు విని
భ్రమసి యించుకా భయపడ నేను ॥ఎంత॥

మనుజులదారుణ మహితకర్మముల -
అనుభవములు గని యలయను
వొనర మహోగ్రయహోరాత్రంబులు
చనుచుండఁగా జడియును నేను ॥ఎంత॥

కలుషరౌద్రదుఃఖముల కించుకా
కలఁగను చీరికిఁ గైకొనను
యెలమిని శ్రీవేంకటేశుఁడ నాపాలఁ
గలిగి కాచితివి గాసిల నేను ॥ఎంత॥ (8)

**అవతారిక :**

హృదయం సుతిమెత్తనైనది అంటారు. కాని అదేమిటో నా హృదయం యెంత కఠినమైనది!! దీన్ని రాతితో చేశారేమో కదా! యమకింకరులు ఘోరయాతన పెడతారన్నా భయపడనాయె!! అకృత్యములు చేసేవారికి కలిగే అనుభవాలను వినినా బాబోయ్ అని వెరవను. అహోరాత్రంబులూ భయంకరంగా జీవిస్తున్నా జంకను. కలుషమైన క్రోధముచే దుఃఖములను బొందియు కలగను. అంతేకాదు. చీరికిగైకొనను. అటువంటి స్థితిలోవున్న





నన్ను రక్షించావయ్యా! వేంకటేశ్వరా! అంటున్నారు అన్నమాచార్యులవారు. అంత తేలికగా అర్ధమైతే మరి కావలసిందేముంటుంది?

**భావవివరణ:**

ఓ ప్రభూ! ఈ మానవ హృదయము ఎంత కఠినమైనదో కదా! దీనిని 'ఱాయి' చేత చేసినారేమో!!

అమరిన ఓ హృదయమా! పురాణములందు వివరింపబడిన నరకముల వరుస (రౌరవాది నరకములు) గురించి చదివి కూడా కలంగవు (కలత చెందవు) యమకింకరులు పెట్టే ఘోరమైన శిక్షలను గురించి వినికూడా, యించుక (కొంచెమైనా) భ్రమతో నేను భయపడకున్నానే!!

మనుష్యులు చేయునటువంటి దారుణమైన అహితకర్మముల (చేయరాని పనులవలన) యెన్నియో చెడు ఫలములను అనుభవించుచున్నారు. ప్రతిదినము అట్లనుభవించు వారిని జూచుచునేయున్నాను. కాని నేను అలయను (విసుగు చెందుట లేదు.) మహోగ్రయహోరాత్రంబులు (మహాభయంకరమైన రాత్రింబవళ్ళు) చనుచుండగా (గడచుచుండిననూ) నేను జడియను (జంకుటలేదు). నిర్లజ్జగా దుష్కార్యములను చేయుచునే యున్నాను.

అయ్యో! నేను కలుషితమైన క్రోధము చేతను దాని ఫలితమైన దుఃఖముచేతను, ఇంచుక (కొంచెమైనా) 'కలఁగను' (సంక్షోభమును జెందను). ఆపైన చీరికగైకొనను (బలమైన పశ్చాత్తాపముతో బ్రద్దలైపోను). ఇటువంటి నికృష్ట స్థితిలో వున్న నాపాలగలిగి (నాయందు కరుణవహించి), శ్రీవేంకటేశ్వరా! ఎలమిని కాచితివి (సంతోషముతో రక్షించితివి). నేను గాసిల (బాధపడుతుంటే) రక్షించావా తండ్రీ!

సంపుటి : 2 కీర్తన: ఏమని పొగడవచ్చు నిటువంటిది నీమాయ
సంఖ్య : 180 పుట : 121 రాగం : వరాళి

**వరాళి**

43. ఏమని పొగడవచ్చు నిటువంటిది నీమాయ
కామించి బ్రహ్మాదులనుఁ గప్పీ నీమాయ ॥పల్లవి॥

బచ్చెనరూపులు పెక్కు పడెచ్చుల వేసినట్లు
నిచ్చల నినుచున్నది నీమాయ
తచ్చి వారివారిరతి తమతమకే తెలియ
పచ్చిగా భోగింపించీ దంపతుల నీమాయ ॥ఏమ॥

మఱి తొలునాటిభోగాలు మరునాటికి నింతగా
నెఱవుగాఁ దమకించీ నీమాయ
విఱుచరానిదుఃఖము వెస నిద్రవోయితేనే
మఱపించి నవ్వించీ మహిలో నీమాయ ॥ఏమ॥

పట్టరానిజవ్వనము పరసిపోతే ముదిమి
నెట్టుకొల్పి వుబ్బుఁడచీ నీమాయ
గట్టిగా శ్రీవేంకటేశ ఘనుఁడవైననీదాసుల
పట్టకుండాఁ జేయుము బలిసెనీమాయ ॥ఏమ॥ 180

**అవతారిక :**

శ్రీహరి మాయాలజిక్కనివారెవ్వరు? అన్నారు పెద్దలు. అదే ఇతి వృత్తంతో అద్భుతమైన కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. దీని భావవివరణ, చదివితే ఇది సరళంగా కనుపించే జటిలమైన కీర్తన అని అర్థమవుతుంది. పల్లవి అతి సరళంగా వుండటం వలన అలా అనిపిస్తుంది. చరణాలు మరణాలు అనిపిస్తాయి. ఆచార్యులవారి భాషలోని వింత వింత సంధి ప్రక్రియలు ఒక పట్టాన అర్థంకావు. “పడెచ్చులవేసి” – పడి+అచ్చులవేసి అని అన్వయం చేసికొనవలెను. “నిచ్చల నినుచున్నది నీమాయ” – నిచ్చల నినిచి+ ఉన్నది నీమాయ అని





అన్వయించుకొంటేకాని అర్థం కాదు. “పట్టకుండా జేయు” – పట్టకుండన్+చేయు అనుకోవాలి. ఇక మాధుర్యం సంగతికి వస్తే లేరు అన్నమయ్యకు సాటి అని వేరే చెప్పాలా?

**భావవివరణ:**

ఓ దేవదేవా! నీమాయను యేమని పొగడవచ్చును. ప్రభూ! అది ఇటువంటిది అని యెట్లు చెప్పగలం? బ్రహ్మాది దేవతలనే నీమాయ కప్పి వారు కామమునకు లొంగునట్లు చేసినది నీమాయ (మోహినీ అవతారంలో).

అనేకమైన “బచ్చనరూపులు” (రంగస్థల నటుడు వేసిన వేషములు) పడి(వేసి), అచ్చులవేసినట్లు (అదేమాదిరి వేసినట్లు) – మేము కూడా అనేకమైన వేషాలు నిచ్చలు (ప్రతినిత్యం) వేస్తుంటాం. నీమాయ నినిచి ఉన్నది. (అంతా నిండివున్నది). అందుకని అదివేషం అని మఱచి అందులోనే జీవిస్తుంటాం. దంపతులను వారివారి ఇష్టానుసారము తమ తమకములలో తామే తచ్చి (తగిలి) పచ్చిగా భోగిస్తుంటారు. ఎంత మాయ చేస్తావు తండ్రీ!

నిన్న భోగించాను. మఱునాడు కూడా అదే భోగానుభవము. అందులో తేడాయేమీలేదు కదా! మరి... ఇంత నెరవుగా (నేర్పరిగా) నీమాయ తమకించీని (మైమరపిస్తుందేమిటి?) విఱువరాని దుఃఖము (తునుముట సాధ్యము కాని గొప్పదుఃఖమును కూడా, వెస (బాగుగా) నిద్రపోతే మఱచిపోతాం. మరునాడు నవ్వుతుంటాం. అది నీ మాయ కాక ఇంకేమిటి స్వామీ!

దేవా! పట్టరాని యవ్వనమున పరవశించిపోతే ముదిమి (ముసలితనం) నెట్టుకొనివచ్చి ఉబ్బు (గర్వమును) అడచీ (అణచివేస్తుంది). మరి నీమాయ ఎవ్వరిని వదిలిపెడుతుంది? ఘనుడవైన శ్రీవేంకటేశ్వరా! నీదాసులమైన మమ్మల్ని మాత్రం నీమాయ పట్టకుండా వుంటే చాలు. నీమాయ గట్టిగా బలిసినదగుటచే “అన్యథా శరణం నాస్తి... త్వమేవ శరణం మమ...”

సంపుటి : 3 కీర్తన : ఇంతేపో వారివారిహీనాధికములెల్ల
సంఖ్య : 14 పుట : 10 రాగం : గుజ్జరి

**గుజ్జరి**

44. ఇంతేపో వారివారిహీనాధికములెల్ల
పంతాన తామే పాటిభాగ్యము నాపాటే. ॥పల్లవి॥

అందరిలో దేవుఁడుండు అందధికులు గొందరు
కొందరు హీనులై కుందుదు రింతే
చెంది వీచేగాలొకటే చేనిపంటా నొకటే
పొంది గట్టికొలుచుండి పొల్లు కడఁబడును. ॥ఇంతే॥

పుట్టుగందరి కొకటే భూమిలో యేలికలును
వెట్టిబంట్లుఁ గొందరై వీఁగుదు రింతే
చుట్టి వరిగురుమతో జొన్నగింజ సరిదూఁగు
తెట్టెలై మేలొకటికి తీలొకటికాయ ॥ఇంతే॥

కోరి శ్రీ వేంకటపతికుక్షిలోనే లోకములు
ఆరయఁ గిందెదు మీఁదెడై వున్నవింతే
యీరీతి నితనిదాసు లెక్కిరి పొడవులకు
తారి కిందికి దిగిరి దానవులై కొందరు ॥ఇంతే॥ 14

**అవతారిక :**

ఈ కీర్తనలో నాకు వచ్చిన సందేహాలను ఏ ఒక్క నిఘంటువూ తీర్చలేకపోయింది. చాలా చోట్ల నాకు స్ఫురించిన భావం ప్రకటించాను. నూటికి నూరుపాళ్ళూ ఇదే ఆచార్యుల వారి భావం అనే సాహసం చేయలేను. "కోరి శ్రీవేంకటపతి కుక్షిలోనే లోకములు ఆరయన్ కిందెదు మీదెడై వున్నవింతే"... అనే చరణాన్ని చూడండి. శ్రీవేంకటేశ్వరుడు కోరి తన కుక్షిలోనే అరయన్ కిందయేడు, మీదయేడు లోకములు వున్నవి ఇంతే". అంటే ఈ వసుంధరయే కాక, దానిపైన ఏడు (స్వర్గం మొదలైనవి) దానికింద ఏడు (పాతాళం మొదలైనవి) కూడిన ఈ విశ్వం సమస్తం ఆ





శ్రీహరి పొట్టలోనే వున్నాయని అర్థం. అన్నమాచార్యుల భావం యెంత సరళమో నుడికారం అంత జటిలం.

**భావవివరణ:**

ఇంతేపో, వారి వారి ఉచ్చనీచస్థితులు అన్నియూ భగవంతునిచే ప్రాప్తములు! పంతముతో తామేపాటి, భాగ్యమున్ ఆపాటే (తాము యెంత అర్హులో, తమ భాగ్యము కూడా అదే విధముగా వుంటుంది).

మనందరి అంతరాత్ముడు ఆ దేవుడే కదా! కాని అందులో కొందరు అధికులు అయ్యారు. కొందరు హీనులై కుందుదురు (దుఃఖిస్తారు). ఇదింతే. వీచేగాలికి హీనాధికములున్నవా? అది అందరికీ ఒకటే కదా! చేనిపంటానొకటే (పొలంలో పండే పంట హీనుజాతివాడు పండించినా, అగ్రజాతివాడు పండించినా ఒకేలా పండుతుంది కదా! శ్రీహరిని పొంది గట్టిగా కొలుచుండి (సేవ చేయుచుండినచో, పొల్లు కడబడున్ (పాపము తగ్గును).

పుట్టుకు అందరికీ ఒకేలా వుంటుంది కానీ ఈ భూమిపై కొందరు యేలికలును (రాజులై సుఖిస్తున్నారు). కొందరు వెట్టి చాకిరీ చేసే బంట్లు వలె వీగుదురు (క్షీణిస్తున్నారు). ఇదింతే. వరిగురుమతో (గొప్పదైన వరిధాన్యంతో) జొన్నగింజ సరితూగుతుందా చెప్పండి. ఒకటి తెట్టెలైన మేలు (అధికమైన మేలు) అయితే... తీలు ఒకటికి ఆయ (అణగారిపోవుట ఇంకొకటి అవుతుంది).

శ్రీవేంకటపతి తనకుక్షిలోనే (ఉదరములోనే) అరయన్ (పరికించగా) కోరి కిందయేడూ, మీదయేడు లోకములను వున్నవి. ఇదింతే, అనగా ఈ భూమితో కలసి పదునాలుగు భువనములన్నియు ఆయన పొట్టలోనే వున్నవి. ఈ విధముగా... ఈయన దాసులు పొడవులకు యెక్కిరి (ఉన్నతలోకములను అధిరోహించిరి). ఇదిట్లుండగా కొందరు దానవులై (రాక్షసస్వభావికులై) తారి (సంచరించి), కిందకి దిగిరి (అధఃపాతాళమునకు బోయిరి).

సంపుటి : 3 కీర్తన : ఏనోరువెట్టుక నిన్ను నేమని కావుమందును
సంఖ్య : 60 పుట : 41 రాగం : ఆహిరి

**ఆహిరి**

45. ఏనోరువెట్టుక నిన్ను నేమని కావుమందును
నే నిన్నుఁ దలఁచినది నిమిషమూ లేదు. ॥పల్లవి॥

పాయమెల్ల సంసారముపాలే పడితిఁగాని
చేయార నీసేవ నేఁ జేసుట లేదు
కాయమెల్ల కాంతలకే కగడుశేషమాయఁగాని
నీయవసరములందు నే నొదుగలేదు. ॥ఏనో॥

చిత్తము ఆసలపాలే సేసి బదికితిఁ గాని
హత్తి నిన్నుధ్యానము సేయఁగలేదు
సత్తైపునానాలుకెల్ల చవుల కమ్మితిఁగాని
మత్తిలి నీకీర్తనము మరపుటా లేదు. ॥ఏనో॥

పుట్టుగెల్లా నజ్ఞానముపొంతనే వుంటిఁగాని
వొట్టి నీవిజ్ఞానము నొల్లనైతిని
యెట్టు నన్ను మన్నించితి విందుకే పో వెరగయ్యా
నెట్టన శ్రీవేంకటేశ నిన్నడుగా లేదు. ॥ఏనో॥ 60

**అవతారిక :**

ఓ శ్రీవేంకటేశ్వరా! నేను నిన్ను ఒక్క నిముషము కూడా పట్టుమని భక్తితో ధ్యానించలేదు. మరి, ఇక ఏనోరుపెట్టుకొని నిన్ను రక్షించమని అడుగగలను? నా బ్రతుకంతా సంసార తాపత్రయంతోనే గడిపాను. నా చేతులారా నీకు సేవచేయనే లేదు. పుట్టుకంతా అజ్ఞానంతోనే గడిపాను. ఇకనన్నెట్లా మన్నిస్తావు? నిన్ను శరణు అడుగుటకు కూడా నాకు





భయంవేస్తోంది అంటున్నారు అన్నమయ్య. ఆచార్యులవారిది ఆస్థితి అయితే మనబోటి వారి గురించి చెప్పేదేముంది?

**భావవివరణ:**

దేవదేవా! నిన్ను ఏనోరు పెట్టుకొని, యేమని నన్ను రక్షించమని అడుగగలను? నేను నీకు చేసిందేముంది? ఒక్కనిముషమైన నిన్ను తలుచుకోలేదు కదా!

పాయమెల్లా (వయస్సునంతా) సంసారము పాలేపడితి (సంసారపుయావతోనే గడిపాను). కాని చేయార (నాచేతులతో) నీసేవ చేసిందే లేదు. కాయమెల్లా కాంతలకే కడు శేషమాయె, (శరీరంలో వున్న సత్తువనంతా స్త్రీలకే మిగిలిపోవునట్లు చేశాను). నీనిమిత్తం ప్రయత్నించనే లేదు. ఇక ఏమని నిన్ను ఈనాడు కరుణించమని అడుగగలను?

ప్రభూ! నా చిత్తము (మనస్సు) నంతా ఏవేవో వెట్టి ఆశలపాలుజేసి బ్రతుకునంతా వ్యర్థముగా గడిపాను. హత్తి (కూడి) నిన్ను ఎప్పుడూ ధ్యానించనేలేదు. సత్యము చెప్పవలసిన నా నాలికను ఎల్లచవులకున్ అమ్మితిని (రకరకములైన రుచులన్నింటిని ఆస్వాదించుటకు విక్రయించాను). మత్తిలి (పరవశించి) నీ కీర్తనలను మరపుటా లేదు (పొలగునట్లు చేయలేదు). ఇక ఏమని నిన్ను ఈనాడు దయచూపమని అడుగగలను?

తండ్రీ! నాపుట్టుకెల్లా (జన్మనంతా) అజ్ఞానం పొంతనే (అజ్ఞానంతోబాటే) వున్నాను కానీ ఒట్టి (శపథముతో) నీ విజ్ఞానము (అనుభవ పూర్వకమైన జ్ఞానమును) ఒల్లనైతిని (అంగీకరించలేదు... అంటే... ప్రయత్నించలేదు)... ఇక నన్ను నీవెట్లు మన్నిస్తావు? ఇందుకేపో వెఱగయ్యాను (ఇందుకే కదా! నాకు భయం వేస్తున్నది?) అందుకని ఓ శ్రీవేంకటేశ్వరా! నిన్నడుగలేదు. అయిందేదో అయింది ఈ దీనుణ్ణి ఆదుకో ప్రభూ!

సంపుటి : 3 కీర్తన : ఎట్టుమోసపోతి నేను యివియెల్ల నిజమని
సంఖ్య : 41 పుట : 28 రాగం : శంకరాభరణం

### శంకరాభరణం

46. ఎట్టు మోసపోతి నేను యివియెల్ల నిజమని
నెట్టన హరినే నమ్మనేర నయితిఁగా ॥పల్లవి॥

దేహమిది నాదని తెలిసి నమ్మివుండితే
ఆహా నేనొల్లనన్నా నిట్టే ముదిసె
వూహల నాభోగమెల్లా వొళ్లఁబట్టెనంటా నుంటే
దాహముతోడ నినుముదాగినీరాయఁగా ॥ఎట్టు॥

మనసు నాదని నమ్మి మది మది నే పెంచితి -
ననుఁగుఁబంచేంద్రియములందుఁ గూడెనా (ను?)
యెనసి ప్రాణవాయువు లివి సొమ్మని నమ్మితి
మొనసి లోను వెలినై ముక్కువాత నున్నవి ॥ఎట్టు॥

ఇందుకొరకె నేను ఇన్నాళ్లు పాటువడితి
ముందు వెనకెంచక నే మూఢుఁడ నైతి
అంది శ్రీవేంకటేశ్వరుఁ డంతటా నుండి నా-
చందము చూచి కావఁగ జన్మమే యీడేరె. ॥ఎట్టు॥ 41

**అవతారిక :**

అసలివియన్నీ విని... నేను ఎట్లా మోసపోయాను? ఎట్లా నిజమని నమ్మాను? తప్పకుండా శ్రీహరిని నమ్మజాలనైతిని అంటున్నారు అన్నమాచార్యులవారు. "ఊహల నాభోగమెల్లా వొళ్ళబట్టానంటానుంటే... దాహముతోడ నినుము దాగిసి నీరాయగా" - అంటే ఏమిటో బుఱ్ఱ బద్దలుకొట్టుకున్నా అర్థంకాలేదు. ఏడుకొండలవాడా! అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణంమమ. ఏదన్నా స్ఫురింపజేయవయ్యా! తండ్రీ! అని





మొఱబెట్టాను. "అంది శ్రీవేంకటేశ్వరుడంతటా నుండి నా చందము చూచి కావగ జన్మమే యీడేరె" అని ఆచార్యులవారన్నట్లే జరిగింది.

**భావవివరణ:**

హతవిధీ! ఇవియన్నియు (దేహము, భోగభాగ్యాలు, మనస్సు, ప్రాణము మొదలైనవన్నియును) నిజమైనవని ఎట్లా నమ్మాను? నెట్టన (తప్పకుండా) హరిని (శ్రీహరిని) మాత్రం నమ్మనైతినే. ఎంత దౌర్భాగ్యుడను!!

ఈదేహము 'నాది' అని తెలసి (అనుకొని) నమ్మికతో వుంటే... ఆహా! నేను వద్దన్నా ఇది ముదిసె (ముసలిదైపోయింది). దీనితో అనుభవించే నా భోగాలన్నీ 'ఊహలే' కాని ఆ భోగాలను వంటబట్టించుకొని వుండిపోయాను. వాటి కోసం తపించాను. ఎంత తీవ్రమైన దాహమంటే దాని తాపానికి ఇనుము కూడా కరిగి నీరు అవుతుంది. ఎంత క్షోభననుభవించాను ప్రభూ!

నా మనస్సును నమ్మివున్నాను. నాదని అనుకొన్నాను. మది (మనసులోనే) మదినే పెంచితిన్ (నేను దానిపై మమకారం పెంచుకొన్నాను). కాని అది అనుగు పంచేంద్రియముల గూడెను (పాపకార్యములను ప్రోత్సహించు కన్ను ముక్కు వంటి పంచేంద్రియములతో జతకలిసింది). ఇవి ఎనసి (పొందిన) ప్రాణవాయువులను (ప్రాణము, అపానము, ఉదానము, వ్యానము, సమానము అను ఐదు వాయువులు) నమ్మి వాటిపై ఆధారపడ్డాను. కాని అవి ముక్కు ఆధీనమైనవి. ఎప్పుడు నన్ను వదలిపెడతాయో తెలియదు. ఎంత దారుణం!!

ఓ దేవదేవా! ఇన్నాళ్ళూ నేను వీటికొఱకా పాటుపడింది? ముందూ వెనుక ఆలోచించక వీటికొఱకా మూర్ఖుడినయ్యాను? అని ఎంతో దుఃఖించాను. అప్పుడు శ్రీవేంకటేశుడు నన్ను అందుకొని, నా చందము (పద్ధతి) చూచి అంతటా తానై నన్ను రక్షించాడు. అప్పుడు నా జన్మమే ఈడేరె (ధన్యమైనది).

సంపుటి : 3 కీర్తన : నీవెంత నేనెంత నీకు నాకు నెంతదవ్వు

సంఖ్య : 51 పుట : 35 రాగం : ముఖారి

**ముఖారి**

47. నీవెంత నేనెంత నీకు నాకు నెంతదవ్వు
దైవమా సిగ్గువడక తగిలే నేఁగాకా ॥పల్లవి॥

చెంది నీకు బ్రహ్మాదులు సేవలు సేయఁగాను
యిందు మాసేవలు నీకు నేడకువచ్చు
పొంది వసిష్టాదులట్టె పూజలు సేయఁగాను
సందడి మాపూజలు సరకా నీకు. ॥నీవెం॥

సనకాది యోగులు సారె నిన్నుఁ దలఁచఁగా
యెనసి మాతలఁపు నీ కేడకెక్కును
నునుపుగా శేషాదులు నుతులు నిన్నుఁజేయఁగా
పనివడి మానుతులు బాఁతేయనా నీకు ॥నీవెం॥

కిట్టి నారదాదులు నీకింకరులై వుండఁగాను
యిట్టె నీదాసుఁడనను టెంత కెంత
వొట్టి శ్రీవేంకటేశ మాకొకవుపాయము గద్దు
పట్టి నీదాసులబంటుబంట నయ్యేనిఁకను. ॥నీవెం॥ 51

**అవతారిక :**

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవెంతటి ఉన్నతుడవు!! మేమెంత అధములము !! మన మధ్య ఎంత అంతరం వుంది!! అయినా సరే, సిగ్గు యెగ్గు లేకుండా నిన్ను తగులుకున్నాను. నాదైవమా! బ్రహ్మాది దేవతలు, వసిష్ఠ్యాది ఋషులు, సనకసనంనాది యోగులు, ఆదిశేషుడు, నారదాది మహామహులు నీకింకరులు. వారి ముందు నేనెంత అల్పుడిని. అయినా నాకూ ఒక ఉపాయముందయ్యోయ్. నేనూ తక్కువ వాడినేం కాదు. నీదాసులకి బంట్లుంటారు కదా! ఆ బంట్లకి బంటునవుతాను. ఆ విధంగా నేనూ నీవాడినే అని సగర్వంగా చెప్పుకొంటాను... అంటున్నారు అన్నమయ్య.





**భావవివరణ:**

ఓ దైవమా! నీవెంత (ఎంతటి ఉన్నతుడవు) నేనెంత (ఎంత అధముడను)!! నీకూ నాకూ మధ్య ఎంత దవ్వు (దూరము... లేక అంతరం) వున్నది!! అయినా, ఏమాత్రం సిగ్గుపడక నేనుతగిలీ గాక! (తగులుకొన్నాను కదా! నీకు).

బ్రహ్మాది దేవతలు నీకు చెందిన (నీవారై) నీకు పలు సేవలు చేస్తుంటే, మాసేవలు, నీకున్‌యెందు వచ్చెయేడకు వచ్చె (ఎందులోకి వస్తాయి, ఎక్కడకు వస్తాయి?) వసిష్ఠుడు మొదలైన ఋషులు సులువుగా నిన్ను పొంది పూజలు చేస్తుంటారు. ఆ సందడిలో నీకు మా పూజలు సరకా (లక్ష్యమా)? ప్రభూ! మరి నాగతేమిటి?

ఓ దేవదేవా! సనకాది యోగులు నిన్ను సారె (ప్రతిసారీ) తలచగా (ధ్యానిస్తూనేవుంటారు). ఎనసి (అతిశయించి) మా ధ్యాస నీకు యెక్కడ కెక్కుతుంది? నునుపుగా (స్నిగ్ధముగా) ఆదిశేషుడు మొదలైనవారు నిన్ను కీర్తిస్తుంటే పనివడి మా నుతులు (పనివేళా నా కీర్తనలు) బాతేయనా (బాతి+ఆయెనా... అంటే ప్రేమ అవసరమౌతుందా?) మేము ప్రేమిస్తే యెంత ప్రేమించకపోతే యెంత?)

స్వామీ! నారదాదులు (నారదుడు మొదలైన సంకీర్తనారాధ్యులు) కిట్టి (నీ సమీపములోనే వుండి) నీ కింకరులు (భృత్యులు) అయివున్నారు. మరి, నేను ఇట్టే నీ దాసుడినుట యెంతకెంత? (ఎంత దుస్సాహసము!!) ఒట్టి (అతిశయించి ఓ శ్రీవేంకటేశ్వరా! మాకొక ఉపాయమున్నదయ్యా! పట్టి (పూనుకొని) నేను నీ దాసుల యొక్క బంట్లకు భృత్యుడుగా వుంటాను. హరిదాసులు సేవకులకు బంటునైతే మరి నీకూ నాకూ చుట్టరికమున్నట్లే కదా! తండ్రీ!

సంపుటి : 3    కీర్తన : అందాకానమ్మలేక అనుమానపడు దేహి

సంఖ్య : 18    పుట : 13    రాగం : లలిత

**లలిత**

48. అందాఁకా నమ్మలేక అనుమానపడు దేహి
అంది నీసొమ్ముగనక అదియుఁదీరుతువు. ॥పల్లవి॥

నీదాసుఁడననేటినిజబుద్ధి గలిగితే
ఆ దెస నప్పుడే పుణ్యుఁడాయ నతఁడు
వేద (దు?)తో నొక్కొక్కవేళ వెలుతులు గలిగితే
నీదయవెట్టి వెనక నీవే తీరుతువు ॥అందా॥

తొలుత నీశరణము దొరకుటొకటేకాని
చెలఁగి యాజీవునికిఁ జేటు లేదు
కలఁగి నడుమంత్రాన గతిదప్పనడచిన
నెలకొని వంకలొత్త నీవే నేరుతువు. ॥అందా॥

నీవల్లఁ గొరత లేదు నీపేరు నొడిగితే
శ్రీవేంకటేశ యిట్టె చేరి కాతువు
భావించలేకుండఁగాను భారము నీదంటేఁజాలు
నీవారి రక్షించ నీవే దిక్కోదువు. ॥అందా॥ 18

**అవతారిక :**

జీవులందరూ ఆ పరమాత్ముని ప్రియ సంతతే. ఆయన వారిని తన 'సొమ్ము'గానే భావిస్తాడు. దౌర్భాగ్యమేమిటంటే వీడిని అజ్ఞానం అనే పొర యెప్పుడూ కప్పివేస్తుంటుంది. దానితో వాణ్ణి అనుమానం అనే పిశాచి పట్టుకొంటుంది. తనదేహంలో వున్న పరమాత్మని గుర్తించలేడు. అందాకా (అంతవఅకు) నమ్మలేక తన మనుగడకే కారణమైన పరమాత్మనే నమ్మలేక అనుమానపడుతుంటాడు. ఓ ప్రభూ! అదియు (ఆ అనుమానం కూడా)





నీవే తీరుస్తావు అంటున్నారు అన్నమాచార్యులవారు. శ్రీవేంకటేశ్వరుడే పరమాత్ముడని భావించలేని వారు (నాలాంటి అల్పులు) కూడా తమ భారం అంతా నీదే మహాప్రభో! అంటే ఆనాడు ద్రౌపదిని రక్షించినట్లు రక్షిస్తాడు... "నీవేదిక్కోదువు" అంటున్నారు.

**భావవివరణ:**

ఓ దేవదేవా! నిన్ను అందాకా (అంతవరకు... అంటే... చివరి వరకు) నమ్మలేక, దేహధారి యైన'జీవుడు' అనుమానపడుతుంటాడు. వాడు నీసొమ్ము (సొత్తు) గనుక, అంది (పూనుకొని) అదియు దీరుస్తావు (ఆ అనుమానం కూడా పోగొట్టి) వాడిని నీవాణ్ణి చేసికొంటావు.

ప్రభూ! ఆ దేహికి తాను నీదాసుడను అనే నిజబుద్ధి కలుగగానే అప్పుడే, ఆ దెస (అక్కడే) అతడు పుణ్యుడాయ (పుణ్యాత్ముడైపోతాడు). వేదుతో (వెగటు స్వభావముతో) ఒక్కొక్కప్పుడు వెలుతులు గలిగితే (నీపై నిర్లక్ష్యం కలిగితే) వెనక (ఆ తరువాత) నీవే వారిపై దయజూపి ఆ వెగటుతనాన్ని కూడా రూపుమాపుతావు. కాకపోతే నీకృప కలగవలసిన అవసరం మాత్రం వుండాలి.

తొలుత (మొట్టమొదట) నీ శరణమును వేడితే... అది దొరకగానే ఇక ఆ జీవుడికి చేటు (కీడు) లేనే లేదు. ఒకవేళ వాడికి అనుకోకుండా నడమంత్రపు సిరి (మధ్యలో అకస్మాత్తుగా వచ్చిన సంపద) వలన గతిదప్పినడిచితే... నీవు నెలకొని (నిలిచి) నీవే వంకలొత్త (సరిజేయుట) నేరుతువు.

ఓ శ్రీవేంకటేశ్వరా! మావలన లోపం వుంటుంది కానీ నీవల్ల కొరత (లోపం) వుండనే వుండదు. మేము నీపేరు నొడిగితే (పలికినంతనే) ఇట్టే చేరి కాతువు (రక్షించెదవు). ఒకవేళ నిన్ను భావించలేకపోతే (అంతరంగంలో దర్శించలేకపోతే) మేము చేయవలసిందొక్కటే భారము నీపైవేసి నీవే దిక్కు అంటే... నీవారిని నీవే రక్షించుకొంటావు. నీవే దిక్కూ అవుతావు. ఇది ముమ్మాటికీ నిజం తండ్రీ!

సంపుటి : 3 కీర్తన : చింతలు రేచకుమమ్ము చిత్తమా నీవు

సంఖ్య : 63 పుట : 43 రాగం : గౌళ

## గౌళ

49. చింతలు రేఁచకు మమ్ము చిత్తమా నీవు
పంతముతో మముఁగూడి బతుకుమీ నీవు ॥పల్లవి॥

తల్లి శ్రీమహాలక్ష్మి తండ్రి వాసుదేవుఁడు
ఇల్లు మాకు బ్రహ్మాండమింతా నిదె
జల్లిదపుహరిభక్తి పాఁడీఁ బంటా నాకు
వొల్లము కర్మఫలము లొకటి నేము ॥చింత॥

జ్ఞానమే మాకు ధనము సర్వవేదములు సొమ్ము
వూనినవై రాగ్యమే వుంబళి మాకు
అనినగురుసేవలు ఆఁడుబిడ్డలు నాకు
మేనితోనే తెగులాయ మేలు మాకుఁ జేరెను ॥చింత॥

యేలికె శ్రీ వేంకటేశుఁ డింటిదేవపూజ మాకు
పాలుగలబంధువులు ప్రపన్నులు
కీలు మాకు నీతనిసంకీర్తన మోక్షమునకు
యేలా ఇంకా మాకు నేమిటితో గొడవ. ॥చింత॥ 63

**అవతారిక :**

తన చిత్తమును హెచ్చరిస్తున్నారు అన్నమయ్య. ఓసి చిత్తమా! చింతలను రేప వద్దు అంటున్నారు. మాతో వుండాలంటే పట్టుదలతో నీవు మమ్మల్ని అనుసరించి బ్రతుకవలసినదే. నీకు ఇంకోదారి లేదు అంటున్నారు. తన విశిష్టత లేవియో ఏకరువు పెడుతున్నారు. పెట్టి ... ఇంకా మాకు యేలా (యేమిటికి) నీతో గొడవ అంటున్నారు. వైష్ణవుల శరణాగతి పద్ధతియే ఇంత. అతిసరళమైన ఈ కీర్తనలో కూడా "ఆనిన





గురుసేవలు ఆడు బిడ్డలు నాకు" అంటే ఏమిటో ఒక పట్టాన అర్థం కాలేదు నాకు. ఉంబళి అంటే ఏమిటి?

**భావవివరణ:**

ఓ చిత్తమా! (మనసా!) నీవు మమ్ము (మాకు) చింతలు రేచకు (ఆవేదన కలిగించకు). నీవు పంతముతో (దీక్షతో) మమ్ము అనుసరించి బ్రతుకుము.

మా గురించి నీకు తెలియునా? మాతల్లి లక్ష్మీదేవి. మా తండ్రి వాసుదేవుడు. ఈ బ్రహ్మాండ మంతయును మా ఇల్లే. మా ఇంట్లో సమృద్ధిగా నున్న పాడీపంటా... బల్లిదుడైన (పరాక్రమశాలియైన) శ్రీహరియందు మాకు గల భక్తి. అందుకని, నేము (మేము) కర్మఫలము నొక్కదానినైనా ఒల్లము (అంగీకరించము).

మాకున్న ధనమేమిటో తెలుసా... జ్ఞానము. మా సొమ్ము (సొత్తు) యేమిటో తెలుసా... సమస్త వేదములు మాసొమ్ము. పూనిన (పొందిన) వైరాగ్యము మాకు 'వుంబళి' (పన్నులేని ఆదాయము... (అంటే టాక్స్ ఫ్రీ ఇన్‌కమ్). మా ఆడుబిడ్డలు (కుమార్తెలు) యెవ్వరో తెలియునా? మేము నమ్మిశ్రద్ధగా ఆచరించిన గురుసేవలు. మాకు మేనితోనే (శరీరంతోనే) తగులాయె (చిక్కువచ్చింది). ఎందుకంటే, "మేలు చేరె" (దానిపై వలపు కలిగింది).

మా ఇంటిదేవుడు (ఇలవేల్పు) లోకాల ఏలిక అయిన శ్రీ వేంకటేశ్వరుడి పూజ మా సర్వస్వము. మావైపునున్న బంధువులు శ్రీహరి శరణాగతి పొందిన ప్రపన్నులు. ఆ దేవదేవుడైన శ్రీహరి నామ సంకీర్తన మా మోక్షమునకు కీలు (ఉపాయం) ఇంక మాకేల కొరత? ఏమిటితో గొడవ (దేనితో గొడవ?)

సంపుటి : 3 కీర్తన : ఎట్టుగెలుతు బంచేంద్రియములనే

సంఖ్య : 47 పుట : 32 రాగం : కన్నడగౌళ

### కన్నడగౌళ

50. ఎట్టు గెలుతుఁ బంచేంద్రియముల నేఁ
బట్టరానిఘనబలవంతములు. ॥పల్లవి॥

కడునిసుమంతలు కన్నులచూపులు
ముడుఁగక మిన్నులు ముట్టెడిని
విడువక సూక్ష్మపువీనులు యివిగో
బడిబడి నాదబ్రహ్మము మోచె. ॥ఎట్టు॥

అదె తిలపుష్పంబంత నాసికము
కదిసి గాలి ముడెగట్టెడని
పొదిగి నల్లెఁడే పొంచుక నాలికె
మొదలుచు సర్వము మంగెడిని ॥ఎట్టు॥

బచ్చెనదేహపుపైపొర సుఖమే
యిచ్చుఁ బ్రపంచం బీనెడిని
చెచ్చెర మనసిది శ్రీవేంకటేశ్వరుఁ
దచ్చి తలఁచఁగా దరి చేరెడిని. ॥ఎట్టు॥ 47

**అవతారిక :**

మానవుని కన్ను ముక్కు నోరు చెవి చర్మములను పంచేంద్రియములంటారు. ప్రపంచానికి సంబంధించిన బాహ్య జ్ఞానమును ప్రసాదించే వీటివల్లనే నరుని జీవితం సాధ్యమవుతున్నది. కాని కాలం గడిచిన కొద్దీ అవి మనిషిని తమ వశము చేసికొని తమ ఇష్టం వచ్చినట్లు వాడిని ఆడిస్తుంటాయి. వాడు వాటిని గెలువలేక వాటికి బానిస అవుతాడు. అవి పట్టరాని బలవంతములై వాడిమీద పెత్తనం





చలాయిస్తాయి. అందుకనే వీటిని ఎట్టా గెలుతును అని వాపోతున్నారు అన్నమయ్య. చెచ్చెర మనస్సు వీటితో కూడిన వీటిని గెలవాలంటే దచ్చితలచాలి, శ్రీవేంకటేశ్వరుడు దరిచేరాలి అంటున్నారు. అంటే?

**భావవివరణ:**

హతవిధీ! నేను ఈ పంచేంద్రియములను ఎట్లా గెలిచెదను? ఇవి పట్టరానివి (బంధింపలేనివి) గొప్ప బలవంతములైనవి. అవి నా శత్రువులని తెలిసినా నేను వాటినేమీ చేయలేకపోతున్నాను.

కన్నులు, కడున్‌యిసుమంతయి (గొప్ప వాడియైనవి). వీటి చూపులు ఏమాత్రం తగ్గక మిన్నులు ముట్టెడిని (ఆకాశాన్ని తాకుతూనే వుంటాయి). ఇదిగో ఈ వీనులు (చెవ్వులు) వున్నాయే అవి విడువక సూక్ష్మమైన శబ్దజ్ఞానమును అందజేయుచున్నవి. నాదబ్రహ్మవలె నున్న పరమాత్ముని అంశగలవైనప్పటికీ మనస్సు వీటిద్వారా తనకిష్టమైనవే వింటుంటుంది. వీటిని కాదనుట కష్టమే.

ఈ నాసిక (ముక్కు) వున్నదే... ఇది కేవలం తిల పుష్పంబంతయున్నది (నువ్వు పువ్వు అంతుంటుంది). అది కదిసి (దగ్గరయై) గాలిని కూడా, ముడిగట్టెడిని (పన్నువలె కట్టించుకొంటుంది). అక్కడే పొంచియున్న నాలుక మెదలుచు (దాని ఇష్టం వచ్చినట్లు కదలుచూ కనపడ్డదాన్నల్లా మింగుతూనే వుంటుంది.

ఇక ఈ బచ్చెన దేహము (రంగురంగుల శరీరం) వున్నదే... దీనిపై పొరలో మాత్రమే స్పర్శజ్ఞానం వుంటుంది. కాని అది సుఖేచ్ఛతో ప్రపంచాన్నే ఈనెడిని (ప్రసవిస్తుంటుంది). సమస్త జీవకోటి పుట్టుకకు ఇదే కారణం. అవునా? సరే, ఈ ఐదూ ఇలావుంటే వీటితోపాటు చెచ్చెర (శీఘ్రముగా) వశపరచుకోగల మనస్సు కూడా వున్నది. అది శ్రీవేంకటేశ్వరుని తచ్చి తలచగా (ప్రయత్నించి ధ్యానించగా) ఆస్వామి దానిననుగ్రహించి, దరిజేరెడిని (దానికి దగ్గరవుతాడు).

సంపుటి : 4 కీర్తన : ఎన్నాళ్ళున్నా నిట్టేకదా

సంఖ్య : 59 పుట : 398 రాగం : దేసాళం

**దేసాళం**

51. ఎన్నాళ్ళున్నా నిట్టె కదా
విన్నని వెరగులె వేఁడుకలాయ ॥పల్లవి॥

భువి నెట్టున్నాఁ బోయేదే కా
చవులకుఁ జవియగు శరీరము
ధ్రువమని యీ సుఖదు:ఖ రోగములు
భవముల కిదియే బందములాయ ॥ఎన్నా॥

ఎంత వొరలినా నిదే తాఁగద (?)
కంతల కంతల కాయమిది
బొత దగులుచుక పొరలఁగఁ బొరలఁగ
సంతకూటములె సరసములాయ ॥ఎన్నా॥

కైపుసేసినా ఘనమౌనే కా
పాపముఁ బుణ్యముఁ బైపైనే
యీ పుట్టుగునకు ఈ వెంకటపతి
దీపించఁగఁ బెనుఁదెరువొకటాయ ॥ఎన్నా॥ 59

**అవతారిక :**

అన్నమాచార్యులవారి కీర్తనలలో పల్లవిని అర్థం చేసికొనుట తలకు మించిన భారం అవుతుంది. ఈ కీర్తన అందుకు చక్కని ఉదాహరణ. "ఎన్నాళ్ళున్నా ఇదే కదా! అల్పమైన వింతలు (సర్‌ప్రైసెస్) సంతోషకరమైనవిగానే వుంటాయి." అంటున్నారు. కొత్త ఒక వింత పాత ఒక రోత. ఇవ్వాళ నవ్వించేదే రేపు ఏడిపిస్తుంది. మానవ సంబంధాలన్నీ సంత కూటములే (బజారులో కలసి బాగున్నారా అని





పలకరించుకొన్నాక... ఆ తరువాత ఎవరికి వారే యమునా తీరే...) మరి... ఇక ఇదింతేనా ఇలాగే నూరేళ్ళు బ్రతకాలా? బాబోయ్...అని భయపడకండి. మార్గం వున్నది.

**భావవివరణ:**

ఓ మానవులారా! ఆలోచించండి, ఎన్నాళ్ళు బ్రతికినా ఇట్టే కదా! (ఇదింతే కదా!) విన్నని వెరగులే (అల్పమైన వింతలే) వేడుకలాయ (సంతోషకరమైనవిగా వుంటాయి). (ఆ తరువాత సంతోషం మాయమవుతుంది.)

ఈ శరీరమున్నది చూశారా? భూమ్మీద ఎట్లా బ్రతికినా ఇది పోయేదే కదా! ఉన్నంతకాలము ఇది చవులకు జవియగును (రుచులకు చప్పబడిపోతుంది). ధ్రువమని (ఎడతెగనిదిగా వుంటుందనుకొని) సుఖదు:ఖములు అనే రోగాలపాలబడి భవబంధాలలో మగ్గిపోతుంటుంది.

ఎంత వొరలినా (పొర్లినా) ఇదే తాఁగద (తాఁకు కద) అంటే... ఎంత క్రిందమీదైనా స్పర్శానందం కాయమునకే కదా! మరి ఈ కాయము ఏమిబాగుంది? దీని నిండా కంతల దొంతరే. బొతదగులుచు (పొత్తు కలిసి) పొరలగ పొరలగ (వుండగా వుండగా) సరసములాయ (చనువుతో కూడిన సంబంధాలేర్పడతాయి). కానీ ఇవన్నీ సంతకూటములు (బజారులో కలిసినప్పుడు ప్రేమలొలకబోసి బాగున్నారా అని చూపించే ఆప్యాయతలే...). ఇవి నిజం అని భ్రమపడవద్దు.

కైపుసేసినా (ఎంత విజృంభించినా) ఘనమౌనేకా (గొప్పతనమవుతుందా?) అవన్నీ మన పాపపుణ్యాల పైపైనే (వలననే) కదా! ఇందులో మనగొప్పతనమేమున్నది? ఈ పుట్టుగునకు (జన్మకు) ఈ శ్రీవేంకటేశ్వరుడు దీపించగా (వెలుగునీయగా) పెను తెరువొకటాయ (గొప్ప జీవన్మార్గము లభించింది.)

సంపుటి : 4 కీర్తన : పంతపుటాసలు బండ్ల రాగా

సంఖ్య : 69 పుట : 47 రాగం : గుండక్రియ

## గుండక్రియ

52\. పంతపుటాసలు బండ్ల రాఁగా
దొంతుల యలమటఁ దొలఁగేనా ॥పల్లవి॥

మును దీపనాగ్ని మోఁచిన దేహిని
అనిశముఁ గ్రోధాగ్ని నణఁచేనా
మనసిజుకతమున మహి జన్మించితి
విను మరునాజ్ఞకు వెలి యయ్యేనా ॥పంత॥

సటలోభపు సంసారము చొచ్చితి
ఘటన విడుము డిఁకఁ గలిగీనా
నటించు చపలపునాలుక గల నే
మటమాయపు చవి మానేనా ॥పంత॥

పాపపుణ్యముల భవముల జీవిని
తోపడ కర్మము దొబ్బేనా
యేపున శ్రీవేంకటేశ్వరుశరణమే
పైపయి భజించి బ్రదికితిఁగాక ॥పంత॥ 69

**అవతారిక :**

అన్నమాచార్యులవారి కీర్తనలలో పల్లవియే కొరకరాని కొయ్య అని వెనకటికొకసారి విన్నవించాను. కొట్టుమిట్టాడితేనేగాని కుదరని కసరత్తు. మానవుల ఆశలు తీరక పంతము (పోటీ) పెరుగుతుంది. ఈ పంతపుటాసలు ఒకటి, రెండు అనుకోలేం. ఇవి బండ్లమీద మోసికొచ్చేటంతగా వుంటే వానికి తగ్గట్లే... అవి తీరలేదనే ఆలమటము (ఆరాటము) కూడా వుంటుంది. ఇది తొలగిపోయే దారేది? అంటున్నారు.





విచారించకండి.... వేంకటేశ్వరుని శరణమే మార్గం. ఆయనను పైపయి భజించి బ్రతికితిగాక! అంటున్నారు.

అంటే ఏమిటి?

**భావవివరణ:**

మానవులారా! పంతము (పట్టుదల వలన పెరిగే పోటీ) పెంచునటువంటి ఆశలు, బండ్లరాగా (కుప్పలు తెప్పలుగా బండ్లపై వచ్చినట్లు కమ్ముకొనగా) అలమట (అవి తీరలేదే అనే చింత) దొంతుల (సమూహంగా) పెరుగుతుంది. అది తొలగేనా (పొమ్మంటే పోతుందా?)

దేహి అని పిలువబడే ఈ ఆత్మ దీపనాగ్ని, (అగ్నివలె వెలిగే జ్యోతి స్వరూపుడు). కానీ అజ్ఞానంవలన, అనిశము (ఎల్లప్పుడూ) వాడిని క్రోధాగ్ని అణిచివేయుచున్నది. నేను కూడా ఈ భూమిపై పుట్టినది. ఆ మనసిజు కతమున (మన్మథుడి మూలంగానే). మరి ఇది వినండి. నేను కూడా ఆ మరుని ఆజ్ఞకే వెల అయ్యేనా (అమ్ముడు పోయేనా!!) ఎంత దురదృష్టం?

సట లోభము (కపటియైన లోభగుణము)తో నిండిన ప్రపంచమున ప్రవేశించితిని. ఇక విడుముడి (విముక్తి) అనే ఘటన కలగీనా (కలుగుతుందా?) నేను నా నాలుక బాధ భరించలేను. చపలపు నాలుక (చపలస్వభావంగల నా నాలుక) నటించు (ఎప్పుడూ ఆడుతూనే వుంటుంది). అది మట(టు) మాయపు చవి (మిక్కిలి మాయకు గురిచేసే 'రుచి' అనే యావనుమానుకొంటుందా?

తను చేసిన పాపపుణ్యముల వలన భవములు (పుట్టుకలు) కలిగిన ఈ జీవిని, తోపడ కర్మము (వడ్రంగివాని వలె దూగడ బట్టే కర్మము) దొబ్బేనా (దొబ్బుతుంది కదా!) అంటే... ఆ జీవి తను చేసిన పాపపుణ్యాలవల్లనే జన్మలలో దొబ్బబడతాడు (నెట్టివేయబడతాడు). ఇక వీడిగతి ఇంతేనా? ఏపున (ఎక్కువగా) శ్రీ వేంకటేశ్వరుని శరణమే (శరణాగతిలోనే) పైపయి భజియించి (సులభముగా కీర్తించి) బ్రతికిపోయాను కదా!

సంపుటి : 4 కీర్తన : ఏమి సేయువాఁడ నివి విరసమొకటొకటి

సంఖ్య : 63 పుట : 43 రాగం : శుద్ధవసంతం

## శుద్ధవసంతం

53. ఏమి సేయువాఁడ నివి విరసమొకటొకటి
తామసంబొకవంక తత్వమొకవంక ॥పల్లవి॥

యితరోపాయరాహిత్యుండు గాఁడేని
అతిశయంబగు మోక్ష మది యబ్బదు
సతతోద్యోగానుచరితుండు గాఁడేని
వితతసంసారసుఖవిధి నడవదు ॥ఏమి॥

వివిధేంద్రియ విషయవిముఖుఁడు గాఁడేని
యివల వైష్ణవధర్మమిది యబ్బదు
అవిరళంబగు దేహానుసరణములేక
భవమాత్రమున సుకృతఫలమబ్బదు ॥ఏమి॥

పరమానందసంపన్నుండు గాఁడేని
చరమవిజ్ఞాన నిశ్చలుఁడు గాఁడు
యిరవయిన శ్రీవేంకటేశ యిటువలె నీవు
కరుణించకున్న దుర్గతులచే భ్రమసీ ॥ఏమి॥ 63

**అవతారిక :**

విరసము అంటే వ్యతిరేకము అని అర్థం. "అయ్యో! నా యెదుటనున్నవన్నీ ఒకదానికొకటి విరసములు. ఒకవంక తామస ప్రవృత్తిని ప్రకోపించేదుంటే, ఇంకొక ప్రక్క తత్త్వచింతనకు అవసరమైనదున్నది. ఏమిచేయగలను?" అని వాపోతున్నారు. అన్నమాచార్యులవారు. కరవమంటే కప్పకు కోపం, వదలమంటే పాముకు కోపం అంటారు పెద్దలు. మనకేమో ఈ రెండూ కావాలి. ఇది భ్రమ. జీవితమంతా వ్యతిరేక భావాలను సమన్వయ పరుస్తూనే గడపవలసి





వస్తోంది. ఈ సంసారం వదలదు. వదిలితే కాని మోక్షం రాదు. కానీ భ్రమవల్ల నాకు రెండూ కావాలనిపిస్తుంది. మరి దారేమిటి?

**భావవివరణ:**

ఓ దేవదేవా! నేనేమి చేయగలవాడను? నాయెదుట వున్న ఈ రెండూ ఒకదానికొకటి విరసము (వ్యతిరేకము). ఒకటి తామస ప్రవృత్తిని పెంపొందించేది, మరొకటి తత్త్వచింతనావశ్యకత కలిగినది. (కాని నేను ఈ రెండూ వదులుకోలేను)

నాబోటి సాధకుడు, ఇతరోపాయ రాహిత్యుండు (ధర్మ, అర్థ, కామ, మోక్షములలో ధర్మ అర్థ కామములు అను ఇతరోపాయములను వదలినవాడు) కాడేని (కాకపోతే) అతిశయించిన మోక్షమును పొందలేదు. అయితే... సతతోద్యోగ అనుచరితుండు కాడేని (ఎప్పుడూ ఏదో ఒక వృత్తిని చేబట్టకపోతే), వితత సంసార సుఖవిధి (విరివిగా నుండే సంసార సుఖము పొందు వ్యాపారము)నడువదు. ఈ రెండూ అవసరమే.

వివిధ ఇంద్రియ విషయ విముఖుండు (రకరకములైన ఇంద్రియ భోగములనుండి విరక్తి పొందినవాడు) కాకపోతే వైష్ణవధర్మము ఇటువైపున అలవడదు. దేహముయొక్క ఆదేశములను అనుసరించక జీవనయానం సాగదు. అయితే దేహం కోసమే జీవిస్తే... భవమాత్రమున (కేవలం పుట్టుకచేత) సుకృతఫలము (పుణ్యఫలము) ప్రాప్తించదు.

పరమానం స్థితి వలన సంపన్నుడు కాకపోతే... చరమ విజ్ఞాన నిశ్చయుడు (కడపటిగా ఆవశ్యకమైన విజ్ఞానము (ఆత్మజ్ఞానము) చేత నిశ్చయమనస్కుడు) కాలేడు. అంటే చివరికి ఒకదానికొకటి విరుద్ధమైన ఆవశ్యకతలతో పీడ కలిగింది. శ్రీవేంకటాద్రిపై ఇరవయిన (నెలకొన్న) శ్రీహరీ! ఇటువలె (ఈవిధంగా) నీవు కరుణించకపోతే నేనే దుర్గతులపాలై భ్రమసీ (భ్రమలోనే వుంటాను తండ్రీ!)

సంపుటి : 4 కీర్తన : పొందగు "నాత్మాపుత్రనామ" మను-
సంఖ్య : 62 పుట : 42 రాగం : మాళవిగౌళ

**మాళవిగౌళ**

54. పొందగు "నాత్మాపుత్రనామ"మను-
చందపువేదమె సరి నిలిపితివి ॥పల్లవి॥

పుత్రుఁడు మరుఁడట పుత్రుఁడు బ్రహ్మట నీ-
పుత్రపౌత్రులే భువినెల్లా
పుత్రకామేష్టిని బొడమితి దశరథ-
పుత్రుఁడవై యిది పొగడఁగ నరులు ॥పొంద॥

మనుమఁడు రుద్రుఁడు మనుమఁడు వశిష్టు
మనుమని మనుమలే మహి యెల్లా
మనుమఁడవై యదితిమాన్యగర్భమున
జననమందితివి జగమున కరుదు ॥పొంద॥

యిదె నీగోత్రంబీచరాచరం-
బెదుట మెరసె నిదె యిహమెల్లా
కదిసిటు శ్రీవేంకటగోత్రంబున
నుదయించి మెరసితో హరి నీవు ॥పొంద॥ 62

**అవతారిక :**

"ఆత్మావైపుత్రనామాసి" - అనునది వేదవాక్యము. ఆత్మ తానే తన పుత్రునిగా వుంటుంది. అని దాని అర్థం. అట్లను నట్టి వేదమునే నీవు చక్కగా పొందుగా నిలిపావు ప్రభూ! అని ఈ పల్లవికి అర్థం. అన్నమాచార్యులవారి కీర్తనలలో గీత, వేదవాక్యం, సామెతలు గుప్పించటం పరిపాటే. ఈ కీర్తన ప్రత్యేకత యేమంటే అన్నమయ్య పదగుంభనం. అన్నమయ్య కీర్తనలు నేర్చుకొనే చిన్నపిల్లలు దీని అర్థం చెప్పుతాతయ్యా అని అడిగితే నాబోటి తాతయ్యలు తాధయ్యాని నృత్యం చేయాల్సిందేనేమో."





కదిసిటు శ్రీవేంకటగోత్రంబున నుదయించి మెరసితో హరి నీవు" - అంటే స్వామి పుట్టిన గోత్రం శ్రీవేంకట అనికాదు. మరేమిటో!!

**భావవివరణ:**

స్వామీ పొందు అగు (చక్కనైన) "ఆత్మావైపుత్రనామాసి" (ఆత్మయే తన పుత్రునిగా వుండును) అనునట్టి వేదవాక్యమును సరిగా నిలిపితివి. ఆ చందమును వివరింతును. ఆలకింపుము.

నీ పుత్రుడొకడు మరుడట (మన్మథుడట). ఇంకొక పుత్రుడు బ్రహ్మదేవుడట. ఈ భూమినిండా ఎవడు పుట్టినా వీరిద్దరివల్లనే కదా! అంతా నీ కొడుకులు, మనుమళ్ళే కదా! అట్లాంటి నీవు దశరథమహారాజు పుత్రకామేష్టి యాగం చేస్తే పొడమితివి (జన్మించావా?) నిన్ను జనులందరూ తమ రక్షకుడని కీర్తించారా? ఎంత విచిత్రం!

ప్రభూ! రుద్రుడు (శివుడు) నీ మనుమడు (దిక్పాలకులను సృష్టించి నియమించింది బ్రహ్మదేవుడే కదా! ఈశాన్య దిక్కునకు పాలకుడైన రుద్రుడు మరి నీ మనుమడే కదా!) వశిష్ఠుడు మునులందరిలో అగ్రగణ్యుడు. ప్రపంచంలో రుద్రుడు సృష్టించిన రుద్రగణాలు, వశిష్ఠుని సంతతియైన మునిగణాలు, వారి సంతానం చూడబోతే అంతా నీమనుమలు, మునిమనమలే కదా! ఇక్కడొక తమాషా యేమంటే... కశ్యపు జాపతి నీ మనుమడు.... అదితి ఆయన భార్య నీవేమో ఆమె తపస్సుకు మెచ్చి ఆమెకు 'వామను'డనే పుత్రునిగా పుట్టావు. అంటే నీవే నీ మనుమనిగా నీ కోడలికి పుట్టావా? ఏమి విచిత్రం!!

అందువలననే ఈ చరాచర విశ్వమంతా నీ గోత్రమే (వంశమే). ఈ ఇహలోకమంతా ఈ విధంగా నీ యెదుటనే మెరసీ (విస్తరించినది). ఇటు (ఈవిధంగా) కదిసి (మమ్ము సమీపించి) శ్రీవేంకట గోత్రంబున (కొండ మీద) ఓశ్రీహరీ నీవు వుదయించి (పొడచూపి) మెరసితివి శోభతో వెలుగులను చిమ్మినావు.

సంపుటి : 4 కీర్తన : ఓహెూ వొడలుమాని (మా వొడలు నీ?) వోపికె గడుమేలు

సంఖ్య : 41 పుట : 28 రాగం : దేవగాంధారి

### దేవగాంధారి

55. ఓహెూ వొడలుమాని (మా వొడలు నీ?) వోపికె గడుమేలు
యీహల నీవుపకారమేమని నుతింతు ॥పల్లవి॥

పుట్టినచోటంటినా అది భూతములనెలవు
నెట్టన మూసిన మేను నిఖిల హేయమయము
యిట్టి నా యాతుమలోన హరి యెట్టుంటివి నీవు
అట్టె నీ చేఁతలు దలఁచి అరుదయ్యీ నాకు ॥ఓహెూ॥

మించుల మనసంటిమా అది మిగులఁ జంచలంబు
పంచల నా సంపదలు పాపపుణ్య విధులు
యెంచఁగా యిటువంటి నన్ను యెట్టు ధరియించితి
నించిన నీ చేఁతలు విని నివ్వెరగయ్యీని ॥ఓహెూ॥

పాయ మిది యంటిమా పంచేంద్రియముల వశము
ఆయము నా కంటిమా అది అయిదు భూతముల మొరఁగు
యీయెడ శ్రీవేంకటేశ యీడా యెట్టేలితి నన్ను
మాయల నీశరణంబిందుకే మనసయ్యీ నాకు ॥ఓహెూ॥ 41

**అవతారిక :**

ఈ కీర్తనలో "ఓహెూ వొడలు మాని వోపికె గడుమేలు" అనే పల్లవే ఒక పట్టాన అర్థం కాదు. పెద్దలు దానిని విశ్లేషించి "ఓహెూ మా వొడలు నీ వోపికె గడుమేలు" అని విశ్లేషించారు. అప్పుడు అన్నమాచార్యులవారి భావం అంతుచిక్కింది. "ఓహెూ దేవదేవా! మా ఈ శరీరం నీ క్షమవల్ల మాకు ఎంతో వుపకారంగా దొరికింది. ఈ విధంగా నీ వుపకారం ఏమని పొగడను స్వామీ!" - అని ఈ పల్లవికి అర్థం. దీనికే ఇన్ని తిప్పలు పడితే మిగతా చరణాల మాటేమిటి? జాగ్రత్తగా పరిశీలించండి.





**భావవివరణ:**

ఓహెూ! దేవదేవా! ఈ మా వొడలు (శరీరము) నీ వోపికె. (నీ క్షమవలన మాకు లభించింది). అది మాకు గడుమేలు (గొప్ప ఉపకారము). ఈ నీవుపకారాన్ని నేను ఏమని కీర్తించను ప్రభూ!

నాదెంత అధోగతియో చూడు ప్రభూ! నా పుట్టినచోటు చూద్దామా అంటే అది భూతములు వుండేచోటు. నన్ను ఎందులో మూసి వుంచావు? అన్ని విధాలా హేయము (అసహ్యకరమైన) మేనిలో (శరీరంలో). ఇంత అసహ్యకరమైన దీంట్లో ఆత్మారాముడవై, నీవెట్టా వున్నావయ్యా! ఓ శ్రీహరీ! నీ చేతలు (లీలలు) నాకు తలచన్ అరుదయ్యీ (అద్భుతంగా వున్నాయి) స్వామీ!

పోనీ, శరీరం దేముంది... మనస్సు దానికంటే మించినది వున్నది కదా! అనుకోవటానికి కూడా వీలులేదు. ఆ మనస్సు చంచలమైనది. ఇక నా పంచల (తోడువున్న) సంపదలు ఏమిటయ్యా అంటే నా పాపపుణ్యాల విధులు... నేను గడించిన నా సిరిసంపదలు. ఒక్కసారి ఆలోచిస్తే... ఇంత నీచాతినీచుడైన నన్ను నీవెట్లా ధరించితివి (దాల్చితివి? నీ చేతలను వింటే గొప్ప ఆశ్చర్యం కలుగుతున్నది స్వామీ!

సరే, నా పాయము (ఆయుర్దాయం) గురించి ఎంత తక్కువ చెబితే అంత మంచిది. అది పంచేంద్రియముల దయాదాక్షిణ్యాలపై ఆధారపడింది. ఇక నా ఆయము (ఆర్జన) చూద్దామా అంటే అది పంచభూతముల మొరగు. అనగా పంచభూతములచే వంచించబడినది. ఎందుకంటే నేను ఎప్పుడూ పంచభూతాల అధీనుణ్ణే కదా! ఇటువంటప్పుడు ఓ శ్రీవేంకటేశ్వరా! అక్కడ (దివిలో సరే,)... యీడా (ఈ భూమిమీద కూడా) ఎట్లా మాయల నన్ను పరిపాలిస్తున్నావయ్యా! అందుకే నీకు శరణుజొచ్చితిని.

సంపుటి : 4　　కీర్తన : కోటికి బడగయెత్తి కొంకనేల

సంఖ్య : 40　　పుట : 27　　రాగం : గుండక్రియ

## గుండక్రియ

56. కోటికిc బడగయెత్తి కొంకనేల
యీటులేని పదమెక్కి యిcకనేల చింత　　॥పల్లవి॥

పెట్టినది నొసలను పెద్ద పెద్ద తిరుమణి
కట్టినది మొలc జిన్నకొపీనము
పట్టినది శ్రీహరిపాదపద్మమూలము
యెట్టయినా మాకు మేలే యిcకనేల చింత　　॥కోటి॥

చిక్కి నా లోనైనది శ్రీవైష్ణవధర్మము
తొక్కినది భవముల తుదిపదము
యెక్కినది హరిభక్తి యిది పట్టపేనుcగ
యెక్కువ కెక్కువే కాక యిcక నేల చింత　　॥కోటి॥

చిత్తములో నిండినది శ్రీపతి రూపము
హత్తినది వైరాగ్య మాత్మ ధనము
యెత్తల జూచిన మాకు నిదివో శ్రీవేంకటేశుc-
డెత్తి మమ్ము గావగాను యికనేల చింత　　॥కోటి॥ 40

**అవతారిక :**

"కొంకుట" అంటే సంకోచముతో భయపడటం. కోటికి పడగలెత్తుట అంటే కోటీశ్వరుడగుట. కోటీశ్వరుడైనవాడు జంకుటెందులకు? ఈటులేని (వ్యర్థముకాని) స్థానమును పొంది ఇంకా దిగులెందుకు - అంటున్నారు అన్నమాచార్యులవారు. ఎక్కడ జూచినా మాకు శ్రీవేంకటేశ్వరుడే మమ్ము యెత్తి గావగాను, ఇక చింతయేల? అంటున్నారు. శ్రీవైష్ణవంలో అత్యంత ప్రధానమైనది హరిశరణాగతి. హరి భక్తి... హరిచింత.... హరి శరణాగతి





వుంటే గాని విరక్తుడు కాలేదు. అవేవీ లేకుండా మోక్షం ఎలా వస్తుంది? ఇంతకీ... ఇక్కడ కోట్లకు పడగలెత్తటం అంటే సంచులనిండా ధనం వుండటం కాదు. మరి...

**భావవివరణ:**

ఓ ప్రజలారా! కోటికి బడగయెత్తి (గొప్ప కోటీశ్వరుడై) కొంకనేల (భయంతో సంకోచించుట యెందులకు?) శ్రీహరి శరణాగతిని పొంది కోట్ల కొలదీ పుణ్యం సంపాదించినవాడు జంకుటెందులకు? అని భావము. ఈటులేని పదమెక్కి (వ్యర్థముకాని ఉన్నతస్థానమును బొంది), ఇంకా దిగులెందుకు?

ఇక మా గురించి చెప్పాలంటే... మేము నొసల (నుదుటి మీద) పెట్టుకొన్నది పెద్ద పెద్ద తిరుమణి (పెద్దగా నున్న పంగనామాలు). మొలన్ కట్టినది చిన్న కొపీనము (మొలకు కట్టుకొన్నది... చిన్న గోచీ). ఆపైన పట్టుకొన్నది శ్రీహరి పాద పద్మములు. మాకు ఎట్లా జరిగినా మేలే. మరి ఇంకా విచారం ఎందుకు?

నాకు చిక్కి, నా స్వంతమైనది ఈ శ్రీవైష్ణవ ధర్మము. తొక్కినది భవముల తుదిపదము (అనేక పుట్టుకల చిట్టు చివరి పదము (స్థానము) పై అడుగుపెట్టాను. ఇది పట్టపుయేనుగు వంటి హరిభక్తి. దీనిపై నెక్కితిని. ఇది ఎక్కువకే యెక్కువ (సర్వోన్నతము) అయిన స్థానము. ఇక దిగులెందుకు?

నా చిత్తము శ్రీహరి రూపముతో నిండిపోయినది. ఆత్మలో వైరాగ్యము అనే ధనము హత్తినది. (కలిగినది). మాకు యెత్తల జూచినా (ఎక్కడ జూచినా) ఇదిగో ఈ శ్రీవేంకటేశ్వరుడే కనబడుచున్నాడు. ఆయన యెత్తి (ఎత్తుకొని) మమ్మల్ని రక్షిస్తుంటే ఇంకా దిగులెందుకయ్యా! మాకే విచారమూ లేదు. మేము హరిదాసులము.

సంపుటి : 4 కీర్తన : తెలియుట యెన్నఁడు దేహి తనంతట

సంఖ్య : 70 పుట : 47 రాగం : బౌళి

**బౌళి**

57. తెలియుట యెన్నఁడు దేహి తనంతట
తెలియఁగ హరి నిదిక్కే కలది ॥పల్లవి॥

రాపుగ రేపే మూత్రపురీషంబులు
ఆపై నాఁకటియలమటలు
కైపుగ నింతటఁ గామవికారము
మాపు నిద్దురలమంపులె కలది ॥తెలి॥

కొన్నాళ్లు బాల్యము కొన్నాళ్లు కౌమార-
మన్నిటఁ గొన్నాళ్లు యౌవ్వనము
పన్నిన ముదిమియుఁ బైపైఁ గొన్నాళ్లు
వున్నతి నంతట నుడుగుట కలది ॥తెలి॥

జంతువులకు యీ సరవులు నీవే
పొంతలఁ గల్పించి పొదిపితివి
యింతట శ్రీవేంకటేశ్వర నీకృప
చింతించి కావవే చేకొని నన్ను ॥తెలి॥ 70

**అవతారిక :**

దేహి అనగా దేహమును ధరించిన జీవుడు. వీడి చేతనయే పరమాత్మ సిద్ధి. ఆ చేతన పోయిన మరుక్షణం వాడిని 'చనిపోయాడంటున్నాం'. మరి ఈ దేహంలోంచి ఆ దేహి 'చని' పోగానే ఇంత వరకు ఒక పేరుతో పిలిచిన వాళ్ళు వాడి తోలు శరీరాన్ని శవం అంటున్నాం. ఇది వరకు గానీ, చనిపోయిన తరువాతగానీ వీడు దేహియేఅని ఈతోలు తిత్తికాదు. వీడు ఇంకో తోలు తిత్తిని వెదకి కొని దాంట్లో దూరేవాడే కానీ నూరేళ్ళు దాటి దాంట్లో వుండడు. ఇది వాడు తనంతట తను తెలిసికొనుట యెన్నడూ





జరుగదు. ఏదోనాడు శ్రీహరి దయకలిగితేనే వాడికి తెలుస్తుంది. నీ దిక్కే (శరణమే) వాడికి ఆ జ్ఞానం కలిగిస్తుంది అంటున్నారు అన్నమాచార్యులవారు ఆ పరమాత్మతో

**భావవివరణ:**

మానవుడు అయిన దేహి (జీవుడు) తనంతట తాను, ఆత్మ తత్త్వాన్ని తెలియుట యెన్నడు సాధ్యపడుతుంది? ఓ శ్రీహరీ! ఇది తెలియగ నీ దిక్కే (శరణమే) కలది (వాడికి కలిగే ధన్యత), అదిలేక వాడెన్నడూ తెలియలేడు.

ఈ శరీరంలో దూరినంతనే ఈ దేహికి కలది (అబ్బినది) యేమిటి? రాపుగరేపు (ఆగకుండా ఒరిపిడి కలిగించే) మలమూత్రంబులు, ఆపైన ఆకలి దప్పికల అలమటలు (ఆవేదనలు), కైపు (వివశత్వం) కలిగించే కామ వికారములు, రాత్రికాంగానే నిద్దురలు, ఆ నిద్దురలలో మంపులు (మైకములు) కలదే ఈ దేహి.

సరే, ఈ దేహి ఈ దేహంలో ఎన్నాళ్ళని వుంటాడు? కొన్నాళ్ళు బాల్యము, కొన్నాళ్లు కౌమారము, అన్నిట (అందులోనే) యౌవనము కొన్నాళ్ళుంటుంది. పైపైనబడి బాధించే ముదిమి (ముసలితనం) కొన్నాళ్ళు పన్నినట్లు వుంటుంది. ఈ బాధలతో వాడికి వున్న ఆ కొద్దిపాటి ఉన్నతి కూడా, ఉడుగుట (నశించుట) కలది (జరుగుతుంది). ఎందుకంటే ఆ ముసలితనం యాతన భరించలేక దైవదూషణ చేస్తూనే వుంటాడు కదా!

ఓ శ్రీవేంకటేశ్వరా! జంతువులకు (జ్ఞానం లేక ఆహార, నిద్రా, భయ, మైధునాల కోసమే జీవించే ఈ మానవ మృగాలకు) యీ సరవులు (పద్ధతులు) నీవే కల్పించి, పొంతల పొదిపితివి (సమీపించి వుద్ధరించితివి). ఓ దేవదేవా! ఇంతట (ఇక) చింతించి (నా గురించి కాస్త ఆలోచించి) నన్ను చేకొని (చేరదీసి), నీ కృపన్ (నీ దయతో) కావవే (రక్షించవయ్యా! నా తండ్రీ!)

సంపుటి : 4    కీర్తన : ఔలే నే నొకపనికి నవుదు నీకును

సంఖ్య : 23    పుట : 16    రాగం : మంగళకౌశిక

**మంగళకౌశిక**

58. ఔలే నే నొకపనికి నవుదు నీకును
కూళలలో నెంచి చూడ గురి యవుదును ॥పల్లవి॥

పసురమువంటివాఁడ పాపపుబందెలు దెత్తు
శిసువువంటివాఁడ సిగ్గు నెగ్గు నెరఁగ
వసుధలో రాయివంటివాఁడను దయదలఁచ
యెసఁగ నన్నేరీతి నీ వేలితివి దైవమా ॥ఔలే॥

మాఁకువంటివాఁడ నే మతి లేదు; పుచ్చిన-
పోఁకవంటివాఁడ నెప్పుడు కొరగాను
రోఁకలివంటివాఁడ రోటిలోని పోట్లకు
యేఁకట నన్నెటువలె నేలితివి దైవమా ॥ఔలే॥

పామువంటివాఁడ నే పట్టినవారిఁ గరతు
గామువంటివాఁడ లోకమువారిఁ బీడింతు
నేమపు శ్రీవేంకటేశ నీవు నన్ను బంటంటా-
నేమిటికి గృపతోడ నేలితివి దైవమా ॥ఔలే॥ 23

**అవతారిక :**

'ఔలే' అంటే నేటి కాలంలో "ఔనులే" – అన్నమాట. 'కూళుదు' అంటే కుత్సితబుద్ధి కలవాడు అని అర్థం. "గురియవుదు" అంటే గురును (అధికుడను) అవుదునని అర్థం. "ఔనులే స్వామీ! నీకు ఒక పనిలో నేను అత్యధికుణ్ణి అయి తీరుతాను. నిన్ను ఆశ్రయించిన వారిలో కుత్సితులు కూడా వుంటారు కదా! నేను అదిగో వాళ్ళందరిలో గురువు వంటివాడను. అందుకోసమైనా నన్ను అనుగ్రహించవయ్యా!" – అంటున్నారు అన్నమాచార్యులవారు. భగవత్సన్నుతిలో నిందాస్తుతి కొందరు





యెంచుకుంటే... ఆత్మనిందాస్తుతి కొందరెంచుకున్నారు. నేను ఒట్టి పనికిమాలిన వాణ్ణి, నీచుణ్ణి – అయినా సరే నీకు నన్ను కరుణించక తప్పదుగాక తప్పదు, అంటున్నారు.

**భావవివరణ:**

ఔనులే స్వామీ! నీకు ఒక్కపనిలో అత్యధికుణ్ణి అయితీరుతాను. నిన్ను ఆశ్రయించిన వారిలో కూళులు (కుత్సితబుద్ధి కలవారు) వుంటారు కదా! వాళ్ళందరిలో నేనే గురుడిని. ఆ విధంగానైనా వీడు యెంచదగ్గవాడని నీవనుకుంటే నాకదే పదివేలు.

నేను యెట్లాంటివాడినో చెబుతాను విను. పశురము (పశువు) వంటివాడను. పాపము అనే బందెల దొడ్డిలో వున్నాను. చిన్ని శిశువు వంటివాడను అందుకని సిగ్గూయెగ్గూ నాకు లేనేలేవు. భూమిలో రాయివంటివాడను. నాకు దయాదాక్షిణ్యాలు లేనేలేవు. ఓ దైవమా! నన్నేవిధంగా యేలావు ప్రభూ !

నేను వృక్షమువంటివాడను. మతిలేదు. నేనూ పెరుగుతాను, నీరూ గాలి సూర్యకాంతి ఆహారంగా తీసికొంటాను. పశువులు కదిలి శత్రువునుంచి తప్పించుకొంటే, నేనది కూడా చేయలేను, ఎందుకంటే నాకు మతికూడా లేదు కదా! నేను పోక (వక్క) వంటి వాడను. అందులోనూ పుచ్చిన వక్కను. దేనికీ కొరగాను (దక్షిణ ఇయ్యటానికి కూడా ఉపయోగపడను) నేను రోకలి వంటివాడను. రోటిలో పోట్లకు (దెబ్బలకు) ఏకటను (ఆపేక్ష కలవాడను). ఓ దైవమా! నన్నెట్లా యేలితివి (పరిపాలించావు) స్వామీ!

ఇంతేకాదు, నాకు ఇంకో దుర్గుణం కూడా వున్నది. నేను పామువంటివాడను. కాపాడినవాడిని కూడా కాటువేసే దుర్మార్గుణ్ణి. నేను 'గాము' (పిశాచం) వంటి వాడిని. లోకములో వుత్తిపుణ్యానికే అమాయకుల్ని పీడిస్తుంటాను. నేమపు (శరణాగత రక్షణా నియమముగల) శ్రీవేంకటేశ్వరా! నీవు నన్ను బంటంటా (వీడు నా బంటులే పోనీ అని) ఏమిటికి (ఎందుకు) కృపన్ యేలితివి? ఓ దైవమా! అందుకే నేనూ తరించాను తండ్రీ!

సంపుటి : 4 కీర్తన : హరినీవు మాలోన నడు(డ)గుటరుదు గాక

సంఖ్య : 39 పుట : 26 రాగం : ధన్యాసి

**ధన్యాసి**

59\. హరి నీవు మాలోన నడు(డ)గుటరుదుగాక
శరణు నీకునే జయమందుటరుదా ॥పల్లవి॥

పాపపుణ్యలంపటమైనది మేను
కూపపు యోనులఁ గుంగేటిది మేను
దీపనాగ్నిగలదిష్టము యీమేను
మోపు మోచిన నేము మునిగేది యరుదా ॥హరి॥

పొలసి పొద్దొకచాయఁ బొరలేటి మనసు
కొలఁదిలేని యాసఁ గుదురైన మనసు
మలసి సంసారమేమరిగిన మనసు
కలనేము, తిమ్మటలు గైకొనేది యరుదా ॥హరి॥

పెనచి యంద్రియములఁ బేఁడినభవము
పనివడి చింతలకే పాలైనభవము
యెనలేని శ్రీవేంకటేశ నీకే శరణని
మనెఁగాన యిఁక మీఁద మంచిదౌటరుదా ॥హరి॥ 39

**అవతారిక :**

ఓ శ్రీహరీ! నీవుమాలోనే నెలకొని వున్నావనుట అరుదైన విషయమా? నీకు శరణాగతులమై మేము జయములను పొందుట అరుదైన విసయమా? మాకు ఈ మేను, మా మనస్సు, మా భవము (జన్మ) నీవిచ్చినవే కదా! ఈ మేను మోచిన మేము ములిగేది అరుదా? ఈ మనస్సు కలిగిన మేము తిమ్మటలు గైకొనుట అరుదా? ఈ భవము (జన్మ, పుట్టుక) ఇంద్రియముల వశమై చింతల పాలైనది. మరి ఇటువంటి





పరిస్థితిలో శ్రీవేంకటేశ్వరుడే దిక్కు అనగలిగితే, అప్పుడు అంతా మంచియే జరుగుతుంది అంటున్నారు అన్నమాచార్యులవారు. కొన్ని మాటలకు నిఘంటువుల్లో కూడా అర్థం దొరకలేదంటే నమ్మండి.

**భావవివరణ:**

ఓ శ్రీహరీ! నీవు లోనన్ (మాలోపలనే) అడగుట (వశించియుండుట) అరుదా (ఆశ్చర్యమా?) నిన్ను ఒక్కసారి శరణుజొచ్చిన పిదప జీవితంలో జయమును పొందుట అరుదా? నిన్ను శరణన్న వారికి అన్నీ జయాలే.

ఈ మేను (శరీరము) పాపపుణ్యాల లంపటము వలన కలిగినది. రకరకములైన యోని కూపములలో బడి కుంగేటిది (దిగబడిపోయినది). అయినప్పటికీ దీనిలోగల దీపనాగ్ని (వివేకమనే జ్యోతి చేత) దిష్టము (ఉపదేశించబడుతుంటుంది.) ఎందుకంటే ఈ మేను మాకు నీ కృపచే కలిగినది కదా! ఇటువంటి ఈ మేనుకు మోచిన (దరించిన)మేము ములిగేది (ఆశాపాశమున చిక్కుట) అరుదా (ఆశ్చర్యమేముంది) ప్రభూ!

ఇక నామనస్సు నామేనుకంటే ఒక ఆకు ఎక్కువే చదివింది. అది, పొద్దొక చాయన్ (పూటకొక విధముగా) పొలసి (సంచరించి) పొరలేటిది (ప్రవర్తిస్తుంటుంది). దీనికి కొలదిలేని (అంతులేని) ఆశ కుదురైనది (తోడైనది). అందుకని ఈ మనసు సంసారమును (ప్రాపంచిక విషయములను) మరిగింది. ఇట్టి మనస్సు కల నేము (కలిగిన మేము) తిమ్మటలు (కోతి వికారములను) ఒందుటలో ఆశ్చర్యమేమున్నది స్వామీ!

ఇక నా భవము (జన్మ) నా ఇంద్రియములు బాగా పెనచి పేఁడినందువలన (పెనవేసుకొని పేనినందుచేత) కలిగినది. అందువలన పనివేళా ఇది అనేక చింతలకు పాలైపోయినది. ఎనలేని (అంచనావేయలేని) ఓ శ్రీవేంకటేశ్వరా! నా అదృష్టం కొద్ది నీకు శరణు అని నా భవము మనెన్ (ధన్యమైనది.) కావున ఇక మీద ఇది మంచిది అవుట అరుదా (ఆశ్చర్యమా?) తండ్రీ!

సంపుటి : 4    కీర్తన : బాపురే నీమాయ భ్రమయించీ జీవులకు

సంఖ్య : 257    పుట : 172    రాగం : గౌళ

### గౌళ

60. బాపురే నీమాయ భ్రమయించీ జీవులకు
దాపున నున్నదేకాని దవ్వలకుఁ జొరదు ॥పల్లవి॥

మోక్షమురుచి గానదు ముందర నుండఁగాను
సాక్షియై జగమిది చవి చూపఁగా
దీక్షకుఁ జొరదు మరి దేవ నీపై భక్తి లేదు
దక్షులై యాలుబిడ్డలు దండనుండఁగాను ॥బాపు॥

జ్ఞానమితవు గాదు సంగడి నుండదుగాన
నానాయోనులమేను ననిచుండఁగా
ఆనకమై వైరాగ్యమంట దలవాటులేక
కానఁబడ కర్మములు గాసిఁబెట్టఁగాను ॥బాపు॥

మంచిదని నీ తిరుమంత్రము దలఁచుకోదు
పంచేంద్రియములాత్మ బలిశుండఁగా
యెంచుకొని శ్రీవేంకటేశ నీకే శరణని
అంచల నీదాసులైతే నన్నిటా గెలిచిరి ॥బాపు॥ 257

**అవతారిక :**

"అయ్యబాబోయ్! నీమాయ నాబోటి జీవులను ఎంత భ్రమలో ముంచుతున్నది ప్రభూ! అది (మాయ) మాదగ్గరనే అంటిపెట్టుకొని వుంటుంది. కాని దూరంగా పోదు" – అంటున్నారు అన్నమయ్య. దాని మూలంగానే దీక్షతో నీపై భక్తి కుదరదు ఎందుకంటే మేము దక్షులం (సమర్థులం) అని భార్యా బిడ్డల దండనే వుండి వెంపర్లాడుతూనే వుంటాం. ఎంచుకొని ఏదో ఒక రోజున ఏడుకొండల వాడే ఏలిక అని ఎఱుక కలుగుతుంది. అప్పుడు ఆయన దాసులమైతే ఆయన మాయను





గెలువగలుగుతారు. అందాక శ్లేష్మంలో పడ్డ ఈగలాగ కొట్టుమిట్టాడుతూనే చస్తూ బ్రతుకుతుంటారు.

**భావవివరణ:**

ఓ దేవదేవా! నీ మాయ నాబోటి జీవులను ఎంత భ్రమింపచేస్తున్నది!! బాపురే (అయ్యబాబోయ్). అది దాపునే వున్నది (మా సమీపంలోనే వుంటుంది). దవ్వలకు జొరదు (దూరంగా పోదు).

ఈ జీవివున్న జగము (ప్రపంచము) చలిచూపగా (చాలాబాగుంది అనిపిస్తుంటుంది.) అప్పుడు నీమాయ సాక్షివలె మాముందరనే వుంటుంది. మోక్షము రుచిగానదు (హాయిగా సుఖాలనుభవించక ఈ మోక్షం దేనికిరా– అనిపిస్తుంటుంది). ఓ దేవా! దక్షులై (సమర్థులై) భార్యాబిడ్డల, దండ (దగ్గర) వున్నంతకాలమూ మా సమర్థత నిరూపించుకోవటానికి అడ్డమైన పనులు చేస్తాంగాని, దీక్షకు జొరదు (మనస్సు దీక్షతో నిలవదు). మరి, నీపై భక్తి ఎలా కలుగుతుంది? లేనేలేదు.

సంగడినుండగా (సంగత్వంతో జీవించినంత కాలమూ) ఋణానుమంధాలు కలిగి అనేకమైన యోనికూపములలో బడి ఏదో ఒక శరీరంతో దానిపై ననిచుండవలెను (ఆ శరీరంపై అనురాగంతో జీవించాల్సి వస్తుంది). జ్ఞానము (ఆత్మజ్ఞానము) ఏమాత్రమూ ఇతవుగాదు (రుచించదు.) కర్మకాండచేత మనస్సు గాసిబెట్టగా (బాధపడుతున్నంతవరకు), ఆనకమై (ఢంకా బజాయించి) వైరాగ్యం అలవడదు గాక అలవడదు.

ప్రభూ! "ఓం నమో వేంకటేశాయ" – అనే నీ తిరుమంత్రము మంచిదని నామనస్సు తలుచుకోనే తలుచుకోదు. నా పంచేంద్రియములు ఆత్మకంటే బలిశున్నంతవరకు ఆ మంత్రము యెలా రుచిస్తుంది? అప్పుడు ఒకనాడు నాపై నీకు కరుణ కలిగి నన్ను యెంచుకున్నావు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీకే శరణని నిన్ను ఆశ్రయించాను. అంచలంచలుగా నీదాసుడనైనాను. నీదాసులు అన్నిటా (ఇహపరములు రెండిటిలోనూ) గెలిచిరి. తండ్రీ! నీదాసుడనైన నాగురించి ఇంకా చెప్పాల్సిన పనేమున్నది?

సంపుటి : 4 కీర్తన : అటుగొన్నాళ్లందాక యిటు గొన్నాళ్లిందాక

సంఖ్య : 227 పుట : 152 రాగం : వరాళి

**వరాళి**

61. అటు గొన్నాళ్లందాఁక యిటు గొన్నాళ్లిందాఁక
కటకటా శునకపుగతియాయఁ గావవే ॥పల్లవి॥

పసిమిఁ బాపమనేటి బందెలు మేసితిని
కసరి దేహపు కట్టుగాడి నుంటిని
కొసరి కర్మపుమెడగుదియ మోఁచితిని
పసురమువంటివాఁడఁ బాలించవే ॥అటు॥

పంచేంద్రియములనేబాడిగె మోఁచితిని
లంచపు సంసారమనే లాడిఁబడితి
పంచల నాసలచేత బందమ (ము) వెట్టించుకొంటి
ముంచినగుఱ్ఱమువంటి మూఢుఁడఁగావవే ॥అటు॥

మరిగి 'యజ్ఞాన' మనేమద మెత్తి తిరిగితి
'మరుఁ'డనేమావటీనిమాయఁ జిక్కితి
గరిమ శ్రీవేంకటేశ కరిఁ గాచితివిగాన
కరి నైతి నన్ను నీవు కరుణించవే ॥అటు॥ 227

**అవతారిక :**

కటకటా! కుక్క బ్రతుకైపోయింది నాది. అటు గొన్నాళ్ళున్నాను. యౌవనమదముతో ఒల్లుపై తెలియలేదు. ఇటుగొన్నాళ్ళున్నాను. వృద్ధాప్యంలో దినదినము గండంగా గడుస్తున్నది. ప్రభూ! నన్ను రక్షించవయ్యా! అని అన్నమాచార్యులవారు ఆవేదన వెలిబుచ్చుతున్నారు. పశువులాగ జీవించాను, మూఢుడిలా ప్రవర్తించాను, మన్మథుడనే మావటివాడి మాయలో జిక్కిన ఏనుగునై ఈనాడు రోధిస్తున్నాను. నీకు కరివరదుడవనే పేరుంది కదా! నన్ను కరుణించరాదా స్వామీ!





అంటున్నారు. ఇది తిరుమలేశుని కూడా కరిగించి వుంటుంది. సిరికిన్ జెప్పక పరుగెత్తుకొచ్చివుంటాడు అన్నమయ్య కోసం...

**భావవివరణ:**

ఓ దేవదేవా! కుక్కకు నీతి నిజాయితీ యేముంటుంది? ఏ ఇంట్లో పడితే ఆ ఇంట్లో దూరి వాళ్ళ ఆహారం తిని, వాళ్ళ చేతిలో రాళ్ళ దెబ్బలు, బూతులూ తింటుంది. నాదికూడా ఆ కుక్క బ్రతుకైపోయింది. అటుగొన్నాళ్ళ దాకా (యౌవనగర్వంతో కామపీడితుడనై కొన్నాళ్ళు) ఇటుగొన్నాళ్ళు (ముసలితనంలో అశక్తుడనై కొన్నాళ్ళు జీవితం వ్యర్థం చేసికొన్నాను. కటకటా! (అయ్యయ్యో) నన్ను కావవే (రక్షించు ప్రభూ!)

స్వామీ! పాపము అనే బందెలదొడ్డిలో పడి, పసిమి (పచ్చనిగడ్డిని) మేసినాను. కసరు (చాపల్యంగల) దేహము అనే కట్టుగాడి (స్తంభానకి కట్టేశారు). చేసిన కర్మ అనే గుదియ (పశువులు పారిపోకుండా కాళ్ళకు అడ్డంపడేలా మెడకు కట్టిన గుదిబండ) మోస్తూనే వున్నాను. నాది పశువు బ్రతుకైపోయింది. నన్ను నీవు పరిపాలించరాదా ప్రభూ!

దేవా! నా పంచేంద్రియములు నాచేత బాడిగెకు (అద్దెకు) తీసుకోబడ్డాయి. ఈ అద్దె కొంపలో యెన్నాళ్ళు వుంటానో నాకే తెలీదు. లంచాలు ఇచ్చిపుచ్చుకొనే సంసారమనే లాడి బడితి (ప్రపంచమనే మోత బరువు) నెత్తిన బెట్టారు. ఆశలు అనే తాళ్ళతో నన్ను కట్టేశారు. గుఱ్ఱము అవివేకంతో, ఇతర జంతువుల్ని చంపించాలని మనిషిని తనపై నెక్కించుకొని చివరికి మనిషికి బానిస అయిపోతుంది కదా! అదే విధంగా నేనూ మూఢుడినై నా ఇంద్రియాలకు లొంగిపోయాను.

ఇంకేముంది? అజ్ఞానం అనే మదమెక్కి, మరిగి మదపుటేనుగు వలె తిరిగాను. మరుడు (మన్మథుడు అనే మావటివాడు సందు చూసికొని నాపైయెక్కి అంకుశంతో పొడిచిపెట్టాడు. వాడి మాయలకు లొంగిపోయి అడ్డమైన పనులు చేస్తున్నాను. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు గజేంద్రునికి మోక్షము నొసగిన శ్రీమన్నారాయణుడవు. ఈ కరిని (ఏనుగును) కూడా కరుణించి ముక్తినీయరాదా తండ్రీ!

సంపుటి : 4 కీర్తన : విత్తొకటి వెట్టగాను వేరొకటి మొలచీనా

సంఖ్య : 186 పుట : 125 రాగం : రామక్రియ

**రామక్రియ**

62. విత్తొకటి వెట్టఁగాను వేరొకటి 1మొలచీనా
హత్తి దేహగుణములు ఆతుమకయ్యీనా ॥పల్లవి॥

చెంది చేఁదుదిన్ననోరు చేఁదేయయివుండుఁగాక
దిందుపడి కొంతైనాఁ దియ్యనుండీనా
బందెల సంసారికి బలు లంపటాలేకాక
అందు హరిఁజేరి సుఖ మందఁ దీరీనా ॥విత్తొ॥

యెంగిలిఁ బుట్టినమేను హేయమే వెదకుఁగాక
చెంగలించి పావనము సేసుకోనీనా
ముంగిటి దేహికిఁ గర్మములు ముంచుకొనుఁగాక
రంగుగ శ్రీపతిఁ గొలిచి రతికెక్కీనా ॥విత్తొ॥

చేతికి వచ్చినసొమ్ము చేరిదాఁచుకొనుఁగాక
యేతులఁ దా నొల్లనంటా యీసడించీనా
యీతల శ్రీవేంకటేశుఁ డిచ్చిన విజ్ఞానము
ఆతుమ సంతసించుఁ గాకందు వెలితున్నదా ॥విత్తొ॥ 186

**అవతారిక :**

“ఆత్మ నిర్గుణస్వరూపమే, కాని దానికి గతజన్మ వాసనలు వుండటం వలన ఈ దేహమును హత్తి (పొంది) దీనిగుణములు ఆత్మకు అవుతున్నాయి. విత్తనం ఒకటి పెడితే చెట్టు వేరొకటి మొలుస్తుందా.”? అంటున్నారు అన్నమయ్య. చిన్న పిల్లాడికి అయినా చేతికొచ్చిన సొమ్ము తనకోసం దాచుకొందామని వుంటుంది కాని మనకిదివద్దు అనే భావము కలుగుతుందా? జన్మ జన్మలకీ ఇలాగే జరుగుతుంటుంది. ఇదిట్లావుండగా





ఆ శ్రీవేంకటేశ్వరుడికి ఈ ఆత్మపై కృప కలిగి విజ్ఞానము (ఆత్మజ్ఞానము) నందిస్తాడు. అట్లా ఇచ్చిన విజ్ఞానంతో ఆత్మ సంతుష్టి చెందుతుంది. అటుగాక అందులో వెలితి వుంటుందా- అంటున్నారు.

**భావవివరణ:**

ఓ మానవులారా! మనం ఏ విత్తనం నాటితే, దాని మొక్క మాత్రమే మొలుస్తుంది. వేఱొక చెట్టు రాదు కదా! ఆత్మ ఒక దేహమును హత్తి (ధరిస్తే) ఆ దేహ గుణములే దానికీ అంటుతాయి. అది సహజం.

ఒకడు వేపగింజ కొఱికాడనుకోండి చేదు, తిన్నవాడి నోరు చేదే అవుతుంది గాని, దిందువడి (దాని గుణం తగ్గించుకొని) తియ్యగామారుతుందా? సంసార బంధనాలలో చిక్కుబడ్డవాడికి అనేక రకములైన లంపటాలు (పీకులాటలు) తగులుకొంటాయి. వాడు నాది, నాకు, నేను అనే ఏడుస్తుంటాడు గాని శ్రీహరిని ఆశ్రయించి సుఖంగా దీరీనా (తీరివుంటాడా?) ఏనాటికీ వుండడు.

హేయమైన (అసహ్యకరమైన) యెంగిలి కామవాంఛ వలన ఈ దేహము పుట్టింది. మరి, ఇది కూడా ఆ యెంగిలి బ్రతుకునే కోరుకుంటుందికాని, చెంగలించి (అతిశయించి) తనని తాను పావనము చేసికోవటం జరుగుతుందా? ముంగిటి (ముందరవున్న) దేహికి (ఆత్మకు) కర్మబంధనాలు తగులుకొంటాయి కాని, శోభాయమానంగా శ్రీపతిని కొలిచి తరించటం అనేది జరుగుతుందా?

ఎవరికన్నా చేతికి కొంతసొమ్ము అందితే, వెంటనే జాగ్రత్తగా దాచుకొంటాడు గానీ, ఏతుల (సగర్వంగా) నాకు వద్దని యీసడించుకొంటాడా? ఏనాటికీ అట్లా జరుగదు. కానీ శ్రీవేంకటేశ్వరుని కృప కలిగి ఆత్మజ్ఞానం ఇస్తే... ఆ విజ్ఞానంతో ఈ ఆత్మ సంతుష్టి చెంది జ్ఞాని అవుతుంది. అటుగాక... అందులో వెలితి (కొఱత) వుంటుందా?

సంపుటి : 4 కీర్తన : మాకు నేమీ బనిగాదు మరి యేమిగలిగినా
సంఖ్య : 245 పుట : 164 రాగం : ఆహిరి

**ఆహిరి**

63. మాకు నేమీఁ బనిగాదు మరి యేమిగలిగినా
శ్రీకాంతు నడుగరో చిత్రగుప్తులాల ॥పల్లవి॥

ధరణీశుపసులకుఁ దగు బందె లేదట
హరిదాసులకుఁ బాపమంటునా మరి
సరిఁ జక్రపుడాగు లిచ్చుటఁ జూచుకోరో మీరు
ఆరసి మీఁదటిమాట లాతని నడుగరో ॥మాకు॥

లావరిమన్ననపాత్రులకు వెట్టి లేదన
కావింప వైష్ణవులకుఁ గర్మమున్నదా
దేవునిలాంచన మిదె తిరుమణి చూచుకోరో
ఆవల నేమిగల్లాను ఆతని నడుగరో ॥మాకు॥

సతి రాణివాసమైతే జాతికులమెంచరట
హితశరణాగతులకేది జాతి
తతి శ్రీవేంకటపతిదాస్య మిది చూచుకోరో
యితవై మరేమిగల్లా నీతని నడుగరో ॥మాకు॥ 245

**అవతారిక :**

మానవులంతా మరణానంతరం యమధర్మరాజు దర్బారులో చిత్రగుప్తుడి ముందు నిలబడతారనీ అప్పుడాయన వారిని ప్రశ్నించి వారి నేరాల ప్రకారం శిక్ష వేస్తాడని ప్రతీతి. అయితే విష్ణుసేవకు జీవితాన్ని కైంకర్యం చేసిన హరిదాసులని ఎవ్వరూ ఏమీచేయలేరు. ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు చిత్రగుప్తుడితో, పోవయ్యా.. పోయి మా శ్రీహరిని అడుగు నీతో మాకేమీ పనిలేదు. మేము చేస్తున్నది శ్రీవేంకటపతి దాస్యము. మరేమన్నా వుంటే





ఈయన్ని అడుక్కోవయ్యా! ఆ లెక్కలేవో మీరూ మీరూ చూచుకోరో... అని దబాయిస్తున్నారు. మరే ఇతర కవికైనా ఇటువంటి చమత్కారం సాధ్యమా!! ఇది చదవండి... ఆనందం జుర్రుకోండి.

**భావవివరణ:**

ఓ చిత్రగుప్తులారా! దీంతో మాకు నేమీ పనిగాదు (పనిలేదు). మరి ఏమన్నా వుంటే ఆ శ్రీహరిని అడుగరో (అడుక్కోవయ్యా)!

నీకొక సంగతి తెలుసునా? రాజుగారి గొడ్లను బందెల (బందెలదొడ్డిలో) పెట్టటానికి వీలులేదు. మరి మేము హరిదాసులం, మాకు పాపం యెట్లా వుంటుంది? ఇదిగో మాకు భుజకీర్తులవలె ముద్రింపబడిన శంఖు చక్రాలను చూశారా.... వీటిని చూచుకోవయ్యా! వీటిని అరసి (చూశాక) ఆపైమాట మాట్లాడుకో... అదీ నాతో కాదు, పోయి ఆ శ్రీహరితోనే మాట్లాడుకో. నీతో మాకేమి పనివుంది?

లావరిమన్నన పాత్రులకు (అందరికంటె బలాఢ్యుడైన మొనగాడి స్వంతమనుష్యులకు) వెట్టిలేదట, (వెట్టి చాకిరీ చేసే అవసరం లేనేలేదట). ఇదిగో మేము వైష్ణవులం. మాకు కర్మబంధం అడ్డురాదు. మాకు కామమే లేకపోతే కర్మబంధం ఎలా వుంటుంది. మానుదుటనున్న ఈ దేవుని లాంఛనము తిరుమణి (పంగనామాలు) చూసుకోవయ్యా! ఆవలన్ (ఆ తరువాత) ఏమిగల్లా (ఏమన్నావుంటే) పోయి ఆతని (ఆ శ్రీహరిని) అడుగరో.

సతి (ఎవరన్నా స్త్రీ) రాణివాసము (రాణిగారి కొలువులో వుంటే... దాని జాతి కులము ఏమిటని యెవ్వరూ అడుగరట. హితుడైన శ్రీపతి శరణాగతులకు జాతేమిటి? తతి (సమర్థుడైన) శ్రీవేంకటపతి దాస్యము చేసే శరణాగతులము. ఇది చూచుకోరో... (ఓ చిత్రగుప్తా! ఇది చూసుకోవయ్యా! యితవై (హితకరమై) మరేదన్నావుంటే... పోయి మా వేంకటేశ్వరుని అడుక్కోవయ్యా! మా జోలికి రాకు.

సంపుటి : 4    కీర్తన : చెప్పబోతే యీ యర్థము చిత్తము వొడబడదు

సంఖ్య : 270    పుట : 181    రాగం : శంకరాభరణం

**శంకరాభరణం**

64. చెప్పఁబోతే యీ యర్థము చిత్తము వొడఁబడదు
తప్పులు వెదకకురో తత్వజ్ఞులాల ॥పల్లవి॥

చెలఁగి మిథ్య యంటాఁ జేసేయజ్ఞాలు ఫలించునా
యిల శూన్యోపాసకుల కేడ దేవుఁడు
లలి మాయా శబళితులకు మోక్ష మెక్కడిది
నలి నభేదవాది కానందానుభవ మేది ॥చెప్పఁ॥

హరి శరణుచొరనియట్టివారికి దిక్కేది
గురుఁడు వేరే లేఁడట కోరి వుపదేశమేది
వెరసి శిక్షాసూత్రాలు విడిచితే ప్రణవమేది
పరగ భక్తి లేదట భవమేట్టు గడచె ॥చెప్పఁ॥

శ్రీ వేంకటేశుముద్ర ధరించక వైకుంఠమేది
యీ విబుపేరు జపించకెట్టు పాపా లుత్తరించు
వేవేగ దాసుఁడుగాక వెట్టికేల కరుణించు
సేవించినఁగాక సర్వచింతలేల యడుగు ॥చెప్పఁ॥ 270

**అవతారిక :**

అనాదిగా తత్వజ్ఞులకు భగవదారాధకులకు బేధాభిప్రాయాలు వుంటూనే వచ్చాయి. జగన్మిథ్య అనేవారు చేసే యజ్ఞాలు యెవరికి వుపయోగిస్తాయి? నేనే భగవంతుణ్ణి భగవంతుడే నేను అనే వాడికి పరమానందం ఎలా అనుభవంలోకి వస్తుంది? భక్తిలేనివాడికి చావుపుట్టుకల చక్రము తప్పుతుందా? శ్రీవేంకటేశుని సేవించక చింతలెట్లా తొలుగుతాయి? మేము తార్కికంగా ఆలోచిస్తాం అనేవారు భగవంతుని గురించి యేవేవో అర్థములు చెబుతారు. కానీ చిత్తము మాత్రం





వాటినంగీకరించదు. నేనిలా చెబుతుంటే దయచేసి ఓ తత్వజ్ఞులారా! నాలో తప్పులు వెదకవద్దు, అంటున్నారు అన్నమయ్య.

**భావవివరణ:**

ఓ తత్వవేత్తలారా! మీరు చెప్పే ఈ అర్థములతో నా చిత్తము (మనస్సు) ఒడబడదు (అంగీకరించదు). మీ వాదనలు మీ తార్కిక వివరణలు మొదలైన వాటితో నా మనస్సు విభేదిస్తే, దయచేసి తప్పులు వెదకవద్దు.

అయినా నాకుతోచింది చెబుతాను వినండి. మీరు "జగన్మిథ్య" అంటూ యెన్ని యజ్ఞాలు చేసినా ఎవరికుపయోగం? యజ్ఞఫలమెలా దక్కుతుంది? ఇక శూన్యోపాసకులున్నారు వారికి దేవుడే లేడట. లలి (ఈ క్రమములో) మాయచేత చిత్రవిచిత్రముగా ఆవరించబడినవారికి మోక్షము ఎలా దక్కుతుంది? అభేదవాది భగవంతుడే తాను, తానే భగవంతుడు అంటాడు. వాడికి అదొక 'నలి' (రోగము). వాడికి బ్రహ్మానందము యొక్క అనుభవము సాధ్యపడుతుందా చెప్పండి.

శ్రీహరిని శరణుజొచ్చినవాడు కడతేరగలడు. అలా శరణాగతులు కాని వారికి వేరే దిక్కులేనే లేదు. కొందరు ఏ గురువునీ ఆశ్రయించరట, వారికి వారే గురువులట. ఇక వారికి ఉపదేశం యెవరు చేస్తారు? శిఖాసూత్రాలు (అగ్నికార్యం పద్ధతులు) విడిచి పెడితే ఓంకారం అవసరమేముంది? ఇవన్నీ ఇటుంచి, భక్తి లేదనే వాడికి జన్మల చక్రభ్రమణం తప్పుతుందా? వాడు చస్తూనే వుంటాడు, పుడుతూనే వుంటాడు.

శ్రీవేంకటేశ్వరుని శంఖుచక్ర ముద్ర శరీరంపై ధరించని వాడికి వైకుంఠప్రాప్తి కలుగుతుందా? ఈ జగన్నాథుడి పేరు జపించని వాడికి పాపవిచ్ఛేదన జరుగుతుందా? అత్యంత శీఘ్రముగా హరిదాసుడు గాక ఆ భృత్యుని శ్రీహరి యెట్లు కరుణించును? ఇంతెందుకు శ్రీవేంకటరమణుని సేవించక చింతలన్నీ నశించే దారియేది?

సంపుటి : 4 కీర్తన : చెప్పినంతపని నేజేయగలవాడ నింతే

సంఖ్య : 207 పుట : 139 రాగం : భంగాళం

**భంగాళం**

65. చెప్పినంతపని నేఁ జేయఁగలవాఁడ నింతే
అప్పటి నపరాధమా ఆదరించవలదా ॥పల్లవి॥

నీయాజ్ఞ దేహము నే మోచితినింతే
యీయెడ విజ్ఞానమేల యియ్యవయ్యా
వేయి వేలై వేగుదాఁక వెట్టిసేసి యలసితి
వోయయ్య కొంతైన వూరగించవలదా ॥చెప్పి॥

నీవు సేసేకర్మము నేఁజేయువాఁడ నింతే
యీవల నానందసుఖ మియ్యవయ్యా
కోవ(వు?)రమై వెంట వెంటఁ గొలిచినబంట్లకు
తావులఁ గొంత వడైనా దప్పిదీర్చవలదా ॥చెప్పి॥

మతిలో శ్రీవేంకటేశ మనికయినవాఁడ నింతే
తతి నాపాటుకు దయదలఁచవయ్య
యితవై పనిసేసేటియింటిపసురమునకు
వెతదీరఁ బాలార్చి వెడ్డు వెట్టఁదగదా ॥చెప్పి॥ 207

**అవతారిక :**

అప్పుడప్పుడు ఇంటిగొడ్లు మొరాయిస్తుంటాయి. వాటిని మెల్లిగా దారిలోకి తెచ్చుకోవాలిగాని కొట్టి చంపేస్తామా? నేనూ నీకు పనిచేసే గొడ్డునే, నన్నున్ పాలార్చి వెడ్డువెట్టదగదా? అంటున్నారు అన్నమయ్య ఈ కీర్తనలో. నీవు పుట్టించావు, నీవే భ్రమలు కల్పించావు, మాచేత మంచిపనులూ చెడ్డపనులూ నీవే చేయిస్తున్నావు ఓరయ్యా! నన్ను కాస్త అయినా వూరడించవద్దా? నీవెంటబడి కొలిచేబంటుకు దప్పిక నువ్వు తీర్చకపోతే యెవరు తీరుస్తారు? అప్పటి నపరాధము (మళ్ళీ మళ్ళీ చేసే తప్పులు) చేశానని దెప్పితే ఎలా? నీవు చెప్పిందే నేను చేశాను. ఏదో చూసీ





చూడనట్లు పోవాలిగాని నన్ను తిప్పలు బెడితే ఎలా చెప్పు? ఈ కీర్తన అర్థం చేసికోవటం అంత తేలిక కాదు అని తెలుస్తూనే వున్నది, కదా!

**భావవివరణ:**

ఓ దేవదేవా! నా తాహతు ఏపాటిది? చెప్పిన పని మారు మాటలేక చేయవలసిన బానిసను. ఇంతే కదా! అటువంటి నాపై కాస్త జాలి చూపించవద్దా!! అప్పటియపరాధములు (మళ్ళీ మళ్ళీ బుద్ధిలేక నేను చేసే తప్పులను) ఆదరించవలదా (మన్నించవద్దా!)

నేను ఈ నా శరీరం ధరించింది నా కోరికమేరకా? అది నీ ఆజ్ఞ ప్రకారమే జరిగింది కదా! మరి దీనికి విజ్ఞానపు (నీవు వున్నావనే జ్ఞానం) యెందుకియ్యవు? వేలకొద్ది యేళ్ళు వెట్టి చాకిరి చేసి బ్రతికానయ్యా! రాత్రింబగళ్ళు, నిద్రభయాహార మైథునాలే. ఒకటేవెట్టి అలిసిపోయాను తండ్రీ! ఇక నావల్లకాదు. ఓరయ్యా! కాస్త అయినా ఊరడించవద్దా!! నేనేమైపోతాను?

అదే విధంగా నీవు చేసిన కర్మలే నేనూ చేశాను. ఇంతే కదా! నీవు యెనలేని ఆనందము సుఖము పొందావు. మరి నా కర్మ ఇట్లా కాలిందేమిటి? కోవురమై (పారాహుషారుగా) నీవెంట వెంట తిరుగుతూ సేవించే బంట్లకు (భృత్యులకు) తావుల (అక్కడక్కడా) నోరు తడిపి దాహం తీర్చవద్దా! నీ బంటు దప్పికతో బాధపడితే నీకేమి ఆనందము ప్రభూ!

"సరే నీవు అడిగినవి పొందటానికి నీకేమి అర్హత వుందని" అడుగుతావేమో! ఓ శ్రీవేంకటేశ్వరా! మతిలో మనికయినవాడను (నిన్ను నా మనస్సులో ప్రతిష్టించుకొన్నవాడను). ఇంతే... ఇంతకంటె నాకే అర్హతా లేదు. తతి (ఇదేతగిన సమయం అని) నా అవస్థలను చూచి జాలిపడవద్దా! ఇతవై (మేలు కలుగునట్లు) బండచాకిరీ చేసే యింటి పసురమునకు (ఇంటిగొడ్డుకు) వెతదీర (వుపశమింపజేసి) పొలార్చి, పాలు+ఆర్చి (ఏదో పోనీలే అని) ఉపేక్షించాలి. వెడ్డువెట్టు (వంచించుట) తగునా? నీవే నన్ను మోసం చేస్తే నాకు గతేమిటి?

సంపుటి : 3 కీర్తన : మాయామోహము మానదిది

సంఖ్య : 566 పుట : 380 రాగం : దేవగాంధారి

**దేవగాంధారి**

66. మాయామోహము మానదిది
శ్రీయచ్చుత నీచిత్తమే కలది ॥పల్లవి॥

యెంత వెలుఁగునకు నంతేచీఁకటి
యెంత సంపదకు నంతాపద
అంతటా నౌషధ మపథ్యమును సరి
వింతే మిగిలెను వేసటే కలది ॥మాయా॥

చేసినకూలికి జీతమునకు సరి
పూసినకర్మభోగము సరి
వాసులజన్మము వడి మరణము సరి
ఆసల మిగిలిన దలపే కలది ॥మాయా॥

మొలచినదేహము ముదియుటకును సరి
తలఁచినదైవము తనలోను
యిలలో శ్రీవేంకటేశ నీ కరుణ –
గలిగినమాకెల్ల ఘనతే కలది ॥మాయా॥ 566

**అవతారిక :**

అచ్యుతుడైన పరమాత్మ జీవులందరికీ మాయకు లోబడే చిత్తము (మనస్సు) నిచ్చాడు. ఈ మాయ వలన అది మోహపీడితమై, సన్మార్గం వదలి దుర్మార్గంలోపడి చెడి ఆయననే మరచిపోతుంది. ఏనాటికీ మోహమును మానదు. ఈ చిత్తము తీరే ఇంత కాబట్టి, నీ చిత్తము నాపై కలుగునట్లు చేసి నన్ను నీ మాయ నుండి రక్షించు అంటున్నారు అన్నమయ్య. ఒక యజమాని కూలివాడిపై రాగద్వేషాలు లేక చేసిన పనికి తగినంత కూలీనే ఇస్తాడు కదా! ఆ పరమాత్మకూడా అంతే. ఇదే కీర్తనకు





ఇంకా నాలుగు రకాలుగా భావవివరణ ఇవ్వవచ్చును. యద్భావం తద్భవతి... అన్నారు పెద్దలు. అన్నమయ్య చిత్తము మనబోంట్లకు సరిగా అవగతం కాకపోతే... ఆశ్చర్యమేముంది?

**భావవివరణ:**

ఓ శ్రీ అచ్యుతా! ఇది (నీవు ఇచ్చిన ఈ చిత్తము) మాయామోహము మానదు. (నీమాయకు లోబడి మోహమును మానదు). ప్రభూ! నీ చిత్తమే కలది (నీ ఇష్టం, తండ్రీ!) మోహపీడితయైన దీన్ని ఏంచేసినా నీదయ.

ఈ నీ సృష్టిలో యెంత వెలుతురు వున్నదో, అంతే చీకటి వున్నది. ఎంత సంపదనిస్తావో అంత ఆపద (ప్రమాదం) కూడా దానికి అంటకడతావు. అంతటా ఔషధము (ప్రతి మూలికా ఒక ఔషధమే). దానికి సరిబోవునట్లు అపథ్యము (తినకూడని మందులు) కూడ నీవే సృష్టించావు... (విషము కూడా ఆయన సృష్టియే కదా!) ప్రభూ! నీవు కలిగించే ఈ మాయామోహము వల్ల వేగుటయే (చింతయే) మిగులుతుంది. అంతా ఒక వింతగా మిగిలిపోతుంది.

ఓ దేవదేవా! చేసికొన్న వారికి చేసికొన్నంత అనేదే నీ నిర్ణయం. ఎంత కష్టపడితే అంత కూలి ఇస్తావు. పూసిన కర్మకు (చేసిన కర్మము) దాని ఫలితం అనుభవించటంతో సరిపెడతావు. జన్మా నీవే ఇస్తావు. చావూ నీవే ఇస్తావు. వాసిగల జన్మ ఇచ్చినంతమాత్రాన చావూ అలాంటదే వుండవలసిన పనిలేదు. నీమాయ, ఆశలను మిగిల్చి, వాసనలను (సంస్కారములను) కలుగునట్లు చేస్తుంది.

ఈ దేహము మొలిచిందంటే (అవతరించిందంటే) ఇది ముసలిది కాకమానదు. మరి దారేమిటి? తనలోనే వున్న దైవమును తలచిన (ధ్యానించిన) సరి (సరిపోతుంది. అది చాలును). ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ లోకంలో నీ కరుణకు పాత్రులమయ్యామంటే... సరి. ఇక మాకు అన్ని ఘనతలు కలది (కలుగుతాయి.) ఇందులో సందేహం లేదు.

సంపుటి : 3 కీర్తన : నారాయణ నీ నామమహిమలకు

సంఖ్య : 574 పుట : 385 రాగం : మాళవిగౌళ

## మాళవిగౌడ

67. నారాయణ నీనామమహిమలకు
గోరఁ బోవుటకు గొడ్డలి దగునా ॥పల్లవి॥

హరియని నొడిగిన నణఁగేటిపాపము
సిరుల నేను నుతిసేయఁగఁగలనా
పరగినపిచ్చుకపై బ్రహ్మాస్త్రము
దొరకని వూరకె తొడిగినయట్లు ॥నారా॥

అచ్చుతయనఁగా నందెటిసంపద
యిచ్చల నెంచిన నిలఁగలవా
కొచ్చి కొచ్చి యొక కొండంతకనకము
వెచ్చపుఁబోకకు వెల యిడినట్లు ॥నారా॥

యెదుటనే శ్రీవేంకటేశ్వర యఁనగాఁ
బొదిగెటితపముల పుణ్యము గలదా
కదిసి సముద్రము గడచి వోడలోఁ
జిదిసి యినుము దెచ్చినయట్లు ॥నారా॥ 574

**అవతారిక :**

అన్నమాచార్యులవారి అధ్యాత్మకీర్తనలలో ప్రత్యేకత ఏమంటే పల్లవి చాలా గూఢముగా వుంటుంది. హరినామ మహిమను వివరిస్తున్నారు. నారాయణ అని పలికి గొప్ప గొప్ప పుణ్యాలు సాధించాలి గాని సిరిసంపదలవంటి తుచ్ఛమైన కోరికలు పొందుటకు హరినామము వాడితే "గోటితోబోయే దానికి గొడ్డలి వాడినట్లవుతుంది" అంటున్నారు. శ్రీవేంకటేశా! అంటే అనేక తపముల పుణ్యం కలుగుతుంటే మళ్ళీ వేరే తపస్సులు చేయటం ఎలా వుంటుందంటే కాస్తంత ఇనుము





తీసుకురావటానికి పెద్ద ఓడ ప్రయాణం చేసినట్లుంటుంది – అంటున్నారు. ఉపమా కాళిదాసస్య – అన్నారు పెద్దలు. కానీ ఉపమా అన్నమాచార్యస్య – అంటాను నేను.

**భావవివరణ:**

నారాయణుని నామసంకీర్తన దివ్యమహిమాన్వితమైనది. సిరిసంపదలు, ఇష్టకార్యసిద్ధి పుత్రపౌత్రాభివృద్ధి వంటి చిన్నచిన్న కోర్కెలు సిద్ధించుటకు దాని పుణ్యం వాడటం యెంత తెలివితక్కువతనం అంటే "గోరితో పోయేదానికి గొడ్డలి కావాలా?"

హరియని నొడిగిన (పలికితే) పాపములన్నీ అణగును (నశించును). అటువంటిది సిరులన్ యేను నుతిసేయగగలనా (తుచ్ఛమైన సిరులకోసం నేను శ్రీహరిని నుతించగలనా?) పరగిన (ఇది చూస్తే ఎలా వుంటుందంటే)... వూరకే వింటికి సంధించి ఒక పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం వేసినట్లు వుంటుంది.

అచ్చుత (అచ్యుత) యనగాన్, అందేటి (పొందునట్టి) సంపదలను, ఇచ్చలను (కోర్కెలను), ఇలన్ (ఈలోకంలో) యెంచిన (లెక్క కట్టితే) కలవా (సాధ్యమవుతుందా?) (కొచ్చు అంటే వదలుకొనుట అని అర్థం... కాని ఇక్కడ గుచ్చిగుచ్చి బేరము చేయటం అనే అర్థంలో వాడారు.) గీచిగీచి బేరము చేసి ఒక కొండంత బంగారాన్ని వెచ్చించి ఒక పోక చెక్క వెలకు కొన్నట్లు వుంటుంది, ఈ తెలివితక్కువ బేరము.

మనయెట్టనెదుటనే వున్న ఈయనను శ్రీవేంకటేశ్వరా! అంటే చాలును అది పొదిగేటి పుణ్యములు కలది. (క్రమ్ముకొన్నట్లు తపస్సు చేసిన పుణ్యములను) కలుగచేస్తుంది. ఆ నామాన్ని సాంసారిక సుఖాలకోసం వాడితే ఎంత మూర్ఖంగా వుంటుందంటే... కదిసి (చేరువయై) సముద్రమును ఓడమీద దాటి, చిదిసి (నలిగిపోయి నానా తిప్పలు పడి) ఇనుమును తీసికొనివచ్చి వ్యాపారం చేసినట్లు వుంటుంది.

సంపుటి : 3 కీర్తన : ఇంతగాలమాయను యేడనున్నారో వీరు

సంఖ్య : 344 పుట : 232 రాగం : రాయగౌళ

**రాయగౌళ**

68. ఇంతగాలమాయను యేడనున్నారో వీరు
వింతలై యడవిఁగాసేవెన్నెలాయ బ్రదుకు ॥పల్లవి॥

యేలేవారి దూరితి యెదరువుట్టినవేళ
కాలమును దూరితిని కలఁగేవేళ
తాలిమిలేనివేళ తగుఁగర్మము దూరితి
యేలాగని కాచేవారి నెవ్వరిఁ గానము. ॥ఇంత॥

దైవమును దూరితి తమకించినట్టివేళ
కావించి నన్నే దూరితిఁ గాఁగినవేళ
సోవగాఁ గోపపువేళ చుట్టాల దూరితిమి
యీవలఁ దోడైనవారి నెవ్వరిఁ గానము. ॥ఇంత॥

పుట్టుగు దూరితిమి పోరానియట్టివేళ
కట్టఁగడ నెందువంటకఁ గానమైతిమి
జట్టి శ్రీవేంకటేశుఁడు శరణంటేనే కాచె
యిట్టె యింతటివారు యెవ్వరును లేరు ॥ఇంత॥ 344

**అవతారిక :**

బ్రతుకంతా అడవిగాచిన వెన్నెలవలె నిరర్ధకమైపోయిందని వాపోతున్నారు అన్నమయ్య. తాను సేవించినవారు, తనను సేవించినవారు, గురువులు, శిష్యులు, ఆప్తబంధువులు – వీళ్ళంతా ఈనాడు ఏరీ, ఎక్కడున్నారు? ప్రతిదానికీ ఎవరినో ఇంకొకరిని తిట్టానేకాని శ్రీవేంకటేశ్వరుని శరణంటే చాలునని గ్రహించలేకపోయాను. "పోరానియట్టివేళ" అనే పదాన్ని, సంకటములలోవున్నప్పుడు అనే అర్థంలో వుపయోగించారు. కట్టగడ నెందువంకన్ కానమైతిమి అని నిజాయితీగా





పశ్చాత్తాపప పడుతున్నారు. అందరి బ్రతుకులూ ఇంతే. మరి దారేమిటి? హరిచరణమే శరణము అనుటయే.

**భావవివరణ:**

ఇంతకాలము గడచిపోయింది. వీరు (నాతో జీవితాన్ని పంచుకొన్నవాళ్ళంతా) యేడనున్నారో కదా! ఎంత వింతగావున్నది!! నా బ్రతుకంతా అడవిలో కాచిన వెన్నెలవలె నిరర్ధకమైపోయింది కదా! అయ్యో! హతవిధీ.

ఎదరువుట్టినవేళ (భంగపడినవేళ) నన్ను నేను నిందించుకోకుండా నా యజమానులను నిందించాను. కలగేవేళ (కష్టకాలంలో) నాచేతకానితనానికి, కాలం కలిసిరాలేదని తిట్టాను. నేను తాలిమిలేని వేళ (ధైర్యం కోల్పోయినప్పుడు) నా కర్మ ఇట్లా కాలిందని దూరితిని (నిందించాను). ఏలాగని కాచేవారిని (ఏదోఒకవిధంగా రక్షించేవారిని కానము (చూడలేకున్నాము).

తమకించునట్టివేళ (చలించిపోతున్నప్పుడు) నా కష్టాలన్నిటికీ దేవుడే కారణమని ఇష్టం వచ్చినట్లు తిట్టాను. కావించి (చేతకాక) కాగినవేళ (తపిస్తున్న వేళలలో) ఆత్మనింద కూడా చేసికొన్నాను. కోపాన్ని నిగ్రహించు కోలేక కొడుకుల్ని మొదలుకొని వున్న బంధువుల నందరినీ తిట్టాను. అందుకని ఈవల (ఇటువైపు) నాకు తోడుంటాననే వాణ్ణి ఒక్కడినీ చూడను.

ఇప్పుడుపోరానియట్టివేళ (సంకటములలో నలిగేవేళ) వచ్చేసింది. ఎందుకు పుట్టానురా దేవుడా! అని నా పుట్టుకనే నిందించాను. ఇక ఇప్పుడు "కట్టగడనెందువంకన్ కానమైతిమి" చిట్టచివరికి తిట్టడానికి ఒక్కరూ కనబడటంలేదు. ఏంచేయను? (జట్టి అంటే ఏదో ఒక ధర అని నిశ్చయించడం... కానీ ఇక్కడ, నిర్ణయించి అనే అర్థంలో వాడరు) నిర్ణయించి శ్రీవేంకటేవ్వరుడు శరణు నాకు అనగానే ఇట్టే నన్ను రక్షించాడు. ఇంతటి సమర్థుడు ఎవ్వరూలేరు.

సంపుటి : 3 కీర్తన : నీవెటుదలచిన నిఖిలము నట్టొ
సంఖ్య : 575 పుట : 386 రాగం : లలిత

**లలిత**

69. నీ వెటు దలఁచిన నిఖిలము నట్టొ
యేవల స్వతంత్రమింతా నీది ॥పల్లవి॥

యేఁటిపురాకృత మెక్కడికర్మము
దాఁటక హరి నీదయ గలితే
నీటున నిన్నియు నీ కల్పితములు
పాటించి నీవే పాపఁగలేవా ॥నీవె॥

యెక్కడిజన్మము లెక్కడిమరణము-
లొక్కఁడవె నీవు వొద్దంటే
యెక్కువ నిందరి నేలెటివాఁడవు
యిక్కడఁ గొలిచితి మితరము లేలా. ॥నీవె॥

యేది పాపము యేది పుణ్యము
పోదిగ నీవే పొమ్మంటే
చేదో డిందుకు శ్రీవేంకటేశ్వర
ఆదెస నిను శరణంటిమి గొంత ॥నీవె॥ 575

**అవతారిక :**

శ్రీహరి సర్వస్వతంత్రుడు. మనం చేసిన కర్మకి తగిన ఫలితం సాక్షీభూతుడుగా నిస్తాడు అనే మాట నిజమే అయినా, ఆయన తలచుకొంటే ఏదైనా చేయగలడు. నిఖిలము (సర్వమూ) ఆయన ఎట్లా అనుకొంటే అట్లా అవుతుంది. పురాకృతకర్మలు, జనన మరణాలు, పాపపుణ్యాలు ఆయన పొమ్మంటే పోతాయి రమ్మంటే వస్తాయి. ఇది సత్యం. కాని ఆయన ఎందుకు పొమ్మంటాడు ఎందుకు రమ్మంటాడు?





నీవు ఆ శ్రీవేంకటేశ్వరునే నమ్మి శరణు తండ్రీ! అంటే ఏదో ఒకనాటికి ఆయనకే దయకలిగి పైన చెప్పినవన్నీ చేస్తాడు. వచ్చిన చిక్కేమిటంటే ఆయన మీద ధ్యాస కలుగుట ఒక ఎత్తయితే... అది చలించకుండా నిలబడటం ఇంకొక ఎత్తు. ఈ ఎత్తుల్లో మనం చిత్తు కాకుండా వుంటే... అప్పుడెత్తుకుంటాడు మనని. ఇదండీ అన్నమాచార్యులవారి హితబోధ.

**భావవివరణ:**

ఓ శ్రీపతీ! నీవెట్లు తలచిన, నిఖిలము (సర్వమూ) అట్లేయగును. ఏవల (ఎప్పుడైనా) నీవు సర్వస్వతంత్రుడవు. ఇదంతా నీఇష్టం. కాదనే శక్తి ఒక్కడికీ లేదు.

ఏటి పురాకృతము (ఎక్కడి తొల్లింటికర్మ)? ఎక్కడి కర్మము (ఎక్కడి సంచిత, ఆగామి కర్మలు?) ఓ శ్రీహరీ! నీదయకలిగితే వాటిని దాటడం ఒక బ్రహ్మవిద్యా? ఇన్నియు (ఇవన్నీ) నీటున (సగర్వంగా) నీవు కల్పించినవే కదా! పాటించి (ఆదరించి) నీవే పాపగలేవా (వాటినుండి మమ్మల్ని తప్పించలేవా?) నీకు కాక మరెవరికి అది సాధ్యమవుతుంది?

ప్రభూ! నీవొక్కడివి "వద్దు" అంటే జన్మాలు ఎక్కడివి? మరణాలు ఎక్కడివి? ఆత్మకు అనంతమైన మోక్షం అరక్షణంలో ఇవ్వగలవు. ఈ సర్వజీవులను యేలేటి (పరిపాలించే) వాడివి నీవే కదా! ఇక్కడ నిన్ను నమ్మి కొలుచుచున్నాను. ఇక మాకు ఇతరములేలా? అన్యదేవతలు, రకరకాల పూజావిధానాలు, వేదోక్త కర్మలు - ఇవన్నీ యెందుకు?

ఓ దేవదేవా! పోదిగ (కమ్ముకొని) నీవు మా భారము వహించి "పోండి" - అంటే పాపమేమిటి? పుణ్యమేమిటి? ఆ రెండూ మమ్మల్నేమీ చేయలేవు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు చేదోడు (చేయిచాచి సాయం అందించే ఆర్తత్రాణ పరాయణుడవు).

ఇందుకు (దీనికోసం) ఆదెస (ఆవిధంగా) నిన్ను కొంత శరణుజొచ్చితిమి (కొద్దిగానైనా శరణు వేడేము). ఈ మాత్రానికే నాకు ఇంత చేశావు తండ్రీ.

సంపుటి : 4 కీర్తన : ఈజీవునకు నేది గడపల తనకు

సంఖ్య : 56 పుట : 398 రాగం : దేవగాంధారి

**దేవగాంధారి**

70. ఈ జీవునకు నేది గడపల తనకు
నేజాతియును లేక యిట్లున్నవాఁడు ॥పల్లవి॥

బహుదేహకవచములఁ బారవేసినవాఁడు
బహుస్వతంత్రముల నాపదనొందినాఁడు
బహుకాలముల మింగి పరవశంబైనాఁడు
బహుయోనికూపములఁ బడి వెడలినాఁడు ॥ఈజీ॥

పెక్కు బాసలు నేర్చి పెంపు మిగిలినవాఁడు
పెక్కునామములచే బిలువఁబడినాఁడు
పెక్కుకాంతలతోడ పెక్కుపురుషులతోడ
పెక్కులాగులఁ బెనఁగి బెండుపడినాఁడు ॥ఈజీ॥

ఉండనెన్నఁడుఁ దనకు ఊరటెన్నఁడు లేక
యెండలకు నీడలకు యెడతాఁకినాఁడు
కొండ (ల) లో నెలకొన్న కోనేటిరాయని
యండ చేరెదననుచు నాసపడినాఁడు ॥ఈజీ॥ 56

**అవతారిక :**

ఎన్నియో దేహములను ధరించిన ఈ జీవుడు గడపల తొలిమెట్టు యేది? అంటే వాడి మొట్టమొదటి జన్మేదో ఎవడికి తెలుసు? తనకు జాతి అనేదే లేకుండా యిట్లు జీవించుచున్నాడు అంటున్నారు అన్నమాచార్యులవారు. ఎన్ని జన్మలెత్తినా, ఎంత అనుభవించినా, ఎన్ని బంధనాలలో తగులు కొన్నా వీడికి ఊరట అనేదే లేదు. కొండలలో నెలకొన్న కోనేటిరాయుడిని చేరెదనని ఆశపడినంతనే వీడికి తరుణోపాయం లభించింది, అంటున్నారు. తాళ్ళపాకలో వెలసిన అధిష్టాన





దైవాన్ని కోనేటిరాయడని పిలుస్తారట. ఆయనే అన్నమయ్యనమ్ముకొన్న తిరువేంకటేశ్వరుడు కూడా.

**భావవివరణ:**

ఓ మానవులారా! ఈ జీవునకు గడపల (తొలిమెట్టు) ఏది? అనగా వాడితొలిజన్మ ఏదియో యెవరికి తెలుసును? తనజాతి అనేదేలేక ఈ విధంగా జీవిస్తున్నాడు కదా! ఇతగాడు.

వీడు ఎన్నో దేహములను కవచముల వలె పారవేసినాడు (సహస్రకవచుని వలె ఒక్కొక్క కవచాన్ని వదలివేసినాడు). అనేక స్వతంత్ర జీవితాలు గడిపి అనేక ఆపదలను పొందినాడు. ఎన్నో కాలములలో గడిపి పరవశత్వంతో బ్రతికాడు. అనేకమైన యోనికూపములో మగ్గి బయటకు వచ్చాడు. కాని ఇప్పటికి కూడా వీడి ఉనికి యేమిటో వీడికి తెలియరాలేదు.

వీడి జీవనయానాల్లో వీడు అనేకమైన భాషలను నేర్చాడు. ఎంతో "పెంపు మిగిలిన" వాడు (అభివృద్ధిని సాధించాడు). అనేకమైన పేర్లతో పిలువబడినాడు. కొన్ని జన్మలలో అనేక స్త్రీలతోను, కొన్ని జన్మలలో అనేక పురుషులతోను సుఖించాడు. అనేకమైన వ్యామోహాలతో పెనగులాడి బెండుపడినాడు (బలహీనపడ్డాడు.)

ఉండనెన్నడు (ఏదేహంలోవున్నా) తనకు ఊరట (మనశ్శాంతి) లేక, శీతోష్ణాది ద్వంద్వములకు చలించిపోయాడు. ఇదిగో ఇప్పుడు కొండలలో నెలకొన్న ఈ కోనేటిరాయుని చేరెదను అనుకొని ఆశపడ్డాడు. ఇక వాడికి అంతా మంచే జరుగుతుంది.

సంపుటి : 3 కీర్తన : నీవే యంతర్యామివి నీవున్నదే వైకుంఠము
సంఖ్య : 579 పుట : 389 రాగం : లలిత

**లలిత**

71. నీవే యంతర్యామివి నీవున్నదేవైకుంఠము
ఆవలఁ బరమపదమన నింకాఁ గలదా ॥పల్లవి॥

యిందరు జంతువులు నీవిచ్చినరూపులు మోచి
బొందితో నీకే నెలవై పుట్టినారు
కందువ నీ ప్రపంచపు కైంకర్యములు సేసి
అందిరి జీవన్ముక్తు లదివో చాలదా ॥నీవే॥

యేలిక వంచినపనే యింద్రియభోగములెల్ల
తోలితోలి రాచాజ్ఞ తోయకున్నారు
కాలము నిన్నుఁ బాయరు గర్భగోళమందున్నారు
యీలోకమే సాలోక్య మిది యింత చాలదా ॥నీవే॥

జ్ఞానము నజ్ఞాన మేది స్వామికార్యములోన
మానక నీపనులలో మత్తులైనారు
శ్రీనాథుడవు నీవే శ్రీవేంకటేశ్వర
నీనాటకములోనే నిత్యులైరి చాలదా ॥నీవే॥ 579

**అవతారిక :**

శ్రీమహావిష్ణువు, వైకుంఠం, సనకాదిఋషులు ఇంద్రాది దేవతలు – ఇవన్నీ పురాణేతిహాసాల ద్వారా మనం భగవంతుని స్మరించే సాధన ప్రక్రియలో అంతర్భాగం మాత్రమే. మాంసచక్షువులతో వీరిని చూడటం సాధ్యమయ్యేపనిగాదు. అసలు చూడవలసిన పనేలేదు. ఎందుకంటే ఆ నారాయణుడే అంతర్యామిగా మన అందరిలోను వున్నాడు. ఆయన వున్న ఈ దేహమే వైకుంఠం. అందరిలో వున్న హరి ఒక్కడే అని తెలుసుకోవటమే పరమపదము పొందటం. జీవిత కాలంలోనే ఈ సత్యాన్ని గ్రహించినవాడు రాగద్వేషాలకు అతీతుడుగా వుంటాడు. ఆ స్థితి చేరుకోవటమే జీవన్ముక్తి.





వాడికి మళ్ళీ పుట్టుక వుండదు. మరి ఈలోగా మనం పొందుతున్న ఈ అనుభవాలన్నీ యేమిటి? ఇదే శ్రీవేంకటేశుని నాటకము అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావవివరణ:**

ఓ దేవదేవా! మాలోవున్న అంతర్యామివి (ఆత్మస్వరూపుడు) నీవే. నీవు నెలకొనివున్న ఈ దేహమే వైకుంఠము. ఇంకా అవతల పరమపదము (మోక్షము) అనేదివేరే వున్నదా? లేనేలేదు స్వామీ!

నీవిచ్చిన వేర్వేరు రూపాలతో వీరంతా రకరకాల జంతు రూపములను దాల్చారు. ఏదో ఒక బొంది (శరీరం) మోచి (దరించి) నీకే స్థానమైనట్లు పుట్టినారు. కందువ (చమత్కారంతో) ఈ ప్రపంచాన్ని (వారి ప్రాపంచిక జీవితాన్ని)నీకే కైంకర్యం చేసి జీవన్ముక్తిని పొందారు. అదిగో అది చాలదా ప్రభూ! వేరే వైకుంఠం... విష్ణుదూతలు... ఇదంతా యెందుకు?

మహానుభావా! నీవే యేలికవు (పరిపాలకుడవు). మేము పొందుతున్న ఈ ఇంద్రియ భోగాలన్నీ ఎవరిచ్చారు? నీవు పంచినవే (పంచిపెట్టినవే కదా!) మరి ఈ జీవులంతా, తోలితోలి (అదలించబడిన వారై) రాజాజ్ఞను (తమ యేలిక ఆజ్ఞను) తోయలేకున్నారు (ధిక్కరించలేకున్నారు). కాలము నిన్ను బాయరు (క్షణంకూడా నిన్ను వదలిపెట్టరు). ఎందుకంటే వీరుండేది ఎక్కడో కాదు... నీ గర్భగోళంలోనే (విశ్వరూపుడవైన నీ కడుపులోనే) వున్నారు. అందుచేత ఈ లోకమే సాలోక్యము (నీవుండేలోకం). దేవా! ఇది తెలుసుకుంటే చాలదా? ఇంకా ఏమి తెలుసుకోవాలి?

ప్రభూ! నీ పనులలో (సేవలో) మత్తులైనారు (తన్మయత్వం పొందేవారు) కోరుకునేది నీసేవ మాత్రమే. స్వామికార్యమునే సర్వస్వం అనుకొనేవారు జ్ఞానులైతే నేమి? అజ్ఞానులైతేనేమి? ఓ శ్రీవేంకటేశ్వరా! నీవే శ్రీనాథుడవు. వీరంతా నీ నాటకంలో పాత్రధారులు. వీరంతా నిత్యులే. ఏదో ఒక జన్మలో, ఏదో ఒకచోట, ఏదో ఒక పాత్ర ధరిస్తారు. నేనూ అటువంటి పాత్రధారినే. నాకు ఆ తృప్తి చాలదా తండ్రీ!

సంపుటి : 3    కీర్తన : శ్రీపతి యొకడే శరణము మాకును
సంఖ్య : 573    పుట : 385    రాగం : లలిత

**లలిత**

72. శ్రీపతి యొకఁడే శరణము మాకును
తేప యితఁడె మఱి తెరఁగేది ॥పల్లవి॥

ఆసలు మిగులా నాతుమ నున్నవి
యీసులేనిసుఖ మెక్కడిది
చేసినపాపము చేతుల నున్నది
మోసపోనిగతి ముందర నేది ॥శ్రీప॥

కోపము గొందుల గుణముల నున్నది
యేపున నిజసుఖ మిఁక నేది
దీపనాగ్నితోఁ దిరిగెటిదేహము
పైపై విరతికిఁ బట్టేది ॥శ్రీప॥

పంచేంద్రియములపాలిటిబదు కిది
యించుక నిలుకడ కెడ యేది
యెంచఁగ శ్రీవేంకటేశ్వరుఁ డొకడే
పంచినవిధులను పాలించుఁగాక ॥శ్రీప॥ 573

**అవతారిక :**

బహు సరళమైన ఈ కీర్తన అన్నమాచార్యులవారు మాకు శ్రీపతియొక్కడే దిక్కు. సంసార సాగరాన్ని తరించాలంటే ఆయన తేప (తెప్ప). ఆ హరి గాక ఇంకో దారి లేదు అంటున్నారు. ఆనాటి తెలుగు నుడికారంలోని వైవిధ్యం గమనించండి. "ఈసులేని సుఖమెక్కడిది" అంటే ఈర్ష్యలేక సుఖం వుండదని కాదు. ఈర్ష్యలేనటువంటి సుఖం నిరాసక్తమైన ఆత్మకొక్కదానికే వుంటుందని భావము. ఆశ, క్రోధము, చాపల్యము అనే





మూడు దుర్గుణాలు తమలోతామే అనేక మార్పులు జెంది ఈర్ష్య పాపచింతన, మోసము, ద్వేషము అస్థిరత్వము వంటి దారుణమైన పరిణామాలు కలుగుతాయి. దీనికి విరుగుడేమిటి?

**భావవివరణ:**

ఓ ప్రజలారా! మాకు ఒక్క శ్రీపతియే శరణము (ఆదుకొనే దిక్కు). ఇతడే తేప (సంసార సాగరాన్ని దాటించే తెప్ప). ఈయనకాక మరి తెరగేది (ఇంకొక దారి యెక్కడుంది)?

ఆత్మలో, మిగుల ఆసలు నున్నవి (అంతులేని ఆశలు వుంటే) ఈర్ష్య లేనటువంటి సుఖమయ జీవితం సాధ్యమా? దానివల్ల అంతులేని పాపము చేజేతులారా చేస్తూనే వుంటాము. అంతులేక మోసం చేస్తుంటాం తిరిగి మోసపోతుంటాం. ముందర అన్నీ మోసాలే. ఇక తరుణోపాయం యేది?

గొందుల గుణముల (సంక్షోభము చెందే గుణము) వున్నంతవరకు కోపము పోనేపోదు. అట్లే క్రోధాగ్నిలో కాలిపోతున్న వాడికి ఏపున (ఎక్కువగా) సుఖమెట్లా వస్తుంది? బడబాగ్నివంటి ద్వేషంతో తిరిగేవాడికి దేహము రగిలిపోతూ వుంటుంది. అప్పుడప్పుడూ విరతి (విరక్తి) కలుగుతుంటుంది. మళ్ళీ కొన్నాళ్ళకి మామూలే. ఈ పైపై విరతికి (ఉత్తుత్తి విరక్తికి) పట్టేది (బలమేది?)

బదుకిది (ఈ బ్రతుకు) పంచేంద్రియముల పాలు (కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం అనే ఐదు ఇంద్రియాలచేత నియంత్రించబడుతున్నది). నిత్యము సుఖాన్వేషియైన ఆ ఇంద్రియాలు ఆత్మకు అంతులేని చాపల్యం కలుగచేస్తాయి. నిలకడయేవుండదు. ఇక దీనికి తరుణోపాయమేమిటి? ఎంచగ (లెక్కించి చూస్తే) శ్రీవేంకటేశ్వరుడొక్కడే దిక్కు. ఆయన పంచిన విధులను (మనకు నియోగించిన కర్తవ్యములను) పాలించవలెను (నిర్వర్తించాలి). అదిగాక ఇంకో తెరగు లేదు.

సంపుటి : 3 కీర్తన : ఏమిసేయగలవార మెందుకు నౌదుము నేము
సంఖ్య : 201 పుట : 135 రాగం : కాంబోది

**కాంబోది**

72. ఏమిసేయఁగలవార మెందుకు నౌదుము నేము
శ్రీమాధవ నీవే దయఁ జిత్తగించు మమ్మును. ॥పల్లవి॥

వేపరక పుణ్యాలు గావించేదే యరుదుగాని
సేసేనంటే పాపములు చేతిలోనివే
గాసిలక చూచితేఁ జీఁకటైనా వెలుఁగౌఁగాని
వీసమంత మఱచినా వెలుఁగైనాఁ జీఁకటే ॥ఏమి॥

తెలివితో మోక్షము సాధించేదే యెక్కుడుగాని
అలయించేలోకము లెన్నైనా గలవు
తలఁచితే నీరూపము తానే యెదుట నుండు
యిలఁ బరాకై వుండితే నెచ్చోటాఁ జిక్కదు. ॥ఏమి॥

యీవల నీదాసుఁడయ్యేది ఘనముగాని
దావతి రాజసాలంతటా నున్నవి
శ్రీవేంకటేశ్వర నీసేవే ధ్రువపదము
దేవతాంతరమెల్లా దిగ్గుడుకు దిగ్గుడు ॥ఏమి॥ 201

**అవతారిక :**

ఓ మాధవా! మేము మానవమాత్రులం. ఎంతవాళ్ళము - ఏమి చేయగలము? నీవే చిత్తగించి దయచూపి మమ్మల్ని రక్షించాలి అంటున్నారు. మేము జీవులం - అజ్ఞానులం చేసే పుణ్యం అంతంత మాత్రం. పాపాలు అనంతం. నీవు కూడా మమ్మల్ని మఱచిపోతే మాగతేమిటి? నీసేవ చేస్తే ధ్రువపదమైనా తేలికగా లభిస్తుంది. దేవతాంతరమైనా దిగ్గుడుకు దిగ్గుడు అంటున్నారు అన్నమాచార్యులవారు. ఇది కొసమెరపు. అర్థం అయిందనిపించినా ఇది అర్థంకాని కీర్తన.





**భావవివరణ:**

ఓ శ్రీమాధవా! మేము ఏమి చేయగలుగుతాం? ఎందుకున్ ఔదము (దేనికి ఉపయోగిస్తాం)? నీవే దయజిత్తగించి (దయదలచి) మమ్మల్ని ఆదుకోవాలి. లేకపోతే మాగతేమిటి?

దేవా! మేము, వేసరక (శ్రమ అనుకోకుండా) చేసే పుణ్యకార్యాలే అరుదు (చాలా తక్కువ). ఇక పాపాలు చేయటం మాత్రం నా చేతిలోని పనే. ఎన్ని కావాలంటే అన్ని చేస్తాను. ఏదో నువ్వు గాసిలక (శ్రమ అనుకోకుండా) దయ చూస్తే చీకటైనా మాకు వెలుతురే అవుతుంది. నీవు వీసమంత (రూపాయిలో పదియారవ వంతు లేదా 1/16 వంతు) మమ్మల్ని మరచినా, వెలుగైన చీకటికి సమానమే.

స్వామీ! తెలివిగా నీవద్దనుండే మోక్షాన్ని పొందటం యెక్కుడు (గొప్పతనం) కాని ఏదో ఒక లోకం పొందాలంటే కష్టమేముంది? ఏజన్మనెత్తినా భూలోకంలోనే కదా! వుంటాము. జన్మలేక ఆత్మరూపంలో వుంటే పైన ఏడు క్రింద ఏడు లోకాలున్నాయి. ఏదో ఒకదాంట్లో వుంటాం. అందులో గొప్పేముంది? నిన్ను తలచితే (మనస్సులో నిలుపుకొన్నవారికి) నీవు వారి యెదురుగానే వుంటావు. ఇల (ఈలోకంలో) పరాకై వుండితే (నిన్ను విస్మరించిఉంటే) వాళ్ళకి ఎక్కడా చిక్కవు.

ఓ శ్రీవేంకటేశ్వరా! దావతి (ఆసక్తితో) రాజాస్థానాలు యెన్నైనా వుంటాయి. ఎక్కడైనా వుంటాయి కాని, ఇక్కడ నీ దాస్యం మాత్రం అంత తేలికగా దొరకదు. ఎంతో గొప్పతనం వుంటేకాని అది దొరకదు స్వామీ! నీసేవాభాగ్యం దక్కితే ధ్రువపదవి దక్కినట్లే. దేవతాంతరమెల్లా (అన్యదేవతల కొలువులన్నీ) దిగ్గుడుకు దిగ్గుడు (తక్కువ కంటే తక్కువ).

సంపుటి : 3 కీర్తన : అణుమాత్రపుదేహినంతే నేను

సంఖ్య : 347 పుట : 234 రాగం : సామంతం

**సామంతం**

74. అణుమాత్రపుదేహి నంతే నేను
మొణిఁగెద లేచెద ముందర గానను. ॥పల్లవి॥

తగుసంసారపుతరఁగలు నీమాయ
నిగమములయడవి నీమాయ
పగలునిద్రలువుచ్చేభవములు నీమాయ
గగనపునీమాయఁ గడవఁగవశమా ॥అణు॥

బయలువందిలి కర్మబంధములు నీమాయ
నియమపుఁ బెనుగాలి నీమాయ
క్రియనిసుకపాఁతరకెల్లొత్తు నీమాయ
జయమంది వెడలఁగ జనులకు వశమా. ॥అణు॥

కులధనములతోఁ జిగురుఁగండె నీమాయ
నిలువు నివురగాయ (?) నీమాయ
యెలమితో శ్రీవేంకటేశ నీకు శరణని
గెలుచుటగాక యిది గెలువఁగవశమా ॥అణు॥ 347

**అవతారిక :**

అన్నమాచార్యువారి అధ్యాత్మ కీర్తనలతో గొప్ప చిక్కేమిటంటే పైకి ఒక మాట వుంటే దాని అంతరార్థం ఇంకొకటుంటుంది. అన్నమయ్య వూహ గోప్యంగా వుంటుంది. ఈ కీర్తన వారి భావ గాంభీర్యానికి చక్కని వుదాహరణ. దేహి అంటే ఆత్మ. నేను అని మనం చెప్పుకొనే వీడు యెవరు? శరీరమా? అనేక మార్పులు చెంది నశించిపోయే ఈ శరీరం "నేను" కాదు. నాకు బాధ కలిగింది అంటే నొప్పి అంటే దేహానిది కాని బాధ అయితే దేహిది. కేవలం ఒక అణువు పరిణామంలో వుండే ఈ దేహిని నేను అంతే. కాని మునిగెద (అనేక శరీరాల్లో దూరుతుంటాను). లేచెద (ఆయా శరీరాల్లోంచి లేచి





బయటకు వస్తుంటాను). ముందర గానను (నాకు రేపు ఏం జరుగుతుందో తెలుసుకోలేను) మరి నా గతేమిటి? నీమాయ నెట్లా తెలియగలను?

**భావవివరణ:**

ఓ దేవదేవా నేను అణుమాత్రపు దేహిని (అణువు పరిమాణం వున్న ఆత్మను). అంతే. అయినా నేను మునిగెద (అనేక శరీరాల్లో దూరుతుంటాను). లేచెద (ఆయా శరీరాల్లోంచి బయటకు వస్తుంటాను). ముందర గానను (వాటిలో వున్నంత కాలమూ రేపు ఏం జరుగుతుందో తెలుసుకోలేను) పుట్టి, చస్తూ, అజ్ఞానంతో జీవిస్తుంటానని అర్థం.

ప్రభూ! ఈ సంసార జలధిలో వువ్వెత్తున లేచే తరగలు (తరంగాలు) నీమాయ. అడవి వలె అగమ్యగోచరమైన నిగమములు (వేదశాస్త్రములు) నీమాయ. రేయింబవళ్ళు, వుచ్చేభవములు (నశించే పుట్టుకలు) నీమాయ. ఆకాశమెంత అగమ్యగోచరమో నీ మాయ కూడా అంతే. అట్టిదానిని కడవగ (దాటుటకు) వశమా (మాకు సాధ్యమా?)

స్వామీ! బయలువందిలి (వ్యర్థప్రయత్నాలు అనేకం చేసి) కర్మబంధాలలో తగులుకొంటుంటాం. అదంతా నీమాయయే. నియమంతోవుండే గాలి, పెనుగాలి (ఝుంఝూమారుతమై) యై సర్వనాశనం చేయుట నీమాయ. "క్రియన్ ఇసుకపాతర కెల్లొత్తు నీమాయ" - పెళ్ళగించివేసి ఇసుక దిబ్బలో పూడ్చిపెట్టడం నీమాయ - (అంటే విలయనాశనం చేయటం కూడా నీమాయే). నిన్ను ఎదిరించి జనులు జయముతో బయటకు రాగలరా తండ్రీ!

స్వామీ ఉన్నతకులంలో పుట్టామని, ధనవంతులమని కొందరు మూర్ఖులు జిరుగుగండె (పక్షులను పట్టుకోవటానికి ఒక ఉచ్చు) లలో చిక్కుకుపోతుంటారు. అదంతా నీమాయే. ప్రభూ! నీమాయ మమ్మల్ని నిలువునా నివ్వెరపోవునట్లు చేయజాలినది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఎలమితో (వికాసముతో) నీకు శరణుజొచ్చితే నీమాయను గెలువగలరు గాని ఇంకో విధంగా నీమాయను గెలువగ వశమా? అసాధ్యం ప్రభూ!

సంపుటి : 3 కీర్తన : కలిగిననాడే చుట్టరికంబుల దిరుగు నిదె

సంఖ్య : 357 పుట : 241 రాగం : సామంతం

### సామంతం

75. కలిగిననాఁడే చుట్టరికంబులఁ దిరుగు నివి
నలుగడ నివి సతమని మతి నమ్ముట పాపమయా ॥పల్లవి॥

దేహముతోడనె పెరుగును తీరని యీఇంద్రియములు
దేహముతోడనె ముదియును తేటతెల్లమిగను
ఆహా పుట్టిననాఁడును అంతమునొందిననాఁడును
శ్రీహరిమాయలఁ దగులుక జీవునిఁ దడవ వివి ॥కలి॥

తెలిశున్నపుడే తగులును తియ్యనియీసంసారము
తెలివికిఁ బాసినయప్పుడు దిగఁబడుఁ దా నెందో
మలయక నిద్రించునప్పుడు మత్తుఁడై యున్నప్పుడు
చలమరి జీవునితోడుత సమ్మతమే లేదు ॥కలి॥

కన్నులు దెరచినయప్పుడే కాన్పించును యీలోకము
కన్నులు మూసినయప్పుడె కడగడఁ దా నణగు
అన్నిట శ్రీవేంకటేశ్వరుఁ డాత్మను వెలిఁగెడివేళను
వున్నతిజీవులఁ దగులవు వొదుగుచుఁ దిరుగు నివి ॥కలి॥ 357

**అవతారిక :**

సిరులుంటే మన దగ్గరకు బంధువులు నారికేళసలిలములాగా వస్తారు. ఆ సిరులు పోతే అదే బంధువులు కరిమ్రింగిన వెలగపండులోని గుజ్జులాగా మాయమైపోతారు - అన్నారు పెద్దలు. ఆ సత్యాన్నే అన్నమయ్య ఈ కీర్తనలో చెబుతున్నారు, కానీ ఇంకో విధంగా. ఇదే చుట్టరికాలు, లేనినాడు తిరుగున్, అంటున్నారు. వీటిని శాశ్వతమని నమ్మటం పాపమయ్యా! అంటున్నారు. శ్రీవేంకటేశ్వరుడు ఆత్మలో వెలిగిన





వేళ జీవులకు భ్రమలన్నీ తొలగిపోతాయి. ఈ కీర్తనలో "కడగడదానణగు" అను మాటకు సరితూగే అర్థం ఏ నిఘంటువులోను దొరకలేదు. సందర్భాన్నిబట్టి ఊహించవలసివచ్చింది.

**భావవివరణ:**

అయ్యా! (ఓ జనులారా!) చుట్టరికాలన్నీ కలిగిన వేళనే (ధనం వున్నప్పుడే) తిరుగున్ (నడుస్తాయి). ఇవి నలుగడ (నాలుగుదిక్కులా) సతతమని (శాశ్వతమని) మతి నమ్ముట (మనస్సులో తలచుట) పాపము.

ఈ ఇంద్రియములు దేహముతోపాటు పెరుగుతున్నాయి. ఈ దేహముతోపాటే అవీ ముసలివైపోతున్నాయి. స్పష్టమైన తెలివితేటలను పొందుతాయి. ఆహా! పుట్టినదగ్గరనుంచి చచ్చేదాకా జీవుని, ఆ శ్రీహరి మాయలు తగులుకొనేవుంటాయి. ఇవి తడవవు. (వదలవు అనే అర్థంలో ప్రయోగించబడింది).

మానవుడు మెలకువతో వున్నప్పుడే ఈ బాహ్య ప్రపంచం స్ఫురణలోకి వస్తుంది. నిద్రించినప్పుడు ఆ స్ఫురణ మాయమైపోతుంది. మానవులకు ఈ సంసార మాధుర్యం అనుభవంలోకి వచ్చినప్పుడు జీవితం మధురం అనిపిస్తుంది. నిద్రించి తెలివిలేని వేళల్లో తాను (ఆత్మ) ఎందో (ఎక్కడో) దిగబడి వుంటుంది. అదే విధముగా మత్తులో వున్నప్పుడు కూడా ఈ సంసారముతో ఎట్టి సంబంధమూ వుండదు. చలమరి జీవునితో (మాత్సర్యం కల జీవునితో) అటువంటి నిద్రావస్థలోనున్న వానికి సమ్మతమే (సంబంధమే) లేదు.

ఈలోకమున్నదే... ఇది మనం కన్నులు తెరచినప్పుడే మనకు కనబడుతుంటుంది. కన్నులు మూసినప్పుడు ఈలోకము "కడగడన్ తానణగును" (సమూలంగా మాయమవుతుంది). అదేవిధంగా శ్రీవేంకటేశ్వరుడు ఆత్మలో వెలుగుతున్నప్పుడు ఆ జీవునికి సుఖదు:ఖముల వంటి ద్వంద్వములు తాకవు. అవి ఒదుగుచు తిరుగాడును. (అణుకువగా సంచరిస్తుంటాయి).

సంపుటి : 3 కీర్తన : ఇట్టియవివేకబుద్ధి యేపనికివచ్చునిక
సంఖ్య : 189 పుట : 127 రాగం : బౌళి

**బౌళి**

76. ఇట్టియవివేకబుద్ధి యేపనికివచ్చు నిఁక
జట్టిగొని నాగుణము చక్కఁజేయఁగదవే. ॥పల్లవి॥

హరి నీయిచ్చఁ బ్రపంచమంతా నీవు నడపఁగ
అరసి నీశక్తి దెలియక నమ్మక
వెర వెరఁగనియట్టి వెఱ్ఱివాఁడ నే నొక్క -
దొరనంటాఁ బనుల కుద్యోగించేను ॥ఇట్టి॥

అంతరాత్మవై నీవు అన్నియుఁ బెరరేఁచఁగ
బంతినే నీమహిమెల్లా భావించక
చెంత నీసంసారము సేసేవాఁడ నే నంటా
దొంతులకోరికలతోఁ దూరిపారేను ॥ఇట్టి॥

ఆదినుండి స్వతంత్రుఁడవై యేలినట్టినిన్ను
సోదించి శరణు నాఁడే చొరఁగలేక
యీదెస శ్రీవేంకటేశ యిప్పుడు నీ దాసుఁడనై
నీదయకలిమితోడ నేఁడు మొక్కేను ॥ఇట్టి॥ 189

**అవతారిక :**

శ్రీహరిని ప్రార్థిస్తున్నారు అన్నమయ్య. ఇంత అవివేకమున్న నా బుద్ధి ఏపనికి వస్తుంది స్వామీ? నీవే ఏదోలాగున దీనిగుణములను చక్కజేయాలి. నిన్ను ఆదినుండే శరణుజొచ్చితే ఇంకా బాగుండేది. ఏదో నీదయవల్ల నీదాసుడనై నీకు మొక్కేను లేకుంటే నేనే మొనగాణ్ణి అనుకొని దొంతుల కోరికలతో దూరిపారేను అంటున్నారు.





భావవివరణ చదివితే ఇంకా తేటతెల్లమవుతుంది. ఇంతకీ... "జట్టిగొనుట", అంటే కొనుక్కోవడం. నాదుర్గుణాలు కొనేసుకుని కాస్త నన్ను చక్కగా చేయవయ్యా! అంటున్నారు.

**భావవివరణ:**

ఓ దేవదేవా! ఇట్టి అవివేకబుద్ధినిచ్చావు నాకు. ఇదెందుకు పనికివస్తుంది నాకు? నా గుణములను జట్టిగొని (కొనేసుకుని) చక్కజేయగదవే (సరిదిద్దరాదా?)

ఓ శ్రీహరీ! నీవు సృష్టించిన ప్రపంచం నీవు నడువగ (నడుపుతుంటే) అందులో జీవిస్తున్నాను. అనంతశక్తివంతమైన ప్రకృతి నిబద్ధతను చూచి కూడా నీశక్తి తెలియక నిన్ను నమ్మలేకున్నాను. నాదెంత వెఱ్ఱితనమంటే... వెరవెరగని (నిశ్చేష్టుడనైకూడా) నేనే దొరని అనుకొని ఏవేవో పనులను జేస్తుంటాను, చేయిస్తుంటాను.

ప్రభూ! నాలో అంతర్యామిగా నీవేవుండి, అన్నియున్ పెరరేచగా (ప్రేరేపిస్తుంటే) అన్నీ అనుభవిస్తూ కూడా నీ మహిమను భావించనైతి (అర్థం చేసికొనలేకపోయాను). నేనే సంసారమును చేసికొనుచున్నాను అనే అహంభావముతో దొంతుల కోరికల (వరుసగా ఒకదాని తరువాత ఇంకొకటి వచ్చే కోరికలతో) దూరిపారేను (సతమతమవుతూనేవున్నాను).

ఆదినుండి (సృష్టి మొదలయిన దగ్గరనుంచి) నీవు సర్వస్వతంత్రుడవు. భువనాల ఏలికవు. ఏనాడో నీశరణుపొందవలసింది. శోధన చేసి నీవే దిక్కు అని గ్రహించవలసింది. అట్లా చేయలేక అహంకరించి జీవించాను. కాని, నేడు నీ దయ కలిమితో (అనుగ్రహభాగ్యం పొంది) ఓ శ్రీవేంకటేశ్వరా! ఇప్పుడు నీ దాస్యము స్వీకరించి, యీదెస (ఇకపై) నీకు మొక్కేను. ధన్యుణ్ణి తండ్రీ!

సంపుటి : 3 కీర్తన : ఏమి సేయగలవాడనిదివో నేను

సంఖ్య : 200 పుట : 134 రాగం : ఆహిరి

**ఆహిరి**

77. ఏమి సేయఁగలవాఁడ నిదివో నేను
నీమరఁగు చొచ్చితిఁగా నీచిత్త మిఁకను. ॥పల్లవి॥

పుట్టినవాఁడను నేను భోగించేవాఁడను నేను
గట్టిగా నిప్పుడు నాకుఁ గర్తవు నీవు
పట్టరాదు జవ్వనము పాయరాదు సంసారము
యిట్టివెల్ల నీమాయ యేమీ ననరాదు ॥ఏమి॥

కడుఁగాంక్షలు నాసొమ్ము కర్మములు నాసొమ్ము
నడమ నంతర్యామివి నీకు నీవు
వుడివోవు కోరికలు వొదుగదు కోపము
కడదాఁకా నీమహిమ కాదనరాదు ॥ఏమి॥

భావించలేనివాడను ప్రకృతిలోని వాడను
శ్రీవేంకటేశ దయసేసితివి నీవు
తోవదప్పదు జ్ఞానముతొలగదు వివేకము
దేవుడవు నీ మర్మము తెలియఁగరాదు ॥ఏమి॥ 200

**అవతారిక :**

ఓ శ్రీవేంకటేశ్వరా! మేము చేయగలిగిందేముంది. ప్రభూ! నీఅండజేరాము. మమ్మల్నెట్లా దయచూచెదవో నీఇష్టం అంటున్నారు అన్నమాచార్యులవారు. మానవ జీవితమంతా నీమాయవలననే భ్రమలో సతమతమవుతున్నది. దానినేమీ అనరాదు. మనోవికారములు కోపతాపాలు నీ మహిమవల్లనే మమ్ము కడదాకా పీడిస్తున్నాయి. దాన్నెట్లా కాదంటాం స్వామీ! ప్రకృతికిలోనై నిన్ను భావింపలేకున్నాం. నీవే కృపజూపి తొలగని జ్ఞానం ఇవ్వాలి. మమ్మల్ని ఉద్ధరించాలి అంటున్నారు.





**భావవివరణ:**

ఓ దేవదేవా! నేను ఏమిచేయగలను? ఇదిగో, నేను నీ మరుగు చొచ్చితిగా (నీ ఆశ్రయం పొందితిని కదా!) ఇకపై అంతా నీ చిత్తము (ఇష్టం). పాలముంచినా నీటముంచినా నీదే భారం స్వామీ?

జన్మపొందినది నేను. సుఖాస్వాదన చేస్తున్నది నేను. కానీ ఇప్పుడు నాకు నీవే కర్తవు. ఈ మాట నిజం. యౌవనమదమును పట్టరాదు (ఆపుట అసాదమైన). సంసారబంధాలను పాయరాదు (విడనాడలేను). ఇవన్నీ నీమాయయే. వాటినేమని నిందించగలము? చేయించేవాడొకడు చేసేవాడొకడు చేయించేవాడు గొప్ప జగన్నియంత.

కడుకాంక్షలు (అంతులేని కోరికలు) నా సొమ్ము (సొత్తు). ఆకాంక్ష నెరవేరుటకు నేను చేసే కర్మలు నా సొత్తు. కానీ ఈ కర్మాచరణలో తప్పొప్పులను యెంచే నా అంతర్యామివి మాత్రం నీవే. నాకోరికలు యేమాత్రం వుడివోవు (తగ్గవు). అవి తీరనప్పుడు వచ్చే కోపము వొదగదు (నా ఆధీనంలో వుండదు). కడదాకా (నా చివరి క్షణం దాకా) అట్లాగే జరుగుతుంది. నీ మహిమను కాదనలేము తండ్రీ!

ఓశ్రీవేంకటేశ్వరా! నీ మాయ, నీ మహిమ నేను భావించలేకున్నాను. ఎందుకంటే నేను నీవు సృష్టించిన ప్రకృతికి అధీనుడనై జీవిస్తున్నాను. నా అదృష్టం కొద్దీ నీవు నాపై దయచూపించావు. ఇక నా త్రోవ ఎన్నటికీ తప్పదు. నాఆత్మజ్ఞానం నశించదు. వివేకము విస్తరించి వుంటుంది. నీవు నా దేవుడవు నీ మర్మము (రహస్యము తెలుసుకొనుట సాధ్యమా ప్రభూ!

సంపుటి : 3 కీర్తన : పెరిగిపెద్దగాను మరిపిన్నవాడగాను

సంఖ్య : 317 పుట : 214 రాగం : రామక్రియ

**రామక్రియ**

78. పెరిగి పెద్దఁగాను మరి పిన్న వాఁడఁగాను
యిరవుగ నేన బుదెరిఁగెడి దెపుడు ॥పల్లవి॥

కంకిగ బహునరకంబులు చొచ్చితి-
నింకా భయ మది యెరఁగను
జంకెనలనే పలుచదువులు చదివితి
మంకుఁదనం బిది మానదు ॥పెరి॥

తియ్యక కడుఁ బెనుదేహాలు మోచితి
నయ్యో యింకా నలయను
నెయ్యపు హేయము నిచ్చలుఁ గడిగెద
చియ్యని రోయను సిగ్గూఁ బడను ॥పెరి॥

ధర్మము సేసితి దానము లొసఁగితి
కర్మము లింకాఁ గడపను
అర్మిలి శ్రీవేంకటాధిప నీకృప
నిర్మల మైతిని నే నిపుడు ॥పెరి॥ 000

**అవతారిక :**

ఈ కీర్తన పల్లవిలోనే అచ్చుపొరబాటువల్ల కొంత అయోయమ స్థితి కలిగింది. "బుదెరిగెడి దెపుడు" అంటే ఎంతకీ అర్థం కాలేదు. ఒక నిఘంటువలో బుద్దెరుగుట అనే పదానికి జ్ఞానము పొందుట అనే అర్థము వున్నది. ఇక అది ముద్రారాక్షసం అయివుండవచ్చని భావించాను. అప్పుడు సందేహమేఘాలు చెల్లాచెదరయినాయి. నేను పెరిగి పెద్దవాడైన విజ్ఞానిని గాను ఏమీతెలియని పిన్నవాడనూ గాను. అజ్ఞానంలో తెలిసీ తెలియని





కర్మిష్ఠిని నాకున్న పరిమిత మతితో నేను బుద్ధెరిగెడిది (జ్ఞానినయ్యేది) యెప్పుడు? అని అడుగుతున్నారు అన్నమయ్య. శ్రీ వేంకటపతి కృప వుంటే అదెంతపని?

**భావవివరణ:**

నేను పెరిగి పెద్దను (జ్ఞానమున్న శ్రేష్ఠుడను) గాను. పోనీ, ఏమీ తెలియని పిన్నవాడనూ గాను. మరి ఇక నేను ఇరవుగ (స్థిరపడి) బుద్దెరుగుట (జ్ఞానమునందుకొనుట) ఎప్పుడు?

నేను కంకిగ (అందరినీ నిందించే ధూర్తునిగా) అనేక నరకముల ననుభవించాను, వాటిలో మగ్గాను. అయినా ఈ జీవికి భయము తెలియలేదు. గురువులచేత జంకెనలనొంది (భయపెట్టబడి) ఎన్నో చదువులు చదివాను, అయినా ఇది (ఈ నా జీవుడు) మంకుతనము (మొండితనము) మానదు. మళ్ళీ పాపాలు చేస్తూనే వుంటుంది. పుట్టుకలననుభవిస్తూనే వుంటుంది. తియ్యక (వదలకుండా) అనేక దేహములను ధరించితిని.

అయ్యో! ఇంకా అలయను (విసుగు జెందను). నిచ్చలు (ప్రతిసారీ) హేయమున్ గడిగెద (పాపప్రక్షాళన అప్పటికప్పుడు చేసికొంటూనే వున్నాను). చియ్యని (ఛీ ఛీ ఇదేమిటి అని) రోయను (అసహ్యపడను). సిగ్గులేక మళ్ళీ పాపాలు చేస్తూనే బ్రతుకుతాను.

సరే, ఆ పాపప్రక్షాళన కోసం అనేక ధర్మకార్యాలు చేశాను. దానములనిచ్చాను. ఈవిధంగా మళ్ళీ కర్మములలోనే తగులుకొంటున్నాను. దానివల్ల ఉత్తమ జన్మలు పొందుతూనే వున్నాను. మరి ఈ జీవిగతి ఇంతేనా? కాదు. ఓ శ్రీవేంకటేశ్వరా! అర్మిలి (ప్రేమతో) ఒకనాడు నీదయ నాపై కలిగింది. ఇప్పుడు నేను పాపప్రక్షాళన బొందిన నిర్మలుడనయ్యాను. ధన్యుణ్ణి తండ్రీ!

సంపుటి : 3 కీర్తన : అచ్చుతుకృపాలబ్ధి మదియు
సంఖ్య : 248 పుట : 166 రాగం : దేసాళం

**దేసాళం**

79. అచ్చుతుకృపాలబ్ధ మదియుఁగాక
మచ్చిక నాతఁడు సేసేమతకముగాక ॥పల్లవి॥

నానాపాట్లఁ బడె నాఁడు కరి మకరిచే
హీనదెస ప్రహ్లాదుఁడు హిరణ్యుచేఁ బాటువడె
పానిపట్టి హరి యది పరిహరించని నాఁడా
ఆనుక హరిదాసుల కంతటనే భంగమా ॥అచ్చు॥

తగిలి భీష్ముఁడు శరతల్పమందు నుండఁడా
అగడై విభీషణుఁడు అన్నచేఁ దన్నువడఁడా
పగపాడే చూచుచుండ భాగవతులను హరి (?)
తగినపుణ్యుల నిందు తప్పు లెంచవచ్చునా ॥అచ్చు॥

మంతనాన నారదుఁడు మాయలకుఁ లోనుగాఁడా
చెంతల నర్జునునకు చేతులు దెగిపడవా
ఇంతలో శ్రీవేంకటేశుఁ డిట్టెవీని మన్నించఁడా
ఇంతటి మహానుభావు లిందుకు జడుతురా ॥అచ్చు॥ 245

**అవతారిక :**

మహానుభావులు కూడా కర్మవశము చేత కష్టాలు అనుభవించారు. కరి మకరిచే నానాపాట్లు పడి "నీవే తప్ప నిత:పరంబెరుగ" అని ప్రార్థిస్తేనే కదా! హరి గజేంద్రునికి మోక్షం కల్పించాడు? అంటూ పెక్కు వుదాహరణలతో అచ్చుతు (అచ్చుతు) కృపాలబ్ధి ఆయన శరణాగతులకు లభిస్తుంది అంటున్నారు అన్నమయ్య. చేరువయై ఆయన చేసే మతకము (మాయ) గాక ఇంకేమిటి? ఆయనకి స్వపర బేధం వుంటుందా





అంటున్నారు.

**భావవివరణ:**

అచ్చుతు (అచ్యుతుని) కృపాలబ్ధము (దయగలుగుటయే) అదిగాక మరొక గతిలేదు. మచ్చికన్ (మోహము కలుగజేసే) ఆతడు చేయునట్టి మతకము (మాయలు) గాక వేరొకటి లేదు.

నాడు (ఆనాడు) కరి మకరిచే నానాపాట్లు పడె. (గజేంద్రమోక్ష సమయంలో గజరాజు మొసలిచేత అనేక శ్రమలకు గురియైనాడు). హీనమైన దశను బొందిన ప్రహ్లాదుడు తండ్రి హిరణ్యకశిపుని చేత అనేక బాధలననుభవించాడు. పానిపట్టి (నేటికాలంలో ఇదే మాటను పనిపట్టి అంటున్నాం... కార్యశీలుడై అని అర్థం). శ్రీహరి వారి కష్టాలను పరిహరించలేదా (తీర్చలేదా?) హరిదాసులను అంతటనే (అంతలోనే) ఆనుక భంగములు (అణచివేయు అవమానాలు) కలుగుతాయా? ఏనాటికీ కలుగవు.

శ్రీకృష్ణుని భక్తుడైన భీష్ముడు ఒంటినిండా గుచ్చుకొన్న బాణములే తల్పముగా పడివుండలేదా? శ్రీరాముని భక్తుడైన విభీషణుడు, అన్న రావణుని కాలితన్నులు తినలేదా? హరి పగపాడేచూచుచుండగా (శత్రువువలె చూస్తుంటే) భాగవతులను బాధలను భరించాకే కృప చూపాడు కదా! ఇందులో మనం తప్పుపట్టవచ్చునా? అంతా ఆ దేవదేవుని ఇష్టం.

నారాయణ నామంతోనే సంచరించే నారదుడు హరిమాయకులోనై రోదించాడు కదా! బావా అని పిలిచే అర్జునుడు కృష్ణమాయకు లోనై తనచేతులు తెగిపడినవని ఖిన్నుడైనాడు కదా! శ్రీవేంకటేశ్వరుడు వీరందరినీ మన్నించి ఇట్టే కరుణించలేదా? మహానుభావులైన హరిదాసులు ఇందుకు (హరిమాయకు) జడుతురా (భయపడతారా)? ఏనాటికీ భయపడరు.

సంపుటి : 4 కీర్తన : ఊరకే వెదకనేల వున్నవి చదువనేల

సంఖ్య : 196 పుట : 131 రాగం : సామంతం

## సామంతం

80. ఊరకే వెదకనేల వున్నవి చదువనేల
చేరువనె వున్నదిదె చెప్పరాని ఫలము ॥పల్లవి॥

కోపము విడిచితేనె పాపము దానే పోవు
దీపింప సుజ్ఞానముతెరు విదివో
లోపల మనిలుఁడై లోకముమెచ్చుకొరకు
పైపైఁగడిగితేను పావనుఁడౌనా ॥ఊర॥

ముందరికోరిక వోతే ముంచిన బంధాలు వీడు
కందువ నాస మానితే కైవల్యము
బొందిలోన నొకటియు భూమిలోన నొకటియు
చిందు వందు చిత్తమైతే చేరునా వైకుంఠము ॥ఊర॥

కాంతల పొందొల్లకుంటే ఘనదు:ఖమే లేదు
అంతరాత్మ శ్రీవేంకటాద్రీశుఁడు
అంతట మాటలె యాడి హరి శరణనకుంటే
దొంతినున్నభవములు తొలఁగునా వివేకికి ॥ఊర॥ 196

**అవతారిక :**

ఊరకనే శాస్త్ర గ్రంథాలన్నీ వెదకటం దేనికి? అందులో వున్నవన్నీ బుఱ్ఱలోకి ఎక్కించుకొని తిప్పలు పడటం దేనికి అంటున్నారు అన్నమాచార్యులవారు. చెప్పలేనంత ఫలితం నీ దగ్గరలోనే వుంది. నువ్వు చేయాల్సిందల్లా... కామక్రోధాలను కట్టడి చేయటం, ఆత్మజ్ఞానంతో వుండటము, ఆశకు లొంగకుండటం, కాంతాకనకాలపై వ్యామోహం విడనాడటం, శ్రీహరిశరణాగతితో వుండటం అంతే. "లోపల మనిలుడై





లోకము మెచ్చుకొరకు పైపై గడగితేను పావనులౌనా" అనే చరణంలో 'మనిలుడై' అనే మాట అచ్చుతప్పు అని నా అభిప్రాయం. అది 'మలినుడై' అని వుండాలి.

**భావవివరణ:**

ఓ మానవులారా! ఊరకనే కనుపించిన శాస్త్రగ్రంధాలనన్నింటినీ వెదకుట దేనికి? వాటిని చదివి శ్రమపడటం దేనికి? చెప్పరాని ఫలము (వివరించుట సాధ్యంకాని గొప్ప ఫలితము మీ దాపుననే వున్నది కదా! ఇంత చిన్నదానికి వేదాలు చదవాలా?

మనం మన కోపాన్ని విడిచిపెట్టామంటే పాపము దానంతట అదేపోతుంది. అప్పుడు సుజ్ఞానము దానంతట అదే దీపిస్తుంది (వెలుగొందుతుంది). మనస్సులోపల మలినుడై (మలినము కలిగినవాడై) పైపై గడగితే (పైకి మంచిగావుంటే) పావనులౌనా (పుణ్యాత్ములైపోతారా?) ఏనాటికీ కారు.

ముందరి కోరికలు (భవిష్యత్తులో లభించాలని కోరుకునే కామనలు) పోతేనేకాని వాటివల్ల కలిగే ప్రతిబంధకాలు పోవు. కందువ (సామర్థ్యంతో) ఆశను విడనాడితేగాని కైవల్యము (మోక్షము) సిద్ధించదు. బొందిలోన నొకటియు (మన శరీరంలోపల ఒక విధమైనట్లు) భూమిలోన నొకటియు (లోకం దృష్టిలో ఇంకొక విధమైనట్లు) మార్పులు చెందే చిత్తమైతే (మనస్సువుంటే) వైకుంఠం లభిస్తుందా?

కాంతల పొందు వొల్లకుంటే (స్త్రీ వ్యసనం లేకపోతే) దు:ఖానికి ఆస్కారం యెక్కడుంది? అంతరాత్ముడైయున్న శ్రీవేంకటేశ్వరునితో నిత్యమూ సంభాషిస్తూ ఆ శ్రీహరినే శరణు మహాప్రభో! అనకుంటే దొంతినున్న భవములు (కుప్పలు తెప్పలుగా రాబోయే జన్మలు) వివేకికి తొలుగునా? (వివేకవంతులైన వారికి తప్పుతాయా?)

సంపుటి : 3    కీర్తన : ఎటువంటివెట్టినో యేమని విన్నవింతును
సంఖ్య : 260    పుట : 176    రాగం : దేసాక్షి

## దేసాక్షి

81. ఎటువంటివెట్టినో యేమని విన్నవింతును
ఘటనలు నావంటా గర్వింతునయ్యా ॥పల్లవి॥

తలcచేతలcపు నీది తనువు నీ విచ్చినది
నిలిచినజగమ మెల్లా నీమయము
వలవంత నే నిందులో వట్టియహంకారినై
తెలియక నేనేయంటాc దిరిగేనయ్యా ॥ఎటు॥

సేసేచేఁత నీయాజ్ఞ చిత్తమెల్లా నీయిచ్చ
రాసులకర్మములు నీరపము లివి
ఆసపడి నే నిందులో అన్నియు నావనుచును
పోసరించి మాయలలోc బొరలెదనయ్యా ॥ఎటు॥

ఇహము నీవినోదమే యెన్నc బరము నీసొమ్మే
సహజము నీకు మాలోచైతన్యాలు
మహిలో శ్రీవేంకటేశ మరి నీదాసుcడనైతి
బహుభక్తి నీమీద బచరించేనయ్యా ॥ఎటు॥ 260

**అవతారిక :**

ఒల్లమాలిన అజ్ఞానంతో నరులు కర్తృత్వ భోక్తృత్వాలు తనవే అనుకుంటాడు. అంటే చేసేది తానే, అనుభవించేది తానే అనుకొంటుంటాడు. తేలిక ఉదాహరణలో చెప్పాలంటే ఈ అవతారిక భావవివరణలను నేను వ్రాశాననుకోవటం అజ్ఞానం. నాచేత ఆ ఏడుకొండలవాడు వ్రాయించాడను కోవటం వివేకం. అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో అదేమాట 'దేసాక్షి' రాగంలో చెబుతున్నారు. "ఎటువంటి వెట్టినో ఘటనలు నావంటా





గర్వింతునయ్యా!" అంటున్నారు. పల్లవి ఇంత తేలికగావుంటే మిగతా కీర్తన కొరుకుడుపడదు. ఇది నా అనుభవం.

**భావవివరణ:**

ఓ దేవదేవా! నేను ఎటువంటి వెట్టివాడనయ్యా! ఏమని నా వెట్టితనాన్ని వివరించను? చేసేవాడవు చేయించేవాడవూ నీవయితే జరుగుతున్న ఘటనలన్నీ నావల్లనని గర్వంతో అహంకరించుచున్నాను.

ఈ నా శరీరం నీవు ఇచ్చినదే. ఈనాతలపు నేనుతలచేది కాదు. నీ సంకల్పమే. నేను నిలుచున్న ఈ భూమి అది వున్న జగత్తు ఇంతనియమం పాటించుతున్నాయంటే అది నీవల్లనే కదా! నా వలవంత (మన్మథతాపము) ఎవరిచ్చారు? నీవే కదా! ఇందులో నాదేమున్నది? అయినా, వట్టి అహంకారినై తెలియక అన్నిటికీ నేనే యనుచు తిరుగుతున్నానయ్యా!

నా చిత్తమెల్లా నీ ఇచ్ఛతో నడుస్తున్నది. నేను చేసే చేతలన్నీ నీ ఆజ్ఞతో నడుస్తున్నాయి. రాసుల కర్మములు (రాశిగావున్న కర్మలన్నీ) నేను చేసిన ఇవి నీ నీరపములు (నీ చెల్లుబడి). అయితే మధ్యలో నేను ఆశాపాశబద్ధుడనై అన్నియూ నావని అంటూ, పోసరించి (కొవ్వెక్కి) నీమాయలలోపడి సంచరిస్తున్నాను. నాగతేమిటి తండ్రీ!

ఇహము (ఈలోకము) నీ వినోదం కొరకు నీవే సృష్టించుకొన్నావు. పరమూ నీ సొమ్మే. (పైనవుండే పరలోకాలన్నీ నీసొత్తే కదా!) అసలు మాలో వుండే చైతన్యమే నీవు. మా చేష్టలన్నీ నీకు సహజమే. ఓ శ్రీవేంకటేశ్వరా! మహిలో (భూమ్మీద పుట్టి) నేను నీదాసుడనైతినయ్యా! బహుభక్తి (నవవిధభక్తి మార్గాలతో) నిన్నున్ పచరించేనయ్యా ! (ఆరాధించెదను స్వామీ!)

సంపుటి : 2 కీర్తన : అతనినడుగవో చిత్రగుప్త

సంఖ్య : 293 పుట : 197 రాగం : లలిత

**లలిత**

82. అతని నడుగవో చిత్రగుప్త నాయందలియౌఁగాము లన్నియును
అతఁడే మీకుత్తరము చెప్పెడిని యన్నిటికిని మముఁ దడవకుమీ॥పల్లవి॥

కరచరణాదులు నాకుఁ గల్పించినయతఁడే
గరిమల నావుభయకర్మ సంఘములకుఁ దాఁ గర్తా
సరుగఁ బ్రాణము లొసఁగి చైతన్య మతఁడే
పరగఁగ నాయపరాధంబులు పరిహరించఁ గర్తా ॥అత॥

రమణతో ననుఁ బుట్టించి రక్షించేయతఁడే
అమరఁగ నన్ను వహించుక నావళుకంతయుఁ దీర్చఁగఁ దాఁ గర్తా
ప్రమదమున నాయంతరాత్మయైపాదుకొన్నయతఁడే
మమతల మీలోకము చొరకుండా మాఁటలాడుకొనఁ దానేకర్తా ॥అత॥

యెప్పుడుఁ బాయక దాసునిఁగా నేలుకొన్నయతఁడే
తప్పక యిహముఁబరమునిచ్చి వొరులు దడవకుండఁ జేయఁగఁ గర్తా
చెప్పఁగ నాపాలిదేవరా శ్రీవేంకటేశుఁ డతఁడే
అప్పణిచ్చి మిము సమ్మతి సేయుచు నటు మముఁ గావఁగఁ దానే కర్త ॥ఆత॥ 294

**అవతారిక :**

మానవునికి మోక్షం సిద్ధించాలంటే మనస్సే సాధనం. నరకద్వారం కూడా మనస్సే. చిత్రగుప్తుడు ఎక్కడో యమలోకంలో వుండి మన పాప పుణ్యాల చిట్టా వ్రాస్తున్నాడని మనం యమధర్మరాజుగారి ఎదుటకు వచ్చినప్పుడు ఆ చిట్టా విప్పుతాడనీ, అంతదాకా మన పాపపుణ్యాల చిట్టా రాస్తూనేవుంటాడని నమ్మకం. అన్నమాచార్యులవారు ఆ చిత్రగుప్తునితో నాఅందలి యౌగాములన్నిటికి ఆతడు (శ్రీవేంకటేశ్వరుడు) జవాబు





చెబుతాడు. ఆయన్ని అడుగవో. మమ్ము దడవకుమీ (మాజోలికి రాకు) అంటున్నారు. ఆయన వాదన బహుపసందుగా వుంది.

**భావవివరణ:**

ఓ చిత్రగుప్త మహాశయా! అతని (శ్రీవేంకటేశ్వరుని అడుగవో. నాయందలి ఔగాములు (యుక్తాయుక్తము)లన్నింటికినీ, అతడే మీకు వుత్తరము జెప్పెడిని (బదులు చెబుతాడు). మమ్మున్ తడవకుమీ (విచారించవద్దు...) అంటే ప్రశ్నించవద్దు.

నాకు కాళ్ళూ చేతులు ఇచ్చింది శ్రీహరే కదా! మరి నావుభయకర్మలకు (సంచిత మరియు ఆగామికర్మలకు) ఆయనే కదా! కర్త? నా ప్రాణములు సరుగ (వర్ధిల్లుటకు) ఇవ్వబడిన చైతన్యమతడే. మరి నా అపరాధములను పరిహరించుటకు కర్త కూడ అతడే కదా! అవి పరిహరింపబడక నీవునన్ను పాపిగా దలచినచో ఇందు నాదోసమేమున్నది?

రమణతో (చక్కగా) నన్ను పుట్టించి, రక్షించే యతడే ఆ శ్రీహరి. ఆయనే తగినట్లుగా నన్ను సరిచూచుకొంటూ, నా వళుకంతా (తగవు) తీర్చి రక్షించుటకు కర్త అయివున్నాడు. ప్రమదమున (సగర్వంగా) నా అంతరాత్మయై పాదుకొన్న (స్థిరపడిన) అతడే (శ్రీహరే) మమతలతో మీ లోకమున కట్టుబడకుండా, మీతో మాట్లాడుకొంటాడు. ధర్మం బోధిస్తాడు. తానే అన్నిటికీ కర్త.

ఆ శ్రీహరి ఎప్పుడూ విడువక తనదాసుని వలె ఏలుకొని తప్పక తన భక్తులకు ఇహపరములను వొసగును. ఒరులు తడవకుండజేయును. తనవారు దు:ఖించకుండ జేయును. చెప్పాలంటే నాపాలి దైవమైన శ్రీవేంకటేశ్వరుడు మిమ్ము సమ్మతిచేయుచు (మిమ్మల్ని సద్బుద్ధి గలవారిగ సేయుచు) ఆవిధముగా మమ్ము రక్షించగా తానే కర్తయగుచు మీరు అర్పించుకొనునట్లు జేయును.

సంపుటి : 3 కీర్తన : జీవుడనేనొకడను సృష్టికి గర్తవు నీవు
సంఖ్య : 257 పుట : 186 రాగం : భైరవి

### భైరవి

83. జీవుఁడ నేనొకఁడను సృష్టికిఁ గర్తవు నీవు
యీవల ధర్మపుణ్యము లివివో నీచేతివి ॥పల్లవి॥

పుట్టినయట్టిదోషాలు పురుషోత్తమా నీవు
పట్టి తెంచివేయక పాయనేరవు
గట్టిగా సంసారములోఁ గలిగినలంపటాలు
ముట్టి నీవల్ల నేకాని మోయరావు ॥జీవుఁ॥

పంచభూతవికారాలు పరమాత్ముఁడా నీవే
కొంచక నీయాజ్ఞఁగాని కొద్ది నుండవు
అంచెల జగములోని ఆయాసహజములు
వంచుక నీవల్లఁగాని వైపుగావు ॥జీవుఁ॥

చిత్తములో విజ్ఞానము శ్రీవేంకటేశ నీవె
హత్తించి చూపినఁగాని యంకెకురాదు
సత్తుగా నిన్నిటికి నీశరణుచొచ్చితి మిదె
నిత్తెముఁ గావఁ బ్రోవ నీయిచ్చే యిఁకను ॥జీవుఁ॥ 275

**అవతారిక :**

భగవంతుడికి మనపై దయకలిగి మనపుట్టుకలోని దోషాలు తెంచివేస్తాడు. స్త్రీ వ్యసనం వున్నవాడు వేమనలాగ యోగి అయిపోతాడు. అశోకచక్రవర్తి ప్రజాహిత కార్యక్రమాలు చేస్తాడు. ధర్మపుణ్యాలు మనంచేసినట్లు కనబడినా అవి నీ చేతివి అంటున్నారు అన్నమయ్య. నేను నిమిత్తమాత్రుడనైన జీవుడను. మరి నీవో సృష్టికర్తవు. నాలో ధర్మచింతన రావాలంటే నీవు సంకల్పించాలి. కానీ ఇది ఇంకొకరివల్ల అయ్యేపనికాదు.





సత్తుగా నీ శరణుజొచ్చితిమి, నిత్తెము గావ బ్రోవ నీయిచ్చే యికను అంటున్నారు.

**భావవివరణ:**

ఓ దేవదేవా! నేను జీవుడను. మరి నీవో సృష్టికర్తవు. ఈవల (ఈపైన) మేము చేసే ధర్మకార్యాలు (పుణ్యకార్యాలు) నీచేతలు (నీవు సంకల్పించి మాచేత చేయించిన పనులు) లేకుంటే మాకు ఆ మంచిపని చేయాలనే ఆలోచనే కలుగదు ప్రభూ!

ఓ పురుషోత్తమా! మాపుట్టుకతోనే వచ్చిన కొన్ని దోసాలు యెంతకీపోవు. నీకు దయకలిగి వాటినిపట్టి తెంచాల్సిందే. లేకపోతే అవి పాయనేరవు (పోనేపోవు). ఈ సంసారంలో అనేక లంపంటాలు (పీకులాటలు) కలుగుతుంటాయి. అవి ముట్టి (అంటుకున్నాక) నీవల్లకాని (నీ సంకల్పం వలనగాని) మోయరావు (భరించలేము).

పంచభూతాలని పిలువబడే గాలి, నీరు, వెలుగు (అగ్ని), భూమి, ఆకాశములు అనేక మానసిక, శారీరక మార్పులు మనలో కలిగించి మానవుని ప్రవర్తన ప్రకృతి అదుపాజ్ఞలలో వుంచుతున్నది. ఓ పరమాత్మా! నీ ఆజ్ఞానుసారమే ప్రకృతి నడుస్తుంది. జగములోని సహజమైన ఆయాపరిణామములన్నియు వంచి నీవు బాగుచేస్తే నీవల్ల అవి నీవైపు తిరుగుతాయి. లేకపోతే జన్మలెత్తటమే కానీ అంతూ పొంతూ వుండదు.

ఓ శ్రీవేంకటేశ్వరా! మామనస్సులో ఒకనాడు విజ్ఞానము (ఆత్మజ్ఞానము) నీవు హత్తించి (కలిగించి) చూపితేగాని అంకెకురాదు, (నీవశముకాదు). సత్తుగా (సత్యము నీవొక్కడవే అని) తెలిసికొని నిన్ను ఒకనాడు శరణుజొచ్చితే నిత్తెము (నిత్యము) కావబ్రోవ (పాలించి రక్షించుటకు), ఇకను నీయిచ్చే (ఇంక నీ ఇష్టమే) తండ్రీ!.

సంపుటి : 2 కీర్తన : నీవువెట్టినట్టిచిక్కు నీవే తెలుపవలె

సంఖ్య : 360 పుట : 242 రాగం : దేసాక్షి

## దేసాక్షి

84. నీవు వెట్టినట్టిచిక్కు నీవే తెలుపవలె
నావశమా తెలియ నారాయణా ॥పల్లవి॥

నీటిలోన నొకబుగ్గ నిమిషములోనఁ బుట్టి
కోటిసేసినట్లుండుఁ గొంతవడి
పాటించి యందే యడఁగెఁ బ్రకృతియో బ్రహ్మమో
యేఁటిదో వీనియర్థ మెరిఁగించవయ్య ॥నీవు॥

ఆకసాన నొకగాలి అట్టె మ్రోయుచుఁ బొడమి
లోకము సేయ విసరు లోలోనె
మైకొని యందే యడఁగె మాయయో సత్యమో
యీకడ నీయర్థము మా కెఱిఁగించవయ్య ॥నీవు॥

భూమిలోన మొలకలు పుట్టుచు శ్రీవేంకటేశ
వాములై వెలయు సేసేవారికి
ఆముక యందే యడఁగె అసత్తో ఇది సత్తో
యేమో యీయర్థము మా కెరిఁగించవయ్య ॥నీవు॥ 360

**అవతారిక :**

ఓ నారాయణుడా! నీవు కల్పించిన చిక్కుముళ్ళన్నీ నీవే విప్పాలి. నావశమా? అంటున్నారు అన్నమాచార్యులవారు. నీటిలో బుడగపుట్టి కొంతసేపుండి ఏకారణములేక తనంతటతానే సమసిపోతుంది. ఎప్పుడు పుడుతుంది? ఎంతసేపు వుంటుంది? చెప్పగలవారెవ్వరు? ఓశ్రీవేంకటేశ్వరా! బూమిలో మొలకలు పుట్టి ఎలా మొక్కలౌతున్నాయి? ఇది సత్తుయా అసత్తుయా వీటి అర్థములను విడమరచి చెప్పగల సామర్థ్యం నీకొక్కడికే వుందయ్యా!





**భావవివరణ:**

ఓ నారాయణుడా! నీవు వెట్టిన (కల్పించిన) చిక్కులు (సమస్యలను) నీవే తెలుపవలె (నీవే పరిష్కరించవలెను). తెలియ నా వశమా? (వాటిని గ్రహించుట నాశక్యమా?)

నీటిలోన ఒక బుగ్గ (బుడగ) నిముషములోన పుట్టి కోటిసేసినట్లుండు (అతిశయించినట్లుండు) కొంతవడి (కొంతసేపు) అట్లుండి, పాటించి (ధరించి) అందే అడగు (నశించిపోతుంది అక్కడే). మరి ఇది ప్రకృతియా, బ్రహ్మమా, ఎటువంటిది? దీనియర్థము యెఱుగలేకున్నాను. నశించేది బ్రహ్మమెట్లా అవుతుంది? నిజమే కాని నీటిలో నీరే కలిసిపోయింది. ఇక నశించిందేముంది? నాకు ఈతత్త్వమే అర్థంకావటంలేదు.

ఆకాశంలో ఒక గాలి ఝుంఝామారుతంలా మ్రోయుచు (శబ్దంచేస్తూ) బొడమినది (పుట్టినది). లోకము సేయ విసరు (లోకమును కల్లోలపరచునది) (టోర్నెడో) మైకొని అందే అడుగు (సమ్మతించినట్లు వచ్చింది వచ్చినట్లే పోతుంది). వినాశనం మాత్రం జరిగింది. ఇది సత్యమా? మాయయా? ఇక్కడ మాకు నీ ఈ చేష్టకు అర్థము వివరించవయ్యా!

ఎవ్వరూ నాటకుండానే చిన్న మొక్క మొలచింది. అది చిన్న మొక్కై తరవాత పెద్ద వాములుగా మారి పెరుగుతుంది. ఆ విధంగా ఆముకయుండి (విస్తరించియుండి) అందే అడగు (ఎట్లా పుట్టిందో అలాగే నశించిపోతుంది). నశించింది, కాబట్టి ఇది సత్తుకాదు. దానికెవ్వరూ కర్తకాదు. కాబట్టి సత్తా? ఏది సత్తు ఏది అసత్తు? ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ అర్థము నెరిగించవయ్యా! బుఱ్ఱను తొలచివేసే ఈ సందేహాలు యెవరు తీరుస్తారు స్వామీ?

సంపుటి : 2 కీర్తన : ఒకటి సుజ్ఞానము ఒకటి అజ్ఞానము

సంఖ్య : 357 పుట : 240 రాగం : ధన్నాసి

**ధన్నాసి**

85. ఒకటి సుజ్ఞానము ఒకటి అజ్ఞానము
ప్రకటించి వొకటి చేపట్టరో వివేకులు ॥పల్లవి॥

తనుఁ దలఁచుకొంటేను తక్కినదేహభోగాలు
పనికిరావు అవి ప్రకృతిగాన
ఘనమైనలోకభోగములతో లోలుఁడైతే
తనుఁ గానరాదు జీవతత్త్వముగాన ॥ఒక॥

దైవము నెఱిఁగితేను తన కామ్యకర్మములు
భావించి మఱవవలె బంధాలుగాన
కావించేటితన కామ్మ కర్మాలఁ గట్టువడితే
దైవము లోను గాఁడు స్వతంత్రుఁడుగాన ॥ఒక॥

సరి మోక్షముగోరితే స్వర్గము తెరువు గాదు
అరయ స్వర్గము తెరువల మోక్షానకు
పరగ నలమేల్మంగపతి శ్రీవేంకటేశుని
శరణాగతియె సర్వసాధనముగాన ॥ఒక॥ 357

**అవతారిక :**

మానవులు ఈ శరీరం వదలి పరలోకములు చేరి వారి పుణ్యానుసారం స్వర్గ నరకాలనుభవిస్తారని ప్రతీతి. స్వర్గసుఖాలు కోరి యజ్ఞయాగాదికామ్యకర్మములు యెన్ని చేసినప్పటికీ వారి పుణ్యం క్షీణించగానే తిరిగి జన్మపొందాలని వేదం చెబుతున్నది. మోక్షము పొందితే తిరిగి జన్మవుండదు. మోక్షము కొరకు ఆలోచింపజేసేది సుజ్ఞానము. కామ్య కర్మలనాచరించమనేది అజ్ఞానము. వివేకులైనవారు తమతమ ఇచ్ఛానుసారం యేదేని ఒకటి చేపట్టాలి అంటున్నారు అన్నమయ్య. అరయ స్వర్గము తెరువల





మోక్షమునకు అలమేల్మంగపతి యొక్క శరణాగతియే సర్వసాధనము అంటున్నారు. అంటే ఏమిటో భావవివరణలో ఆస్వాదించండి.

**భావవివరణ:**

నేను చెప్పబోవు రెండిటిలో ఒకటి సుజ్ఞానమును ప్రకటించుచున్నది. ఇంకొకటి అజ్ఞానమును ప్రకటించుచున్నది. ఓ వివేకవంతులారా! మీకు తగినట్లు రెండిటిలో ఏదో ఒకదానిని చేకొనుడు.

మానవుడు అనుభవించే దేహభోగములన్నీ ప్రకృతి వల్ల జనించినవి. వాటి స్థాయికూడ తక్కువే. అవి పనికిమాలినవి. ఇహలోకభోగములు ఘనమైనవే, కాని వాటికి లోలుడైన (వశుడైన) చో జీవతత్త్వము కూడ కానరాదు. తోటి జీవిని ప్రేమించలేడు. అజ్ఞాన జనిత అహంకారముతో జీవిస్తుంటాడు.

దైవము నెరిగించేది సుజ్ఞానము. దానినెరిగితే, కామ్యకర్మలకు కట్టువడడు. తాను ఆచరించు కర్మలన్నీ కామ్య కర్మలని, ఇచ్ఛలేకుండా కర్తవ్యభావంతో చేస్తాడు. అన్ని బంధములను పరిగణించడు. తను కావించే (నెరవేర్చే) కామ్యకర్మలతో కట్టువడడు, ఎందుకంటే అలా కట్టువడినవారికి దైవములోనుగాడు (లొంగడు). ఎందుచేతనంటే దైవము సర్వస్వతంత్రుడు. ఆయన దేనికీ కట్టువడడు.

ఇక భగవంతుని ఆశ్రయించినవారు మోక్షము కోరుకుంటారు. అది సహజమే కాని ఆయన సరి (మంచిదే... ముందు) స్వర్గము ఇస్తాను, స్వర్గ సుఖాలు అనుభవించు అంటాడు. మోక్షము గోరితే స్వర్గము తెరువుగాదు (వాడి మార్గము కాదు). అరయ (పరిశీలిస్తే) స్వర్గము, మోక్షమునకు తెరువల (దారిదోపిడి దొంగ). అందుకని మోక్షమును ఆశించేవారు సుజ్ఞాన, అజ్ఞానముల జోలికి పోకుండా, అలమేల్మంగపతియైన శ్రీవేంకటేశుని శరణాగతి పొందవలెను. అదియే సర్వసాధనము. కావున మోక్షాపేక్షగలవారు స్వామిని శరణంటే చాలు.

సంపుటి : 2 కీర్తన : గౌరబైమొదలుండగ గొనలకు నీరేల

సంఖ్య : 409 పుట : 274 రాగం : పాడి

**పాడి**

86. గౌరబై మొదలుండఁగఁ గొనలకు నీ రేల
దొరదైవ మితఁడే తుదఁగలఫలము ॥పల్లవి॥

క్రతువులు హరియే కర్మము హరియే
పితరులకు హరియే పెనుఁదృప్తి
సతతమంత్రములసారము హరియే
యితనిసేవే పో యిన్నిటిఫలము ॥గౌర॥

అనలము హరియే ఆహుతి హరియే
జననీజనకులసరవి హరే
పనివడి వేదముఁ బ్రణవము హరియే
యెనసితనిపూజ యిన్నిటిఫలము ॥గౌర॥

యేలికె హరియే యిరవును హరియే
వాలాయము సర్వము హరియే
కాలము శ్రీవేంకటగిరిహరియే
నేల నీతనిశరణే సఫలంబు ॥గౌర॥ 406

**అవతారిక :**

సర్వమూ హరియే. ఆయనగాక అన్యమేదియును లేదు అంటున్నారు అన్నమయ్య. 'గౌరబు' అంటే గౌరవించదగిన అని అర్థం. ఇదివరలో చెప్పినట్లు చాలా సందర్భాల్లో ఆచార్యులవారి పల్లవే అర్థంకాదు. ఒక చెట్టువుంటే ఎవరన్నా దాని మొదలులో నీళ్ళుపోస్తారు కానీ చెట్టు కొమ్మల చివరలకు నీళ్ళుపోస్తారా? దొరదైవము అంటే దైవములందరికీ దొర... అంటే... దేవదేవుడు అన్నమాట. తుదగలఫలము అంటే మోక్షము. ఈ పల్లవికి అర్థమేమంటే... మోక్షప్రదాత అయిన ఈ దేవదేవుడు, ఇతడే





మనతోడువుంటే అన్యదేవతలెందుకండీ... గౌరవప్రదమైన చెట్టు మొదలులో నీరు పోస్తారా? కొమ్మల చివర్లకు నీరు పోస్తారా?

**భావవివరణ:**

ఓ మానవులారా! ఎవరైనా గౌరబైన (గౌరవప్రదమైన) చెట్టు మొదళ్ళలో నీరుపోస్తారు కానీ కొమ్మల చివర్లలో పోస్తారా? వాటికి నీరెందుకు? అదే విధంగా దేవదేవుడైన ఇతడే మోక్షప్రదాత కావున ఈయన నాశ్రయించాలి కాని యితర దేవతలతో పనేమిటి? సర్వమూ హరియే కదా!

మనం చేసే క్రతువులు (యజ్ఞయాగాలు) శ్రీహరియే. వాటి కర్మకాండ అంతా శ్రీహరియే. పితరులకు పెనుదృప్తి (పితృదేవతలకి తృప్తిగా శ్రాద్ధఫలము నందించేవాడూ) శ్రీహరియే. సతతమంత్రముల (వేదమంత్రముల) సారము కూడా శ్రీహరియే. ఇతనిని సేవిస్తే వీటన్నిటిఫలమూ వచ్చినట్లే కదా! ఆలోచించండి.

అసలు ఇంత పటాటోపంతో హెూమాలు ఆహుతులు చేస్తారు కదా! ఆలోచించండి. ఈ అగ్నిహెూత్రుడెవరు. శ్రీహరి సృష్టియే కదా! పోనీ ఈ అగ్నిలో చేసే ఆహుతి యెవరు? అదీ శ్రీహరియే. తల్లీదండ్రుల సరవి (ఒకరి తరువాత ఒకరు వచ్చే క్రమము) యెవరు? అదీ శ్రీహరియే. వేదములన్నీ పనివడి (పనివేళా) ఘోషించే ప్రణవము (ఓంకారము) యెవరు? శ్రీహరియే. మరి, యెనసి (పూనుకొని) ఇతనిని పూజిస్తే ఇవన్నీ చేసినట్లేకదా!

ఈ చతుర్దశభువనాలకు ఏలిక శ్రీహరియే. ఇరవును (వాటిస్థానము కూడా) శ్రీహరియే. వాలాయము (అనివార్యము) హరియే (అనగా పగలు తరువాత రాత్రీ, రాత్రి తరువాత పగలు చావు పుట్టుకలు, ప్రకృతి విధానము సర్వమూ శ్రీహరియే). కాలపురుషుడు కూడా వేంకటాచలము మీదనున్న ఈ శ్రీహరియే. నేల (ఈలోకంలో) ఈ మహానుభావుని శరణాగతియే సఫలంబు (సర్వఫలములనొసగి తరింపజేయును).

సంపుటి : 2 కీర్తన : ఏవుపాయములు మాకింకబనికిరావు

సంఖ్య : 408 పుట : 275 రాగం : శుద్ధవసంతం

**శుద్ధవసంతం**

87. ఏవుపాయములు మా కిఁకఁ బనికిరావు
నీవే హరి కావవే నిరుహేతుకమున ॥పల్లవి॥

యివల నింద్రియజయం బేడ నే నేడ
భువి నింద్రియములతోఁ బుట్టె నీతనువు
ఆవల నిశ్చలబుద్ధి అది యేడ నే నేడ
భవము చంచలమనసు పంగెమే యెపుడు ॥ఏవు॥

యెలమిఁ గర్మవిముక్తి యేడ నే నేడ
తెలియంగఁ గర్మాధీన మీబ్రదుకు
కుళకమగుసాత్వికపుగుణ మేడ నే నేడ
కలియుగం బిది యిందుఁ గలవాఁడ నేను ॥ఏవు॥

తనివోనిఘోరతప మేడ నే నేడ
అనిశంబు నీకు శరణాగతుఁడను
యెనలేని శ్రీవేంకటేశ్వరుఁడ నీబిరుదు
కనుఁగొనఁగ శరణాగతపారిజాతం ॥ఏవు॥ 408

**అవతారిక :**

ఓ శ్రీహరీ! మమ్మల్ని ఏ వుపాయములూ రక్షించలేవు. నన్ను రక్షించటానికి నీకు హేతువు (కారణం) కూడా లేదు. అయినా సరే దీనుడను. నీకు శరణుజొచ్చియున్నాను. శరణాగత పారిజాతం అనే నీపేరు నిలబెట్టుకోవటానికైనా నన్ను రక్షించక నీకు తప్పదు అంటున్నారు అన్నమయ్య. అసలు నేనెంతవాణ్ణి? ఇంద్రియాలపై విజయం, నిశ్చలబుద్ధి, కర్మవిముక్తి, సాత్విక గుణం, తపోదీక్ష ఇటువంటి పెద్దపెద్దమాటలు నాకేం





తెలుస్తాయి ప్రభూ! అవెక్కడ నేనెక్కడ? ఇది కలియుగం స్వామీ! ఇందులో నాబోటి వాళ్ళే ఎక్కువ. మరి మాగతేమిటి?

**భావవివరణ:**

ఓ ప్రభూ! మాకిక ఏ ఉపాయములూ పనికిరావు. ఓ శ్రీహరీ! నీవే మమ్ము నిర్హేతుకముగానైనా, కావవే. అంటే మమ్మల్ని రక్షించవలసిన అవసరం నీకు లేదు. కానీ మమ్మల్ని రక్షించు.

ఇక యిటుచూస్తే నాకు ఇంద్రియ నిగ్రహం లేదు. ఇంద్రియ జయం యెక్కడ నేనెక్కడ? ఎందుకంటే ఈ తనువు (శరీరం) భూమ్మీద ఇంద్రియాలతోనే పుట్టింది కదా! అటువైపు చూద్దామంటే మనస్సు నా భవము (పుట్టుకే) చంచల బుద్ధితో కలిగింది. నిశ్చల బుద్ధియెక్కడ నేనెక్కడ? నా మనస్సు ఎప్పుడూ పంగెమే (ట్రాప్ - ఉచ్చు) అది నన్ను బంధించివుంచుతుంటుంది.

ఎలమి (సంతసించుటకు) కర్మవిముక్తి నాకు సాధ్యమా ప్రభూ! అదెక్కడ నేనెక్కడ? నా బ్రతుకంతా కర్మాధీనమే కదా! కర్మలు చేస్తూనేవున్నాను, ఫలితం అనుభవిస్తూనే వున్నాను. దీనికి విముక్తి యెప్పుడు? కుళకమగు సాత్విక గుణము యెక్కడ నేనెక్కడ (కుళుపు అంటే ఉంగరంలో పొదిగే మణి. కావున, విలువైన మణివంటి సాత్విక గుణము యెక్కడ నేనెక్కడ అని భావిస్తున్నాను.) ఓ మహానుభావా! ఇది కలియుగం. నేను ఇందులోవుంటే నాకు మంచి బుద్ధులెలా వస్తాయి?

పోనీ ఒక మూల కూర్చొని, తనివోని (తృప్తితీరని) ఘోరతపస్సు చేసి నిన్ను మెప్పిద్దామనుకొంటే, తపస్సెక్కడ నేనెక్కడ? నేను నీకు అనిశంబు (ఎల్లప్పుడూ) శరణాగతుడనే. శరణు అంటూ నిన్ను అర్థిస్తూనేవుంటాను. ఎనలేని శ్రీవేంకటేశ్వరా! నీ బిరుదేమిటో ఆలోచించు. శరణాగత పారిజాతము అని ఇంకెవరినన్నా అంటారా? మరి నీవు కాక నన్ను యెవరు రక్షిస్తారు తండ్రీ!

సంపుటి : 2 కీర్తన : నీవేసేసిన చేత నీవే చేకొనుటింతే

సంఖ్య : 444 పుట : 299 రాగం : గుండక్రియ

**గుండక్రియ**

88. నీవే సేసినచేఁత నీవే చేకొనుటింతే
యీవల నీసొమ్ము నీకే ఇయ్య సిగ్గయ్యీనయ్యా ॥పల్లవి॥

ఆలు బిడ్డలఁ గని యటు దనమగనికి
సీలాన సమర్పణ సేయవలెనటవయ్యా
తాలిమిఁ బుణ్యాలు సేసి దైవమా నే నీకు
యేలీల సమర్పించే నిందుకే నువ్వు వచ్చీనయ్యా ॥నీవే॥

అంకెలఁ గన్నకొడుకటు దమతండ్రికిని
తెంకి నే నీవాఁడ నని తెలుపఁగవలెనటవయ్యా
లంకె నాలోపలనున్న లక్ష్మీశ నే నీకు
పొంకపు నీ బంట నన్నఁ బునరుక్తయ్యీ నయ్యా ॥నీవే॥

తననీడ యుద్దములోఁ దానే యటు చూచి
పనివడి వూరకే భ్రమయవలెనటయ్యా
అనుగుశ్రీవేంకటేశ ఆతుమలోనున్న నిన్ను
గని మని శరణంటిఁ గడఁ బూజించనేలయ్యా ॥నీవే॥ 444

**అవతారిక :**

మనం స్వామికి "నైవేద్యం సమర్పయామి" అంటూ నివేదిస్తుంటాం. ఒక్కసారి ఆలోచిస్తే ఆ నివేదన చేసేది లడ్డూ కానీ పొంగల్ కానీ దేంతో చేశారో, ఆ పదార్థం చేసింది యెవరు? మనం కాదు కదా! బంగారు వజ్రాల 'సొమ్ములు' స్వామికి 'కానుకగా చదివిస్తాం'. బంగారం, వజ్రం మనం చేశామా? నీవు చేసినవి నీవే తీసుకొంటున్నావు... ఇందులో నా గొప్పయేముంది? అట్లా 'సమర్పయామి' అంటూ ఇయ్యటానికి





సిగ్గుగావుందయ్యా! అంటున్నారు అన్నమయ్య. ఇవన్నీ చూస్తూ ఆత్మలోనేవున్న నీకు శరణని అననివాడిని యేమనాలో తెలియటం లేదు. ఇంకా వేరే పూజించాలా? అంటున్నారు.

**భావవివరణ:**

ఓ దేవదేవా! ఈ సృష్టిలో సమస్తమూ నీవు చేసిన చేతలే. మేము నీకు వాటిని నివేదించుట అంటే వాటిని నీవే చేకొంటున్నావు. ఆవల (అటుపైన) నీ సొమ్ము నీకే సమర్పిస్తున్నాం. ఇందుకు సిగ్గవుతున్నది స్వామీ!

ఒక భార్య తన శీలము నిరూపించుకోవటానికి తన మగనికి బిడ్డలను కని ఇవ్వాలా? ఆమె ఆయనతో పొరపొచ్చాలులేక సంసారంచేస్తే చాలదా? నేను చేసే పుణ్యకార్యాలు ఎలా చేస్తున్నాను? ఓ దైవమా! సంకల్పం కలిగించింది నీవు. ఆ సంకల్పం కార్యరూపంలోపెట్టే సమర్థతనిచ్చింది నీవు. మరి ఏలీల (విధము)గా నీకు 'సమర్పయామి' అంటున్నానయ్యా! ఇందుకే నాకు నవ్వు వస్తున్నది.

ఒక కన్నకొడుకు తన కన్న తండ్రికి అంకెలన్ (వశమై) నేను నీవాడను (కొడుకు) అని తెంకి (సుస్థిరంగా) చెప్పవలెనటయ్యా! ఆ సంగతి తండ్రికి తెలియదూ! నాలో అంతర్యామివలెనున్న ఓ లక్ష్మీపతీ! నేను పొంకపు బంటు (పొందికగల భృత్యుడు) అని చెప్పుకొంటే పునరుక్తమయ్యేనయ్యా! (చెప్పిందే మళ్ళీమళ్ళీ చెప్పినట్లు అవుతుందయ్యా!)

ఒకడు అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకొని మురిసిపోతుంటే వాణ్ణి చూసి మనకు నవ్వు వస్తుంది కదా! తెలివిగలవాడు పనివడి (కావాలని) వూరకే భ్రమయవలెనటయ్యా! (అద్దంలో చూసికొంటున్న ఆ వ్యక్తిలాగా భ్రమపడవలెనా?) అనుగు (ముఖ్యుడవైన) ఓ శ్రీవేంకటేశ్వరా! నా ఆత్మలోనే వున్న నిన్ను దర్శించి కడనే (చివరకు) శరణంటిని. ఇంకా పూజించనేల? నీవే నేను, నేనే నీవు కదయ్యా!

సంపుటి : 2    కీర్తన : ఇదియరుదను నొకడిదియరుదని చెప్పు

సంఖ్య : 421    పుట : 284    రాగం : లలిత

**లలిత**

89. ఇది యరుదను నొకఁడిది యరుదని చెప్పు
యిది యరుదని విను నెవ్వఁడూ నెఱఁగఁడు ॥పల్లవి॥

పుట్టినవానికినెల్లా భువి మరణము నిత్య -
మట్టే చచ్చినవారి కవ్వల జననము
పుట్టనినాఁడైతేను పొడగానరాదు మేను
కొట్టఁగొనఁ గానరాదు కొన్నాళ్లేకాని ॥ఇది॥

జీవుఁడు నిత్యుఁ డేమిటాఁ జెరుపఁగరానివాఁడు
యీవివేకము దెలిసి యేజాతివారైనా
దైవికమే నమ్మి తమధర్మములఁ బాయరాదు
సావధాన మిదియే సంసారయోగము ॥ఇది॥

చిత్తమూ నీలోపలను శ్రీవేంకటేశ్వరుఁడు
పొత్తునఁ గూడున్నవాఁడు పొదిగి పాయకు నీవు
యెత్తి నాదేహగుణము ఇది జీవగుణ మిది
ఇత్తలాదైవగుణము యిది మఱవకుమీ ॥ఇది॥ 421

**అవతారిక :**

గీతావాక్యాన్ని వినిపిస్తున్నారు అన్నమ్య. ఇది (ఈ ఆత్మ) అరుదనునొకడు అంటే అరుదని భావిస్తాడు. ఇంకొకడు ఇది అరుదని చెప్తాడు. ఇంకొకడు ఇది అరుదని వింటాడు. కానీ వీరెవ్వరూ ఆత్మనెరుగరు. ఓ చిత్తమా ఈ గోలంతా నీకుదేనికి? నీలోపలనే శ్రీవేంకటేశ్వరుడు పొదిగి యున్నాడు. నీవు ఆయనను వదలకు. దేహమంటే యేమిటో, జీవుడు అంటే యేమిటో, పరమాత్మ అంటే





యేమిటో తెలుసుకో అని వివరిస్తున్నారు ఈ కీర్తనలో. ఇదే విధంగా పూర్తి గీతావాక్యాన్ని అన్నమాచార్యులవారు ఆనాడు వినిపించి యుంటారు.

**భావవివరణ:**

ఇది (ఈ ఆత్మ) అరుదైనది. దీనినెవ్వరూ తెలియరు అని ఒకడు తలుస్తాడు. ఇంకొకడు ఇది అరుదైనది అని చెప్పును. ఇంకొకడు ఇది అరుదైనది అని వింటాడు. కానీ వీళ్ళల్లో ఒక్కడు కూడా ఆత్మఅంటే ఏమిటో ఎరుగడు.

పుట్టినవానికి యెవ్వడికైనా ఈ భూమి మీద చావు తప్పదు. అట్లే చచ్చినవాడికి తిరిగి పుట్టుకా తప్పదు. పుట్టనినాడు ఈ దేహం పొడగానరాదు. కొన్నాళ్లే దీని వైభవం. కొట్టగొన (చిట్టచివరకు) ఇది కానరాదు కదా! మధ్యలో వచ్చింది మధ్యలోనే పోతుంది... అంతే.

జీవుడు నిత్యుడు (శాశ్వతమైనవాడు) ఏమిటా చెరుపగరానివాడు (జీవుని ఏవిధముగానూ చెడగొట్టుట అసాధ్యము. ఈ వివేకము (జ్ఞానము) తెలిసిన ఏ జాతివారైనా జరిగేవన్నీ దైవికముగానే జరుగుతాయని నమ్మి తన ధర్మమును పాయరాదు (వదలరాదు). తన ధర్మము తను నిర్వర్తించుచూ పోవలెను. ఇదియే సంసారయోగము. సావధానులై దీనిని నిర్వర్తించవలెను.

ఓ చిత్తమా! ఈ ఆలోచనలన్నీ నీకెందుకు? శ్రీహరి ఎక్కడో వున్నాడని భ్రమపడకు. ఆయన శ్రీవేంకటేశ్వరునివలె నీలోపలనే వున్నాడు. నీ పొత్తున (పక్కనే) నిన్నుగూడియున్నాడు. నీవు పొదిగి (జతయై) పాయకు (విడువకు). నీ దేహగుణములు, జీవగుణములు (జీవుని లక్షణములు), ఇత్తల (ఇక్కడ కనిపించుచున్న ఈ) దేవుని దైవగుణములు వేర్వేరని తెలియుము. ఇది మరువకుము సుమా!

సంపుటి : 2    కీర్తన : అనలము సూర్యుడు నన్నిటందు వెలసినా

సంఖ్య : 445    పుట : 300    రాగం : బౌళి

**బౌళి**

90. అనలము సూర్యుఁడు నన్నిటందు వెలసిన (నా?)
ఘనపవిత్రమైనట్టు ఘనుఁడే పో జ్ఞాని ॥పల్లవి॥

కాంచనము అంటువడినఁ గలదా అందు నింద్యము
పెంచు ముట్టంటువడినఁబెక్కుపదూష్యముగాక
అంచల సుజ్ఞానిఁ బాపమంటునా తాఁ జేసినాను
పంచల నజ్ఞాని నై తేఁ బైకొనీఁగాక ॥అన॥

యెఱుకగల నాలిక నింతైనా జిడ్డంటునా
యెఱుకలేనిచేత నింతా జిడ్డంటుఁగాక
కఱతలయోగిని కర్మములివంటునా
చుఱచుఱ జడునైతేఁ జుట్టుకొనుఁగాక ॥అన॥

తామెరపాకుల నీరు తగ నందు నంటునా
ఆమేర నెందైనాను నంటుఁగాక
యీమేర శ్రీవేంకటేశునిదాసుఁడు భూమిఁ
గామించి తా నుండినానుఁ గడు మాయలంటునా ॥అన॥ 445

**అవతారిక :**

అగ్నిని అందరూ (పవిత్రులూ, అపవిత్రులూ) ఉపయోగిస్తారు. సూర్యుణ్ణి అందరూ చూస్తారు. అంతమాత్రాన అపవిత్రత వారికి (సూర్యాగ్నులకు) అంటుతుందా? అట్లే జ్ఞాని కూడా ఇతరుల సాంగత్యంతో వుండి కూడా ఘనుడే పో అంటున్నారు అన్నమాచార్యులవారు. దీనికి కొన్ని వుదాహరణలు సూచిస్తున్నారు. మనం తామరాకులని అంటాము. అన్నమయ్య నూతనంగా "తాపెరపాకు" అంటున్నారు. తమలపాకులు అనే





ప్రయోగం మనం నిత్యం చేస్తుంటాం కదా! తామెరపాకు మీద నీటిబొట్టులా శ్రీవేంకటేశ్వరుని దాసులు ప్రపంచంతో సంగత్వవున్నా వారు నిస్సంగులే అంటున్నారు.

**భావవివరణ:**

అనలము (అగ్ని), సూర్యుడు అన్నిటందు వెలసినా (అన్నిటితో సంపర్కమున్నా) ఘనముగా పవిత్రముగానే వున్నట్లు, జ్ఞాని సంగత్వంతో వున్నా ఘనుడైన నిస్సంగుడే పో. వాడికి ఏమలినమూ అంటదు.

బంగారాన్ని ఎంతోమంది దుర్మార్గులు కూడా తాకుతుంటారు. దానికి నిందవస్తుందా? అంటరాని వాళ్ళు ఎంతమంది అంటుకొన్నా "ముట్టంటువడదు". దూష్యముగాదు (నిందబడదు). ఒక కార్యము పాపముతో కూడినదైనను జ్ఞానికి యేపాపమూ అంటదు. కాని అజ్ఞానిని మాత్రం ఆ పాపకార్యం పైకొనును (ఆవహిస్తుంది). ఎందుకంటే వాడు ఆ పాపాన్ని మనస్ఫూర్తిగా చేస్తాడు కదా!

మానవుని అవయవాలలో నాలుకకు ఇంతైనా జిడ్డు అంటుతుందా? అదే చేతికి ఎంతజిడ్డు అంటుతుంది? ఎందుకంటే నాలుకకు ఎన్నడూ జిడ్డు అంటుకోని జ్ఞానము బోధిస్తుంది. చేయి పాపం చేస్తుంది. కరతల యోగిని (దుశ్చేష్టలు చేయు యోగిపుంగవుని) అతని కర్మలు అంటునా? ఏనాటికీ అంటవు. అదే చుఱ చుఱ రగిలే మూర్ఖుణ్ణి తప్పక ఆ పాపములు అంటుకొంటాయి.

తామెరపాకుల (తామరాకులపైన) నీరు అంటుకొంటుందా? అందునందునా నీటిబొట్లుంటాయి గాని తడి అంటదు. ఆమేర (అదేవిధంగా) ఎక్కడైనా అంటుగాక వుంటుంది. ఈ విధంగానే శ్రీవేంకటేశుని దాసులు ఈ భూమిమీద కొన్ని కామించి (కోర్కెలతో) వున్నా, వారిని ఈ సాంసారిక మాయలు అంటుతాయా? ఏనాటికీ అంటవు.

సంపుటి : 2 కీర్తన : దోమటి నింతెరగరాతొల్లిటివారు

సంఖ్య : 415 పుట : 280 రాగం : లలిత

**లలిత**

91. దోమటి నింతెరcగరా తొల్లిటివారు
వామదేవ వసిష్ఠ వ్యాసాదులు ॥పల్లవి॥

తానే దైవమైతే తపమేల జపమేల
పూని సారెc బూజించేపూజలేల
కూను వంగి యింటింటc గోరనేల వేcడనేల
యీనెపాన లోకమెల్లా నేలరాదా తాను ॥దోమ॥

తగcదా స్వతంత్రుcడై తే దరిద్రదు:ఖములేల
నొగిలి వ్యాధులచేత నొవ్వనేల
నగుcబాటులైన జననమరణములేల
ముగురువేల్పులదండ మొనచూపరాదా ॥దోమ॥

శ్రీవేంకటేశుcడే శేఖరపుదైవమని
సావధానుc డితనికి శరణుచొచ్చి
భావములోపలc దనపాపబంధములc బాసి
తావుల నాతనికృప దండ చేరరాదా ॥దోమ॥ 415

**అవతారిక :**

దోమటి అంటే నిఘంటువు అర్థం "అన్నము" అని. కానీ అన్నమాచార్యులవారు ఈ పదాన్ని కపటము, మాయ అనే ధోరణిలోనే వుపయోగించారు. పూర్వకాలం నాటి ఋషులైన వసిష్ఠుడు, వామదేవుడు మొదలైనవారు ఈ దేవదేవుని మాయ ఇంతైనా ఎరుగరా? తానే దైవమైతే తపస్సు చేసికోవటం దేనికి? ఇంటింటా వెన్నలు అడుక్కోవటం దేనికి? జననమరణాలేమిటి? కన్నీళ్ళేమిటి? దేవదేవుడై ఎప్పుడూ వుండవచ్చు





గదా! అసలవన్నీ యెందుకు ఈ తిరువేంకటేశ్వరుని శరణాగతులవరాదా? నేనిచ్చిన వివరణ నాకు స్ఫురించనది మాత్రమే.

**భావవివరణ:**

మన పూర్వీకులైన వసిష్ఠ వాసుదేవాది ఋషులు, ఈ దేవదేవుని దోమటి (మాయ) ఇంతైనా (కొంచెమైనా) యెరుగరు. (ఆయన వాళ్ళ శిష్యుడుగా వుంటే... తమ శిష్యునిగానే భావించారు.)

తానే దైవమైతే తపస్సెందుకు చేశాడు? ఆదిత్యహృదయంలాంటి స్తోత్రాలెందుకు పఠించాడు? పూనుకొని శివపూజలెందుకు చేశాడు? కూనువంగి (అభిమానం చంపుకొని) ఇంటింటా వెన్నకోసం వేడుకోవటం దేనికి? ఈ నెపాన (నెపముతో) తానే సర్వేశ్వరుడనని లోకమంతా పరిపాలించవచ్చుగదా! మధ్యలో ధర్మరాజుచే రాజసూయం చేయించటం దేనికి? దుర్యోధనుణ్ణి రారాజా అని పొగడటం దేనికి?

పోనీ తానే సర్వస్వతంత్రుడనుకొందాం. జీవుడనుకొందాం. మరి ఈ జీవుడికి దరిద్రమెందుకు వస్తోంది? దు:ఖమెందుకు కలుగుతున్నది? వ్యాధుల చేత నొగిలి (పీడింపబడి) నొవ్వనేల (బాధపడుట యెందులకు?) హీనజన్మములెందుకు? మరణములెందుకు? హాయిగా ముగ్గురు వేల్పుల సరసనే తానూ వుండవచ్చును కదా! కావున జీవాత్మ పరమాత్మ ఎలా అవుతాడు?

ఆ వ్యర్ధపుటాలోచనలెందుకు? ఈ శ్రీవేంకటేశుడే శేఖరపుదైవము (కొండలలో నెలకొన్న దేవదేవుడు). సావధానుడు (శ్రద్ధగా తన ఆశ్రితులను కాపాడువాడు). ఈ స్వామి శరణుజొచ్చి తన భావములోపల (మనస్సుల నుండికూడా) పాపచింతన (పాపపుటాలోచనలను) బాసి (వదలివైచి) ఆపై ఆయన కృప కొరకై, దండచేరరాదా (ఆశ్రయించరాదా?)

సంపుటి : 2 కీర్తన : మరిగితిసేతు మగిడినేనెందువోదు

సంఖ్య : 455 పుట : 307 రాగం : బౌళి

**బౌళి**

92\. మరిగితి నేమి సేతు మగిడి నే నెందు వోదు
సరుస దైవమ నీకే శరణుచొచ్చేను ॥పల్లవి॥

తల్లి గోపించి మొత్తినఁ దనయుఁడు తల్లికొంగే
యెల్లగాఁ బట్టి పెనఁగి యేడిచినట్టు
వెల్లవిరై హరి నీవు విషయాలఁ జిక్కించితే
ఇల్లిదే నిన్నుఁ దలఁచి ఇటు దూరే నేను ॥మరి॥

కన్నతండ్రి బాలునిఁ జంకంబెట్టి దించితేను
కొన్నేసి విలుచు ముద్దుగునిసినట్టు (?)
వున్నతి నాలోనుండి వూరకే మాయ నాపై
బన్నితే నిన్నే సొలసి పగటులాడేను ॥మరి॥

దైవము దాతవు నీవే తల్లివి దండ్రివి నీవే
భావించి చేపట్టితే నీ బంట నేనింతే
శ్రీవేంకటేశ నీవు చేకొని రక్షించఁగాను
జీవుఁడనయిననేను చెలఁగి మొక్కేను ॥మరి॥ 455

**అవతారిక :**

నాలో అనేక బలహీనతలున్నాయి. వాటి కలవాటుపడ్డాను. నేనెక్కడికి పోతాను? నేను విషయవాంఛలలో జిక్కి అది నీవు చేసిన పని అని నిన్ను నిందిస్తాను. నన్ను మాయలలో చిక్కించి చెడగొడుతున్నావని నిన్ను నేరమెంచుతాను. నీవే తల్లివి తండ్రివి దైవానివి అని నేను నీ బంటునని భావించలేకపోతున్నాను. నీవు శ్రీవేంకటేశ్వరుడవై నన్ను రక్షించే దేవుడవు. నేను జీవుడనని గ్రహించాను. అందుకే శరణని నీకు మొక్కేనయ్యా





అంటున్నారు అన్నమాచార్యులవారు. సరళంగా కనిపించే జటిలమైన కీర్తన ఇది "పగటులాడేను" అంటే పైకి నిన్ను తప్పుపట్టెదను అని చెప్పుకోవచ్చును.

**భావవివరణ:**

ఓ దేవదేవా! మరిగితిని (ఈ వ్యసనములకు మిక్కిలి అలవాటుపడ్డాను). నేనేమి చేతును? నేను మగిడి (మరల) యెక్కడికి పోగలను? సరసుడవైన ఓ ప్రభూ ! నీకు శరణాగతుడనయ్యాను స్వామీ!

ఒక తల్లి బిడ్డ తప్పుచేశాడని కోపించి మొత్తితే (దండిస్తే) ఆ కొడుకు తల్లినొదిలి పారిపోతాడా? ఏడుస్తూ ఆమె కొంగుపట్టుకొని పెనగులాడి మరీ ఆమెతో ఎల్లగా (సమస్తరీతులుగా) మళ్లీ కలహిస్తాడు. ఓ శ్రీహరీ! నీవు వెల్లవిరిసి నన్ను అనేక విషయవాంఛలలో జిక్కించి (అలవరచి) నా తల్లికి కాకుండా జేశావు. ఇల్లిదే (ఇదిగో) అందుకని నేను నాతల్లి (శ్రీవేంకటేశ్వరుడు) ని తలచుకొని నేను బాధలో నిన్ను దూరితిని (తిట్టాను). నేను చేసిన అనేక తప్పుల్లో ఇదీ ఒకటి అనుకోరాదా?

ఒక బాలుడు, వాని కన్నతండ్రి వున్నారనుకో ఏదో కాస్త దించుదాములే అని అప్పటివరకు ఎత్తుకొని కూడా చంకలో నుండి దించితే ఆ బాలుడు కొన్నిసార్లు ఎలుచు (ఏవేవో పోకడలకుపోయి) ముద్దుగా చంకదిగనని గునుస్తాడు. మరి నీవునాలోనే అంతర్యామిగావుండి, నన్నే వూరకే మాయజేసి, నాపై నీమాయాజాలం గప్పితే.. సొలసి (తట్టుకోలేక) పగటులాడేను (పైకి నిన్ను తప్పుపట్టేను). అంతేకదా!

స్వామీ! నా దాతవు, తల్లివి, తండ్రివి మరియు దైవానివీ నీవేకదా! భావించి చేపడితే నేను నీ బంటునే కదా! తండ్రీ! ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు నన్ను రక్షించి చేగొనుటకై, జీవుడనైన నేను చెలగి (అతిశయించి) నీకు మ్రొక్కెదను.

సంపుటి : 2 కీర్తన : ఇట్టె మమ్ము రక్షించుట మేయిదొడ్డ నీకు

సంఖ్య : 503 పుట : 340 రాగం : మాళవిగౌళ

## మాళవిగౌళ

93. ఇట్టె మమ్ము రక్షించుట యేమిదొడ్డ నీకు నేఁడు
బట్టబాయిటనే నీవు పదిరూపు లైతివి ॥పల్లవి॥

చదువుల చిక్కుదిద్ది చక్కఁగాఁ జేసితివి
మొదలఁ గుంగినకొండ మోఁచి యెత్తితి
పొదిగి చేపట్టి తెచ్చి భూమి వుద్ధరించితివి
అదనునఁ బ్రహ్లాదు నట్టె మన్నించితివి ॥ఇట్టె॥

అడుగులు మూఁటనే యఖిలము గొలచితి
బడిబడినే రాచపగ నీఁగితి
బెడిదపులంక విభీషణు నేలించితివి
అదరి పాండవులదిక్కై నిలిచితివి ॥ఇట్టె॥

త్రిపురకాంతలగుట్టు దీర బోధించితివి
వుపమఁ గలికిరూపై యున్నాఁడవు
ఇపుడు శ్రీవేంకటేశ యేలితివి లోకాలెల్ల
యెపుడు మా నుతులకు నిరవైతివి. ॥ఇట్టె॥ 503

**అవతారిక :**

చక్కటి దశావతార కీర్తనను వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. అతి సరళమైన ఈ కీర్తన ఒకటి రెండు చోట్ల తప్పించి దాదాపు కీర్తనంతా సుగమమే. ప్రభూ! నేడు మమ్ము ఇట్టె రక్షించుట నీకేం గొప్ప (ఏమి కష్టం అని భావము). ఆనాడు అసాధ్యులైన రాక్షసులు వున్నప్పుడే నీవు బాహాటంగానే పది రూపములెత్తి దీనుల్ని రక్షించావు, అంటున్నారు.





ఇపుడు ఈ కలియుగంలోకూడా శ్రీవేంకటేశ్వరుడవై మా ప్రార్థనలను మన్నిస్తూనేవున్నావంటున్నారు.

**భావవివరణ:**

ఓ దేవదేవా! ఆనాడు ఘోర దానవులు లోకాలను పీడిస్తున్నప్పుడే నీవు పది రూపములతో బట్టబయటనే (బాహాటంగానే) దుష్టశిక్షణ, శిష్ట రక్షణ చేశావు. నేడు ఇది కలియుగము. మమ్ము ఇట్టె రక్షించుట, యేమిదొడ్డ (గొప్ప) నీకు?

ఆనాడు చదువుల చిక్కుదిద్ది చక్కగజేసితివి (వేదములనెత్తుకుపోయిన సోమకుని చంపి వాటి కష్టం తొలగించావు... మత్స్యావతారము). మొదలన్‌కుంగిన కొండను ఎత్తి మోచితివి (క్షీరాబ్ధిలో మునిగిన మందర పర్వతాన్ని ఎత్తి మోసి నీవీపుపై నిలిపి క్షీరసాగరమథనానికి తోడ్పడ్డావు... కూర్మావతారం). భూమిని చేపట్టి తెచ్చి పొదిగి (నిలుపుకొని) వుద్ధరించితివి (వరాహావతారం). అదనున (సమయంచూసి) ప్రహ్లాదుని ఇట్టే మన్నించితివి (నరసింహావతారం).

అడుగులు మూటనే అఖిలము గొలచితివి (మూడు అడుగులతో త్రిభువనంబులను కొలచితివి... (వామనావతారము). బడిబడినే రాచపగన్ ఈగితివి (వెంట వెంటనే రాజలోకంపై నున్న పగతో వేగిపోతివి... పరశు రామావతారం). బెడిదపు లంకను (గొప్ప లంకాద్వీపాన్ని) విభీషణుని చేత పరిపాలించితివి. (శ్రీరామ చంద్రుడు). అదరి (పూని) శిష్టులైన పాండవులకు దిక్కువై రక్షించితివి (శ్రీకృష్ణావతారం).

త్రిపురకాంతల గుట్టు దీర బోధించితివి (త్రిపురాసుల భార్యల మానమపహరించి అందులోని గుట్టు వివరించితివి, (బుద్ధభగవానుని అవతారము). ఉపమ, కలికి రూపైయున్నాడవు (పోల్చరాని కల్కి అవతారము నెత్తితివి). ఇపుడు ఓ శ్రీవేంకటేశ్వరా! లోకాలనెల్లా యేలితివి. ఎప్పుడూ మా నుతులకు (ప్రార్థనలకు) ఇరవైతివి (స్థానము యైయుంటివి).

సంపుటి : 2 కీర్తన : తానే తెలియుగాక తలచగనెట్టువచ్చు
సంఖ్య : 473 పుట : 319 రాగం : గుండక్రియ

### గుండక్రియ

94. తానే తెలియుఁగాక తలఁచఁగడ నెట్టువచ్చు
నానాగతుల తననాటకపుమాయ ॥పల్లవి॥

అట్టె యేఁబదియైనయక్షరాలలోనట
తిట్టులట వొకకొన్ని దీవెనలటా
మట్టుతో వేదములట మంత్రములట కొన్ని
యిట్టివి చిక్కులు భూమి నిఁకనెన్ని గలవో ॥తానే॥

కదిసిన యఱువదిగడియలలోనట
పొదలు నడకలట భోగములటా
నిదురట వొకకొంత నేరుపులు కొన్నియట
యెదుట చూడఁగఁ జూడ నిఁక నెన్ని గలవో ॥తానే॥

రేవగలు కన్నులివి రెంటిలోనేయట
దైవము జీవులలోనే తానకమట
శ్రీవేంకటాద్రిమీద జెలఁగి యా (గెనా?) తఁడే యట
యేవంక నీచేఁతలు యిఁక నెన్నిగలవో ॥తానే॥ 473

**అవతారిక :**

ఈ జగన్నాటకంలో జీవులందరూ పాత్రధారులే. నాటకం జరుగుతున్నంతకాలమూ ఇది నిజము, నిత్యము అని భ్రమకలుగుతూనే వుంటుంది. ఇది ఎప్పుడు మొదలవుతుందో ఎప్పుడు పూర్తవుతుందో తనొక్కడికే (ఆ శ్రీహరికే) తెలియును. ఇతరులకి తలచగ ఎట్టువచ్చును అంటున్నారు అన్నమయ్య. అనేక పోకడలుగల నాటకం ఇది అంటున్నారు. ఉన్న వాఙ్మయం అంతా ఏబది అక్షరాలే. కాలగమనమంతా





అఱువది గడియలతోనే ముడిపడివుంది. దేవునిలోను జీవునిలోను తానకమై (స్థానమై) యున్నది ఆ శ్రీవేంకటేశ్వరుడే. నీలీలలు ఎన్నని చెప్పేదయ్యా! అంటున్నారు. ఇది చాలా క్లిష్టమైన కీర్తన అని నమ్మక తప్పదు. అవునా?

**భావవివరణ:**

తన జగన్నాటకము యొక్క మాయ యెట్టిదో తానే (ఆ దేవదేవుడే) తెలియును గాక! నానా గతుల (అనేక రీతులుగానున్న) దానిని ఎట్టుతలచగవచ్చు (ఎట్లు ఊహించగలము?)

అట్లే భాషలో వున్నది కేవలం 'ఏబది' అయిన అక్షరములే (ఏభయి అక్షరాలు) వున్నాయి. వాటితోనే కొన్ని తిట్లంట. మరికొన్ని దీవెనలంట. మట్టుతో (మితిగా) కొన్ని వేదములు అయినవట. మరికొన్ని మంత్రములయినవంట. ఇట్టి చిక్కు సమస్యలు భూమ్మీద ఇంకా ఎన్ని వున్నాయో యెవడికి తెలుసు?

ఒక దినమునకు అరువది గడియల కాలము మాత్రమే వుంటుంది (1 గడియ = 24 నిముషాలు). కదిసిన (సమానముగానున్న) ఆ కాలములో పొదలు (వర్ధిల్లెడి) నడతలట. అందులోనే భోగములంట. అందులోనే కొన్ని నిద్దురలంట, కొంతసేపు తన నేర్పరితనం ప్రదర్శించుకోవటం అట. చూడగాచూడగా ఇట్లాంటివి ఇంకా ఎన్నున్నాయో ఎవరికి తెలుసు?

మాకువున్నవే రెండు కన్నులు. ఆ రెండిటితోనే రాత్రిం బగళ్ళ తారతమ్యం తెలుసుకొంటున్నాము. దేవుడు జీవుడు ఈ రేయింబవళ్ళులాగా పరమాత్మకు రెండు కన్నులు. పరమాత్మ ఎవరు? శ్రీవేంకటాద్రిపై చెలగే (వర్ధిల్లే) ఆ శ్రీవేంకటేశ్వరుడే. ఏవిధంగా చూచినా అనూహ్యమైన నీ చేతలు ఎన్నున్నాయో ఎవరు చెప్పగలరు తండ్రీ!

సంపుటి : 2    కీర్తన : ఇందుకా కోరి పుట్టె యిట్టిబదుకు

సంఖ్య : 397    పుట : 268    రాగం : సామంతం

## సామంతం

95. ఇందుకా కోరి పుట్టె యిట్టిబదుకు
పొందుల శ్రీహరితోడిపొత్తుల మాబదుకు ॥పల్లవి॥

బడబాగ్ని ఆఁకటిబారిఁబడ్డబ్రదుకు
పడఁతులకూటములఁ బడ్డబదుకు
వొడలి తోలినెమ్ముల వొడిగట్టేబదుకు
బడిఁ బుణ్యపాపాలపై తరవు బదుకు ॥ఇందు॥

నాలుక గడచితేను నరకపుబదుకు
మూలమలమూత్రాల మూటగట్టేబదుకు
కాలము నడిపి వూర్పుగాలిఁబుచ్చేబదుకు
పాలుమాలేయింద్రియాల పంగెమాయ బదుకు ॥ఇందు॥

ఇంపుసుఖ దు:ఖాల యెండనీడబదుకు
మంపుఁగామక్రోధాలమాటు బదుకు
జంపుల శ్రీవేంకటేశు శరణు చొరఁగ నేఁడు
సొంపు లిన్నిటా మాకు సుఖమాయ బదుకు ॥ఇందు॥ 397

**అవతారిక :**

ఎంతో పుణ్యం చేసికొంటేనేగాని జీవికి 'మానవజన్మ' లభించదు. కష్టపడి కోరి అట్లా పుట్టింది, ఇందుకా అని విచారిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఇట్టిబ్రతుకుకోసం ఇన్ని తిప్పలు పడవలెనా? శ్రీహరితో పొత్తులు పొందులు పెట్టుకుంటే మా బ్రతుకునకు అర్థం వుంటుంది. నిద్ర, భయము, ఆకలి, శరీరవాంఛల కోసం బ్రతికే పుట్టుక





ఏం పుట్టుక? జంపుల శ్రీవేంకటేశు శరణు చొరగ నేడు మాకు బ్రతుకు సుఖమాయెనంటున్నారు? జంపులంటే ఏమిటి?

**భావవివరణ:**

ఓ మానవులారా! ఆలోచించండి. కోరి మానవునిగా పుట్టింది ఇందుకా? ఇట్టిబ్రతుకు కోసమా అన్ని అవస్థలు పడింది? వద్దు. ఇక మా బ్రతుకును, శ్రీహరితోడి పొత్తులతోనే గడుపుతాము. ఆయన పొందులతోనే జీవిస్తాం.

ఈ బ్రతుకు ఎంత నీచమైనదో ఆలోచించండి. ఇది బడబాగ్ని వంటి ఆకలి బారిన బడ్డ బ్రతుకు. పడతుల కూటముల (స్త్రీ సాంగత్యానికి) వెంపర్లాడే బ్రతుకు. ఒడలితోలి నెమ్ములకు (ఒంటి తడికోసం) సిద్ధపడ్డ బ్రతుకు. (చెమటోడ్చి బ్రతికే జీవితం) వరుసగా చేసికొనిన పాపపుణ్యముల 'పైతరవు' (హరించివేయు) బ్రతుకు.

నాలుక గడచితేను (నాలుక ఇష్టంవచ్చినట్లు నడిచినందువల్ల) నరకంగా బాధలు పడిన బ్రతుకిది. మలమూత్రములను మూటగా కట్టి తెచ్చుకొన్న బ్రతుకు. అన్నిటికంటే వింత ఏమిటంటే... కాలము నడుపుతుంటే ఉచ్ఛ్వాస నిస్వాసాలనే గాలి వూర్పుల లెక్కతో సరిచూసుకొనే బ్రతుకిది. పాలుమాలే ఇంద్రియాలు (సోమరిపోతులైన ఇంద్రియాలచేత) పంగెమాయె (ఉచ్చు అయిపోయిన) బ్రతుకు ఇది.

ఈ మానవుని బ్రతుకులో సుఖదు:ఖాలు ఎండా, నీడా వలె వస్తూనే వుంటాయి, పోతూనే వుంటాయి. కామక్రోధాల మంపులో (మత్తులో) గడిపే బ్రతుకిది. ఇట్లాంటి నీచమైన బ్రతుకు కోసమా ఆ శ్రీహరిని అంతవేడుకొన్నది? కానే కాదు. జంపుల శ్రీవేంకటేశ్వరుని (చెంపసరసులు అనే చెవి ఆభరణములను ధరించిన తిరుమలేశుని) శరణుజొచ్చి, నేడు మా బ్రతుకు సొంపుగా సుఖవంతమైనది.

సంపుటి : 4 కీర్తన : నాకు నాకే సిగ్గయ్యీని నన్నుజూచుకొంటేను

సంఖ్య : 2 పుట : 2 రాగం : దేసాళం

## దేసాళం

96\. నాకు నాకే సిగ్గయ్యీని నన్ను జూచుకొంటేను
చేకొని నీవే మన్నించc జెయ్యొగ్గేcగాని ॥పల్లవి॥

సేయరానిపాపములు సేసివచ్చి యేనోర
నాయెడ నిన్ను వరములడిగేను
కాయముతో నింద్రియకింకరుcడనై యేమని
చేయార నీబంటనని చెప్పుకొనేను ॥నాకు॥

వేగిలేచి సంసారవిధులకే వొడిగట్టి
యేగతిc గొసరి నీపై నేcట వేసేము
ఆగడపు బంగారుకాతుమనేన (య?)మ్ముకొని
భోగపుమోక్షము నెట్టు వొందించు మనేము ॥నాకు॥

కలుపుట్టుగుబదుకు కాంతలకు వెచ్చపెట్టి
వలసి నేcడెట్టు నీవార మయ్యేము
నెలవై శ్రీవేంకటేశ నీవే కరుణించితివి
బలిమిసేసి నీ కెట్టు భారము వేసేము ॥నాకు॥ 2

**అవతారిక :**

నన్ను చూసుకొంటే నాకే సిగ్గు వేస్తున్నదయ్యా! స్వామీ! ఏదో పోనీలే అని నీవే మన్నించి చేయినందించాలి. లేకపోతే మేము నీవారముయెట్లా అవుతాము? నీవే నెలవై మమ్ము కరుణించాలి అంటున్నారు అన్నమయ్య. ఈ కీర్తనలో 'ఏcట' అనే మాట వాడారు. దాని అర్థం ఏ వొక్క నిఘంటువులోనూ దొరకదు. సందర్భాన్నిబట్టి ఏcట అంటే నెపము అని పెద్దలు వివరించారు. ఈ సంసార విధులకు, మేము వొడిగట్టేము.





అటువంటప్పుడు నీపై నెపము మేమెట్లు వేయగలము ప్రభూ! అంటున్నారు. మిగతా కీర్తన అంతా సరళంగానే వున్నది.

**భావవివరణ:**

ఓ దేవదేవా! నన్ను జూచుకొంటే నాకు నాకే సిగ్గవుతున్నదయ్యా! నేనెంతనీచుణ్ణి? ఏదోవిధంగా, నన్ను చేకొని (స్వీకరించి) నీవే మన్నించుటకు చెయ్యొగ్గాల (ప్రయత్నించాలి). కానిచో నా గతేమిటి?

నేను చేయరాని పాపాలు చేశాను. నీ ఎదురుగా ఏనోరు పెట్టుకొని నాకు వరములిమ్మని అడుగుతాను. నా ఈ శరీరంతో ఇంద్రియాలకు కింకరుడనై (బానిసనై) దుష్కర్మలు చేసి చేయార (సిద్ధపడి) నీబంటునని ఏ ముఖం పెట్టుకొని చెప్పుకొంటాను?

వేగిలేచి (పొద్దున లేచిన దగ్గరనుంచి) నా సమయమంతా సంసార విధులు నిర్వర్తించటానికే వినియోగించి, ఏగతి నీపై కొసరి (సంకోచించక) వేటు వేసేను (నెపము వేయగలను?) ఆగడపు బంగారునకు (త్రుచ్ఛమైన కనకానికి) నా ఆత్మగౌరవాన్ని అమ్ముకొని ఇంకా సుఖప్రదమైన మోక్షాన్ని ఎట్లు ఒందించుమనేము (ఇమ్మని అడుగుతాను?)

పుట్టిన దగ్గరనుంచి బ్రతుకును స్త్రీల కోసం వెచ్చించి ఈ రోజున మేము నీవారము అని ఏవిధంగా చెప్పుకొంటాము? కానీ ఓ శ్రీవేంకటేశ్వరా! నెలవై (మా హృదయంలో స్థితుడవై, నీవే మమ్ము కనికరించి అనుగ్రహించినావు. ఇంకా బలవంతంగా నీపై భారము ఎట్లు వేయగలము? అయినా తప్పదు. మా భారం నీదే తండ్రీ!

సంపుటి : 4 కీర్తన : ఎవ్వరు గలరెవ్వరికి

సంఖ్య : 46 పుట : 394 రాగం : దేశాక్షి

## దేశాక్షి

97. ఎవ్వరుగల రెవ్వరికి
ఇవ్వల నవ్వల నితఁడేకాక ॥పల్లవి॥

ముద్ద సేసినటు మొదలఁ గడుపులోఁ
బెద్దగాఁ దాఁ బెరుగునాఁడు
ఒద్దనెవ్వరుండిరొొకరైనా
ఒద్దికైన బంధుఁడొకఁడేకాక ॥లలలలల॥

వరతఁ బోవునట్టి వడి సంసారపు
తెరలఁ దగిలి తాఁ దిరుగునాఁడు
వెరవకుమని భావించువారెవరు
తరితోడ నీతఁడె కాచుఁగాక ॥ఎవ్వ॥

ఉడుకఁ బెట్టినట్టి వుడివోయిన నరకాల
నుడుకుచుఁ దానుండునాఁడు
తడవువారెవ్వరంతటఁ దన్ను
కడవేగ వేంకటపతిగాక ॥ఎవ్వ॥ 49

**అవతారిక :**

ఒక్కసారి ఆలోచించండి. మానవులు తల్లి కడుపులో తొమ్మిదినెలలు గడుపుతున్నంత కాలం ఆ కూపములో వాడికి తోడూ నీడా అయి తిండిపెట్టి వాణ్ణిపెంచి రక్షించిందెవరు? సంసార తాపత్రయంలో కష్టాలకు బెంబేలెత్తిపోతుంటే ఆశాకిరణంలా అడ్డుపడుతున్నదెవరు? ఘోర ప్రమాదంలో సమర్ధులైన పెద్దలంతా అనంత నీరవ నిశీధిలో మరణిస్తుంటే పాకటంకూడా రాని పసిగుడ్డును ఒక్కదాన్నే బ్రతికించినదెవరు? ఇవ్వల ఆ





పాపాయికి, అవ్వల (అంటే గతించిన ఆ పెద్దలకి) ఇతడు గాక ఎవ్వరికి ఎవ్వరు గలరు? అంటున్నారు అన్నమయ్య.

**భావవివరణ:**

ఎవ్వరుగలరెవ్వరికి (ఎవరికి ఎవరున్నారు?) ఇవ్వల (ఈ మన భూలోకంలోను) అవ్వల (అక్కడ నున్న పరలోకములోనూ) ఇతడే కాక (ఈ శ్రీహరికాక ఎవరు దిక్కు?)

ఒక ముద్ద చేసినట్లు మనను అమ్మకడుపులో పెడతాడు. అప్పుడు ఆ జీవి పెద్దగా పెరుగుతాడు. అప్పుడు వాడి ఒద్ద యెవరుంటారు? ఒక్కరైనా వుంటారా? ఆ తరువాత వాడిని మావాడు అనే బంధువుల్లో ఒక్కడైనా ఆగర్భనరకంలో నీకు దిక్కూ మొక్కవుతాడా? అసలు ఆ తల్లికి నొప్పులు తెప్పించి నిన్ను బయటపడేసిందెవరు?

'వరఁత' అంటే 'ఏఱు' అని అర్థం. ఏఱులాగా వడిగా ప్రవహించే సంసారపు తెరలలో (కుతకుతలలో) పడి పిచ్చివాడిలా తిరుగుతున్నప్పుడు భయపడకు నాయనా! అని అంతరాత్మలా మనోధైర్యాన్ని ఆలోచనలను (బ్రెయిన్ వేవ్స్) అందించువారెవరు? ఇంకా మీ బుర్రకి తట్టలేదా? తరితోడ (ఓడ వలే) రక్షించేదెవరు? ఆ దేవదేవుడు కాక ఇంకొకరెవరున్నారు?

సరే! ఎలాగైతేనేం చచ్చామనుకోండి. ఆ తరువాత ఉడకబెట్టినట్లు నరకంలోని కూపాల్లో వుడకబెడుతున్ననాడు, ఉడికిపోతూ దిక్కులేక ఏడుస్తున్ననాడు, అంతట తడవు వారెవ్వరు? (చేతులతో ప్రేమగా నిమిరి ఓదార్చే వారెవ్వరు?) తన్ను (తనను) రక్షించేదెవరు? ఇదిగో ఈ శ్రీవేంకటపతే. ఇంకెవ్వరూ రారు రాబోరు. అమాయకులారా! ఇప్పటికయినా నన్ను నమ్మండి. ఆ ఏడుకొండలవాడిని శరణు అనండి.

సంపుటి : 4 కీర్తన : వట్టిజోలియెంతలేదు

సంఖ్య : 481 పుట : 324 రాగం : కన్నడగౌళ

## కన్నడగౌళ

98. వట్టిజోలి యెంత లేదు వైరాగ్యమే సుఖము
నెట్టుకొని వివేకింపనేరవలెఁగాని ॥పల్లవి॥

కట్టుకొంటే నెంతైనాఁ గలదు సంసారము
పట్టి చేసితేఁ గలవు పనులెన్నైనా
చుట్టుకొంటే నూరఁగలచుట్టరికముఁ గలదు
అట్టె మోక్షము గడించే దరు దింతేకాని ॥వట్టి॥

చేసేనంటేఁ గలవు సేనాసేన పనులు
లాసి తగిలించుకొంటే లంపటా లంటు
ఆసలు పెంచఁ జూచితే నంతకంతకుఁ బెరుగు
వేసిరి శాంతిఁబొందుటే వేడు కింతేఁకాని. ॥వట్టి॥

పనిగొంటేఁ బెనుగొనుఁ బంచేంద్రియంబులు
వెనుకొంటేఁ జిమ్మిరేఁచు వేడుకలు
తనిసి శ్రీవేంకటేశు దసానుదాసుఁడై
కొనకెక్కఁగ నాతనిఁ గొలువవలెఁగాని ॥వట్టి॥ 481

**అవతారిక :**

'వట్టిజోలి' అంటే ప్రయోజనం లేని సంగత్వం. పనికిరాని ఆ అనుబంధాలకన్నా విరాగిలా బ్రతుకుటయే మంచిది అంటున్నారు అన్నమయ్య. తెగించి వివేకిలా బ్రతుకుట నేర్వవలెను అంటున్నారు. ఎంత తగిలించుకుంటే అంత తగులుకొంటుంది ఈ సంసార లంపటం. ఏదో ఒకనాటికి విసుగుబొంది శాంతిని పొందాలి. లేకపోతే దారితెన్నూ వుండదు. కొనకెక్కి ఆ శ్రీవేంకటపతిని గొలువవలెను అంటున్నారు.





దసానుదాసులై అనే మాట అచ్చుతప్పు అని నా భావన. అది దాసానుదాసులై అయిఉంటుంది.

**భావవివరణ:**

ఓ మానవులారా! ప్రయోజనంలేని సంగత్వం ఎంతవున్నా దేనికి? దానికంటే వైరాగ్యమే మిక్కిలి సుఖమైనది. నెట్టుకొని (ఉద్యమించి) వివేకముతో ఈ విషయం నేర్వవలెను.

ఈ సంసారము (ప్రపంచము) వున్నది చూశారా, ఇది ఎంతకట్టుకొంటే అంత వుంటుంది. పూనుకొని పరులకు మేలు చేయాలనుకొంటే ఎన్ని పనులైనా గలవు. చుట్టుకొంటే (కల్పించుకొంటే) వూళ్ళో యెన్నో చుట్టరికాలు కలుస్తాయి. కాని మోక్షం సంపాదించాలి అంటే మాత్రం బహు అరుదుగా సాధ్యం. అంతేకాని మరొకటి కాదు.

చేయాలి అనుకొంటే పనులు సేనాసేన (మిక్కుటముగా) కలవు. లాసి తగిలించుకొంటే (గట్టిగా అంటించుకొంటే) ఎన్ని లంపటాలైనా అంటుకొంటాయి. ఆశలు యెంత పెంచుకుంటే అంత పెరుగుతాయి. వాటిపై వేసరి (విసుగు కలిగి) ఎంత శాంతి పొందితే అంత సంతోషం కలుగుతుంది. ఇదింతే కాని మరొకటి కాదు.

పనిగొంటే (ఆశక్తి కలిగితే) మానవుని పంచేంద్రియములూ పెనగొను (పెనవేసుకొని, లోలుడిని చేస్తాయి). వెనుకొంటే (వెనకడుగువేస్తే) వేడుకలు (ఆనందము) జిమ్మిరేచు (తలకెక్కుతుంది). తనిసి (తృప్తితో) శ్రీవేంకటేశ్వరుని దాసానుదాసులైతే కొనకెక్కుట అత్యున్నత స్థానము పొందుట తథ్యము. ఆయన శరణాగతిలో వుండాలి, అంతేకాని మరొకటి కాదు.

సంపుటి : 4 కీర్తన : ఉమ్మడికర్మములాల వుండజోటు మీకులేదు

సంఖ్య : 132 పుట : 89 రాగం : సాళంగనాట

## సాళంగనాట

99\. ఉమ్మడికర్మములాల వుండఁ జోటు మీకు లేదు
యిమ్ముల నెందైనాఁ బోరో యివి లేనిచోటికి ॥పల్లవి॥

పెట్టినది నుదుటను పెరుమాళ్ల లాంఛనము
దట్టమై బుజములందు దైవశిఖామణిముద్ర
నెట్టన నాలుకమీఁద నీలవర్ణునామమిదె
అట్టె హరిదాసులకంటునా పాపములు ॥ఉమ్మ॥

మనసునఁ దలఁచేది మాధవుని పాదములు
దినముఁ గడుపునించేది హరిప్రసాదము
తనువుపైఁ దులసిపద్మాక్షమాలికలు
చెనకి హరిదాసులఁ జేరునా బంధములు ॥ఉమ్మ॥

సంతతముఁ జేసేది సదాచార్యసేవ
అంతరంగమున శరణాగతులసంగ మిదే
యింతటాను శ్రీవేంకటేశుఁడు మమ్మేలినాఁడు
అంతటా హరిదాసుల నందునా అజ్ఞానము ॥ఉమ్మ॥ 132

**అవతారిక :**

ఉమ్మడి కర్మములంటే సంచితకర్మలు, ఆగామి కర్మలు. సంచిత కర్మలు మనకు పూర్వ జన్మల నుండి ప్రాప్తించిన పుణ్యపాపకర్మల ఫలములన్నమాట. ఇక ఆగామి కర్మలంటే మనం ఈ జన్మలో చేసిన కర్మమలకు ఫలితం. ఇప్పుడు కొంత అనుభవించి కొంత రాబోయే జన్మకి అట్టేపెట్టుకొంటామన్నమాట. ఈ ఉభయకర్మల ఫలితం అనుభవించక ఆ ఏడుకొండలవాడికి కూడా తప్పలేదు. మనం యెంత? కానీ అన్నమయ్య





ఆ ఉభయకర్మలను తనజోలికి రాకుండా ఎక్కడకైనా పొమ్మని బ్రతిమిలాడుతున్నారు. తను ఎటువంటి హరిదాసో వివరించి తనని వదిలేయమంటున్నారు. కొసమెరుపేమంటే ప్రారబ్ధకర్మ అని ఇంకొకటుంది. మనం ఏమీ చేయకపోయినా భగవదేచ్ఛతో చుట్టుకొంటుంది. దానినాపగలవారెవ్వరూ లేరు. కాకపోతే ఆయన దాని తాపాన్ని తగ్గించగలడు. అదీ హరిదాసులకే సుమండీ!

**భావవివరణ:**

ఓ ఉభయకర్మములారా! నావద్ద వుండటానికి మీకు చోటులేదు. ఇమ్ముల (ఇప్పటికిప్పుడు) ఎక్కడికన్నాపోండి. ఎక్కడికిపోతారు? ఇవి లేనిచోటికి పోండి. అంటే హరిదాసులు లేని చోటు. ఇవి పుష్కలంగా అవసరం అవుతాయి, అక్కడకు పోండి.

మేము మా నుదుటిపై పెరుమాళ్ళు (భగవంతుని) లాంఛనము (పంగనామాలు) ధరించాము. మా భుజములమీద దట్టమైన శంఖచక్రాల ముద్రలు ధరించాము. నాలుక మధ్య స్పష్టంగా నీలవర్ణుడైన శ్రీహరినామం వుంటుంది. మరి పాపము అట్టి హరిదాసులకు ఎట్లా అంటుకొంటుంది?

సరె, మా బాహ్య స్వరూపం అట్లావుంటే మా అంత: శరీరం ఎలావుందో వినండి. మేము మా మనస్సులో సదా తలచేది మాధవుని పాదపద్మములే, రోజూ మా కడుపు నింపుకొనేది శ్రీహరి ప్రసాదముతోనే. మేము శరీరంపై ధరించేది విష్ణుతులసిమాలలు. అటువంటి హరిదాసులకు భవబంధములు అంటుకోగలవా?

ఇక మా దినచర్య ఎట్లావుంటుందో వినండి. మేము సంతతము (ఎల్లప్పుడూ) చేసేది సదాచార్యుల సేవ. మా ఆత్మారాముడు అనుక్షణం శ్రీహరి శరణాగతుల సాంగత్యంతోనే తృప్తి చెందుతాడు. ఆ శ్రీవేంకటేశ్వరుడు అన్ని విధాలా మమ్ము పరిపాలిస్తుంటాడు. అటువంటి హరిదాసులను అజ్ఞానం సమీపించగలదా? ముమ్మాటికీ అసాధ్యం.

సంపుటి : 4 కీర్తన : కటకట యీమాయ గడచుటయెట్లో
సంఖ్య : 96 పుట : 65 రాగం : మలహరి

**మలహరి**

100. కటకట యీమాయ గడచుట యెట్లో
ఘటనలహరికృప గలిగినఁగాక ॥పల్లవి॥

యిరవగుజీవుల కెంతగలిగినా
పరధనకాంతలే బలుప్రియము
ధరఁ గర్మపుఁజేఁతలలోనెల్లా
సొరిదిఁ బాపమే సులభము ॥కట॥

నానారుచులు యనంతము గలిగిన
కానిపదార్థమె కడుఁ దీపు
పానినచదువులపఠన లుండఁగా
మాననిదుర్భాషమాఁటలే హితవు ॥కట॥

యెదలో శ్రీవేంకటేశ్వరుఁడుండఁగ
సదరపుదివిజులు చవులయిరి
అదనను శ్రీగురుయానతి గలుగఁగ
పొదిగొని యివి తలపోయఁగ వలసె ॥కట॥ 96

**అవతారిక :**

కటకటా! అంటే నేటి కాలంలో అయ్యయ్యో! అనడం అన్నమాట. అయ్యయ్యో! ఈ మాయను నెగ్గుకురావడమెట్లో అర్థం కావటంలేదు. హఠాత్తుగా ఘటన మాదిరిగా శ్రీహరి కృప కలిగితే యేమోకాని, ఇది అసాధ్యమనిపిస్తున్నది అంటున్నారు అన్నమాచార్యులవారు. మానవ సహజమైన బలహీనతల వల్ల నరుడు తనకెంతవున్నా పరస్త్రీలమీద వ్యామోహం, పరుల ధనం మీద కాంక్ష వదలలేదు. తనకెన్ని





రుచులువున్నా పొరుగింటి పుల్లకూరే బాగుంటుందంటాడు. ఎంత చదువుకున్నా దుర్భాషలాడుట మానడు. ఎదురుగా శ్రీవేంకటేశ్వరుడు వున్నా ఎందరెందరో దేవతలకు మొక్కుతాడు. శ్రీగురుకృప కలిగేదాకా వీడు తన పద్ధతి మార్చుకోడు అంటున్నారు.

**భావవివరణ:**

అయ్యో! హతవిధీ! ఈ మాయను గడచుట (అధిగమించుట) ఎట్లు? ఘటనల (హఠాత్తుగా ఒక ఘటనవలె) హరికృప కలిగితే కాని ఈ మాయను దాటుట అసంభవమని తోస్తున్నది.

ఈ జీవులు యెంత విచిత్రమైనవారు!! ఇరవుగ (సుస్థిరంగా) వీరికెంత కలిగినా, పరులధనము మీదను, పరస్త్రీలమీదనే వీరి వ్యామోహం వుంటుంది. ఈ భూమి మీద పుణ్యకార్యాలు చేయాలంటే శ్రమకానీ, పాపము సులభంగా, సొరిది (వరుసగా) చేసికొంటూ పోవచ్చును. అవునా?

మనకు అనేక రుచులు ఆస్వాదించటానికి సిద్ధంగా వున్నా, అవికూడా అంతులేకుండావున్నా కానీ వారికి 'కాని పదార్థాలే కడుదీపు' (పనికిరాని పదార్థాలే ఎంతో తీయగా వుంటాయి). అందుకే పొరుగింటి పుల్లకూర రుచి అంటారేమో! పానిన (పూని స్వీకరించిన) చదువులు ఎన్ని పఠించటానికి వున్నా పలుకరాని దుర్భాషలే ఇష్టంగా పలికి ఆనందిస్తాడు. ఎంత విచిత్రం!!

అందరి యెదలో (హృదయంలో) స్థిరంగా చూస్తే శ్రీవేంకటేశ్వరుడు వున్నాడు. కానీ ఈ మానవులకు.. సదరపు దివిజులు (తేలికగా అనుగ్రహించే చిల్లర దేవుళ్ళే) చవులయిరి (ఇష్టమవుతారు). అదనను (తగిన సమయంలో) శ్రీగురుయానతి (శ్రీవైష్ణవ గురువుల ఆశీర్వాదం) లభించడం వలన ఈ విపరీతమైన తలపోతలు నశించినవి. మేము ధన్యులమయ్యాము.

సంపుటి : 2    కీర్తన : పావనము గావో జిహ్వా బ్రదుకవో జీవుడా

సంఖ్య : 359    పుట : 242    రాగం : భూపాళం

**భూపాళం**

101. పావనము గావో జిహ్వా బ్రదుకవో జీవుఁడా
వేవేల కితని నింక వేమారునుఁ బాడి ॥పల్లవి॥

హరినామములే పాడి ఆతనిపట్టపురాణి
ఇరవై మించినయట్టియిందిరఁ బాడి
సరి నిరువంకలాను శంఖచక్రములఁ బాడి
వరదకటిహస్తాలు వరుసతోఁ బాడి ॥పావ॥

ఆదిపురుషునిఁ బాడి అట్టె భూమిసతిఁ బాడి
పాదములఁ బాడి నాభిపద్మముఁ బాడి
మోదపు బ్రహ్మాండాలు మోచేవుదరముఁ బాడి
ఆదరానఁ గంబుకంఠ మంకెతోఁ బాడి ॥పావ॥

శ్రీవేంకటేశుఁ బాడి శిరసుతులసిఁ బాడి
శ్రీవత్సముతోడురముఁ జెలఁగి పాడి
లావుల మకరకుండలాలకర్ణములు పాడి
ఆపటించి యితని సర్వాంగములుఁ బాడి ॥పావ॥ 359

**అవతారిక :**

అనంతశయనుడైన గోవిందునికి మంగళము పాడుతున్నారు అన్నమాచార్యులవారు. శ్రీహరిని వేవేలు చందముల కీర్తించి జిహ్వాను (నాలుకను) పునీతం కమ్మంటున్నారు. తన జీవుణ్ణి వేమారును బాడి పునీతుడై బ్రతుకమంటున్నారు. తన అంగాంగాలను ఆ స్వామి శంఖ చక్రాదులను బాడి (పాడి అంటే కీర్తించి) ధన్యులవమంటున్నారు. జయమంగళం అని లేకపోయినా దీనిని మంగళగీతికలా





భావించవచ్చును. ఆవటించి ఇతని సర్వాంగములను బాడి పావనము గమ్మంటున్నారు. అంటే?

**భావవివరణ:**

ఓ నాలుకా! నీవు పునీతము కారాదా? ఓ జీవుడా! ఇంక నితని వేమారున్ పాడి (వేయి విధముల కీర్తించి) వేవేల బ్రతుకవో (దీప్తించుచు జీవించుము).

హరినామమును గానము చేయుము. అతని పట్టపురాణియై ఇరవై (సుస్థిరముగా) మించినయట్టి (అతిశయించిన) ఇందిరబాడి (శ్రీదేవిని కీర్తించుము). ఇరువంకలా (శ్రీహరి కుడి ఎడమవైపులలోగల శంఖ చక్రములను పాడి (కీర్తించుము). శ్రీహరి కటి ప్రదేశముననున్న వరద హస్తమును వరుసతో పాడి (వరుసగా కీర్తించుము. ఆ విధముగా తరించుము).

ఆదిపురుషుడైన ఆదినారాయణుని పాడి (కీర్తించెదము), అట్లాగే భూదేవీ సతిని కీర్తించెదము. ఆ శ్రీదేవిభూదేవి ఆ స్వామి పాదములను ఒత్తుచుండగా వాటిని కీర్తించెదము. పదునాల్గు భువనములను మోదముతో (ఆనందంగా) తన వుదరములో మోయుచున్న ఈ పద్మనాభుని పాడి (కీర్తించెదము), అంకెతో (ఈ స్వామికి వశమై) ఆదరాన (సగౌరవంగా) కంబు కంఠమును (శంఖమువంటి ఆయన మెడను) పాడి (కీర్తించెదము.)

శ్రీ వేంకటేశ్వరుని కీర్తించెదము. ఈయన తలపై నున్న తులసి మాలలను పాడి (కీర్తించెదము). చెలగి (విజృంభించి), శ్రీవత్సము అను పుట్టుమచ్చగల ఉరము (వక్షస్థలమును) పాడి (కీర్తించెదము). ఆవుల మకరకుండలముల (బలమైన మకరాంకములు గల కుండలములను ధరించిన) చెవులకు పాడి (కీర్తించెదను). ఆవటించి (పొందుపడి) ఇతని సర్వాంగములను పాడి కీర్తించెదము.